# రచయితల స్వాతంత్ర్యం

## (అపహరణకు కుట్ర)

శ్రీ గోపాల మిత్తల్

అనువాదం : సింగరాచార్య



కళ్యాణీ ప్రచురణలు

వాత్తేరు

# విషయ సూచిక



అధ్యాయం — పేజీ

# ఉపోద్ఘాతం

ఈ గ్రంథం పరిమాణంలో చిన్నది, కొంచెం
ఆందోళన కరమైన నామధేయంగలది అయినా, రచయితలకు
సర్వత్ర ఎదురవుతూన్న ప్రమాదాలను వారికి తెలియజెప్ప
టానికి చేసిన విశిష్ట ప్రయత్నం. ప్రాధాన్యతదృష్ట్యా జాతీయ
పరిధులను అధిగమించిన విషయాలనుగురించి ఒక భారతీయుడు
ఇట్టి సంక్షిప్తరచన చేయటానికి ఇదే ప్రథమ ప్రయత్న
మేమో! ఇందలి విషయం భారతదేశంలోని రచయితల
కెంత ముఖ్యమో, బర్మా, ఇండోనీషియా, జపాన్ రచయిత
లకు కూడా అంత ముఖ్యమైనది. స్వాతంత్ర్యం విశ్వజనీన
మైనది. కనుక దానికికలిగే ఉపద్రవంకూడా విశ్వజనీనమైనది.
మనకు ఉన్నదాన్ని మనం సుష్ఠుగా అనుభవించాలంటే
కొన్ని పరిస్థితులలో మనకది లేకపోవచ్చునని తెలుసుకొని
ఉండటం అవసరం.

భారతదేశంలో రచయితకు రచనాస్వాతంత్ర్యం ఉంది.
స్వయంగా నిర్ణయించుకొనిన ఔచిత్య బాధ్యతల ననుసరించి
భారత రచయిత యథేచ్ఛగా రచనలు చేసుకోవచ్చు.
విమర్శించవచ్చు, అపహసించవచ్చు.

కవులు, నవలాకారులు విశ్వశాసనకర్తలు. తాము
దర్శించిన సత్యాన్ని ప్రకటించటం వారి ఆత్మోద్దీపక విధి.

భగవానుడీ భౌతిక జగత్తును సృజిస్తే, జీవితాన్ని సరసము, సార్థకము చేయగల శబ్దచిత్రమయ జగత్తును రచయిత సృజిస్తాడు. రచయిత పరమ స్వతంత్రుడు. మరొకరి అదుపాజ్ఞలలో ఒదిగి ఉండలేడు. అతని బాధ్యతలాతడు కోరి తెచ్చుకున్నవి. సదయహృదయులకు సహజమయిన వేదనను, ఆందోళనను ఆనందంగా అనుభవించటంకూడా అతని స్వయమాపాదిత బాధ్యతలలోనివే! అయితే అతనిపై విధించే కృతక నియమాలు అతని ఆత్మకు శృంఖలలు. ప్రభుత్వం కాని, సంఘంగాని అతనిని కృత్రిమాధికార నియమబద్ధునిచేస్తే అతనిని హత్యచేసినట్టే! ఈ హత్య ఏవిధంగాను శారీరక హత్యకు తీసిపోయినది కాదు. ఈ గ్రంథంలో శ్రీ మిత్తల్ రచయితల మానసిక చిత్రవధలను గురించి, అనంతరం భౌతికహత్యలను గురించి కూడా చర్చించాడు.

ఈ సమస్య కేవలం రచయితలకు మాత్రమే సంబంధించినది అనటానికి వీలులేదు. ఇది మన అందరికి సంబంధించిన భీకర సమస్య. ఒక వర్గానికి స్వాతంత్ర్యం సున్నజుడితే, క్రమంగా సంఘంలో ఇతరవర్గాలుకూడా ఆ ప్రమాదానికి గురికాక తప్పదు. నానాటికి సంకోచంపొంది, చిన్నదైపోతూన్న ప్రపంచాన్ని ఆధ్యాత్మికంగా, నైతికంగా విభజించి ఉంచటం సాధ్యంకాదు. నగరంలో ఒక ప్రాంతం

దుర్గంధ బంధురమై, దుష్టవ్యాధి పూరితమైఉంటే, క్రమంగా ఆ ఆమయస్థితి ఇతర ప్రాంతాలనుకూడా చుట్టబెట్ట దనటానికి వీలు లేదుగద ! నేడు రష్యా, చైనా, తూర్పు యూరపు దేశాలలో జరుగుతూన్న సంఘటనలే భవిష్యత్తులో ఇక్కడకూడా జరుగవచ్చు. ఆ దేశాలలో మానవస్వేచ్ఛాపహరణకు పూర్వం సాగిన తంత్రాలు, మంత్రాంగాలు ఇతర దేశాలన్నింటిలో,- కొన్నింటిలో ప్రబలంగాను, మరికొన్నింటిలో ప్రచ్ఛన్నంగాను - నేడు సాగుతూనే ఉన్నవి.

మనకుకూడా తాదృశమైన బానిసతనం ప్రాప్తించకుండా చూచుకొనటానికి వీలుగా ఈగ్రంథంలో శ్రీమిత్తల్ ఆ తంత్రాలను, మంత్రాంగాలను వివరించి, నిశితంగా, ఘాటుగా విమర్శించాడు. ఈపనికి ఆయన అన్నివిధాలా అర్హుడు.

నేడు నలభై యేళ్ళ ప్రాయముగల శ్రీమిత్తల్ అనేక సాహిత్య, రాజకీయ, సాంఘిక సంఘర్షణలలో ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవజ్ఞుడు. ఆయన ఒకవిధంగా ఇక్బల్ కవివలె తన ప్రథమకావ్యంలోనే భగవంతుని గురించి విస్తృతంగా వ్యాపించిఉన్న నమ్మకాలను ఖండించాడు. నాటికి మిత్తల్ కి పదహారేళ్ళు నిండలేదు. లాహోరులో సుప్రసిద్ధాచార్యుడైన ప్రొఫెసర్ బ్రజనారాయణ్ కి ప్రియశిష్యుడై, ఆ ఆచార్యుని ఆర్థిక సిద్ధాంతాలనే పూర్వపక్షంచేశాడు.

తమది ఐశ్వర్యవంతమైన కుటుంబం కాకపోయినా, ఆయన ప్రజ్ఞా ప్రాభవాలకు పేదరికం అడ్డుతగలలేక పోయింది. ఆస్థితిలో, ఏమాత్రం అధీరుడైనా ఏదో ప్రభుత్వోద్యోగం చూసుకుని, నిశ్చింతగా బ్రతుకుదా మనుకొనేవాడు. నిజానికి, ఆరోజులలో ప్రజ్ఞావంతుడైన పట్టభద్రునికి సామాన్యంగా ప్రభుత్వోద్యోగంకన్న పెద్దగా ఆశించదగినదీ ఏమీ కనిపించేదికాదు. ఈయన దానికి ఒడబడక, జాతీయస్వాతంత్ర్య సమరంలో ప్రవేశించాడు. తాను వరించిన మార్గాన్ని గురించి ఆయన ఎన్నడు చింతించలేదు; జీవితమంతా ఒడుదుడుకులతో, కష్టాలతో గడుస్తున్నా ఎన్నడు కించపడలేదు.

అసత్యానికి, అచారానికి, మతరాజకీయ వీరావేశాలకు బద్ధవిరోధి మిత్తల్. ప్రాపంచికాధికారానికి గాని, ఆధ్యాత్మికాధికారానికి గాని ఆయన ఎన్నడు తలవంచలేదు. ప్రజానురంజతకు ఎదురీదటానికి వెనుదీయలేదు. సత్యాన్వేషి, స్వాతంత్ర్యారాధకుడు అవటంవలన కమ్యూనిజాన్ని వదిలిపెట్టి, కమ్యూనిస్టుల ప్రపంచవ్యాప్తమైన నిరంకుశత్వంతో పోరాడటానికి తనకలాన్నే కరవాలంగా వాడుతున్నాడు. గత ప్రపంచ సంగ్రామ సమయంలో ఆయన భారతదేశంలోను, ప్రపంచంలోను ఫాసిస్టుశక్తులను ప్రతిఘటిస్తున్న వారితో సహకరించటానికి వెనుదీయలేదు.

మిత్తల్ బహుగ్రంథ రచయిత. చాలా గ్రంథాలు అనువాదం చేశాడు. ఉర్దూభాషలో ప్రసిద్ధకవి, విమర్శకుడు.

మానవతావాద సహితమైన హేతువాదనిష్ఠ గలవాడు. అచ్చమైన వాస్తవికతావాది గనుక, నిరాశా నిస్పృహాలకు తావీయడు. జీవితంలో దౌష్ట్యం, అనౌచితి ఆయనను క్రుంగ దీయలేవు సరిగదా, ఆయన పట్టుదలను ఇనుమడింప జేస్తవి. వెనకటికి ఒక విమర్శకుడు అన్నట్టు, "జీవితంలో అత్యంధ కారబంధుర సమయాలలో కూడా వెలుగు లొలుకగల" కొలదిపాటి వెన్నెల చిద్రుపలను ఆయనఎన్నడు విస్మరింపడు.

మిత్తల్ ఆశావాదాన్ని, ఆత్మ విశ్వాసాన్ని ప్రస్తు తించటానికి బదులు ఆయన గీతాలలో ఒకదానికి ఛాయాను వాదాన్ని ఇక్కడ ఉదాహరిస్తే సరిపోతుందనుకుంటాను.

"ప్రేమికుని యెద ప్రియా
ధామగమనాకాంక్ష,
పీడితుల హృది రగులు
విప్లవానలవీక్ష,
దేశభక్తుని త్యాగ
దీప్తముఖవర్చస్సు,
తొలి ప్రియుని దలచి వం
దురు జారిణి మనస్సు,
త్యక్త సుఖ సంస్మరణ
సన్యాసి యెద తపన
ఏనాడొ ఏ యంధ
కోణమందో పొంచి,

తొంగి చూడకపోదు
నగ్న సత్యజ్యోతి!
నిత్యమై నిలుచు నా
సత్య దివ్య జ్యోతి
అంధకూపమున వెలు
గొందు మిణుగురు భాతి
మనలేదు సత్య దీ
పన రహితమై జగతి."

కమ్యూనిజాన్ని గురించి మార్క్సు అనుయాయు లలో అగ్రగణ్యులకు తెలిసిన విషయం సర్వం ఈయనకూ క్షుణ్ణంగా తెలుసు. కనుకనే, ఆ గుట్టుమట్టు లన్నిటినీ విస్పష్టంగా వెల్లడించ గలిగాడు.

ఈ గ్రంథం ప్రతి రచయిత, ప్రతి విమర్శకుడు, ప్రతి వ్యాఖ్యాత, ఆసక్తిగల ప్రతి పాఠకుడు చదివి, ప్రపంచంలో సర్వత్ర, విద్వాంసుల స్వేచ్ఛకు ఎసరు పెట్టటానికి కమ్యూనిస్టులు పన్నుతున్న కుట్రను గురించి వివరంగా తెలుసుకొని ఉండటం అవసరమని నా హార్దిక విజ్ఞాపన.

ఢిల్లీ,
26 డిసెంబరు 1956. రామ్‌సింగ్

# రచయితల స్వాతంత్ర్యం
(అపహరణకు కుట్ర)

## మబ్బుతునక

1936 లో భారతీయ సాహిత్యాకాశంలో ఎక్కడో ఒక మూలగా చిన్న మబ్బుతునక ఒకటి బయలుదేరింది. ఆ సంవత్సరమే భారతదేశ అభ్యుదయ రచయితల సంఘం అవతరించింది. ఈ ఇరవై ఏళ్ళగా అది క్రమంగా పెరుగుతూ వచ్చి ఆకాశమంతటినీ ఆవరించేటటు కనిపిస్తూంది. అందు వల్ల దానిని గురించిన ఈ పరామర్శ, తత్పర్యవసాన విశ్లేషన అవసరమయింది.

భారతీయ రచయితలలో ఎన్నదగిన వారిలో ఎవరో కొద్దిమంది తప్ప, మిగిలినవారెవరూ ఆసంస్థపట్ల ఎక్కువ సానుభూతి చూపలేదు. దీనికి కారణాలు లేకపోలేదు. ఈ సంస్థ ఉద్భవించిన సమయంలో వారికి చేతినిండా కావలసినంత పనిఉంది. ఆనాడు భారతస్వాతంత్రోద్యమం ముమ్మరమవుతూ, అవసానదశను సమీపిస్తూంది. సమరశంఖారావం అవిరతంగా చెవులలో మార్మోగుతూంది. ఈ సమర

సంరంభం నాటి కావ్య, కథాసాహిత్యంలో కూడా ప్రతి ధ్వనిస్తూంది. ఎందరో రచయితలు స్వయంగా ఆ పవిత్ర సమర రంగంలోకి ఉరికారు. నానా యాతనలు అనుభవించారు. కష్టాలకు, గాయాలకు గురి అయ్యారు. జాతీయాత్మలో ఏదో అపూర్వ సంచలనం బయలుదేరింది. నిజానికి ఆనాటి ఎన్నదగిన భారతీయ రచయితలలో సర్వతోముఖమైన ఆ జాతీయ స్వాతంత్ర్యసమర ప్రభావంవలన ఉత్తేజితులు కానివారు బహుశః ఎవ్వరూ లేరనేచెప్పవచ్చు. కాని, కళను రాజకీయాలకు అంకితం చేసినవారు మాత్రం వారిలో అట్టే మంది లేకపోవటం గమనింపదగిన విషయం. వారు రచయితలుగానే ఉండి పోయారు. అయితే బాధ్యతగల పౌరులు గనుక, తమచుట్టూ సాగుతున్న సంరంభానికి వైదొలగి ఉండలేక పోయారు. అన్యాయ్యాలను, అత్యాచారాలను, అపభ్రంశాన్ని, నీచత్వాన్ని, సంకుచితత్వాన్ని చూస్తూ సహించి ఊరుకో లేకపోయారు. ప్రజాసాహిత్యం అంటూ అసలు ఏదైనా ఉన్నదంటే నాడు వారు సృజించిందే అయి తీరాలి. వారి రచనలు ప్రజలలో ఆత్మవిశ్వాసాన్ని ఉద్బుద్ధం చేసినయి. నూతన ఆశాజ్యోతులు వెలిగించినయి. తామేదో నవీన ధర్మరాజ్య సంస్థాపకులమని మాత్రం వారు భావించలేదు. తామేదో మతయుద్ధ సైనికుల మనే భావం వారికి లేదు. రాజకీయాలే సాహిత్యానికి ప్రాతిపదిక కావాలనే వాదాన్ని వారు ఆమోదించలేదు.

మానవులలో ఏవిధమైన తరతమభేదాలనూ వారు పాటించ లేదు. మానవజాతి అంతా ఒకే అవిభక్త కుటుంబం. సత్సాహిత్యసారం సానుభూతి సౌమనస్యాలే గాని, అసూయ అసహనాలుగావని వారిమతం. మానవుడికీ, మానవుడికీ నడుమ స్నేహ సేతుబంధనం చేయటానికి ప్రయత్నించారే గాని, కందకాలు త్రవ్వటానికి వారు పూనుకోలేదు. మానవ కారుణ్య క్షేత్రంలో అడ్డగోడలు కట్టే పద్ధతి వారికి అచుంబిత విషయం.

ఇక, సాహిత్యాన్ని ఒక విచ్ఛేదక ఆయుధంగా, రాజకీయ సాధనంగా ఉపయోగించాలనే పెద్దమనుష్యులు ఉన్నారు. విదేశాలలో కొంత బలగాన్ని కూడగట్టుకొన్న వర్గ సంఘర్షణ సిద్ధాంతంయొక్క ప్రభావం మెల్లగా సాహిత్య రంగంలోకికూడా చొరబడటానికీ, సాహిత్యాన్ని ఒక వశీకరణ సాధనంగా ఉపయోగించుకొనటానికీ ప్రయత్నిస్తూంది. ఈ పని సులభంగా జరిగేది కాదు గనుక సుసంఘటిత మైన ఉద్యమం అవసరమయింది. ఈ పరిస్థితులలో అభ్యుదయరచయితలసంఘం స్థాపించాలనే ఆశయం మొదట బ్రిటన్‌లో మొలకెత్తి, రష్యా ప్రోత్సాహపు రెక్కలతో ఇండియాకు ఎగిరి రావటంలో పెద్ద ఆశ్చర్య పడవలసిన దేమీ లేదు.

అభ్యుదయ రచయితల సంఘానికి అంకురార్పణగా పరిణమించిన తొలి సమావేశం లండన్‌లో జరిగింది. ఎం

మకు? అటుపిమ్మట త్వరలో పారిస్‌లో జరుగబోయే అంతర్జాతీయ రచయితల మహాసభకు భారత ప్రతినిధి వర్గాన్ని "ఎన్నుకొనటానికి." ఆనాడు రష్యా అండదండలతో నడుస్తూన్న యునైటెడ్ ఫ్రంట్ రాజకీయాలకు ప్రధాన కేంద్రం పారిస్ నగరం. ఆ సమావేశంలో భారత ప్రతినిధులుగా శ్రీయుతులు ముల్క్‌రాజానంద్, సజ్జద్ జహీర్ ఎన్నిక కావడం చిత్రంగా కనిపిస్తుంది. శ్రీ సజ్జద్ జహీర్ రచయిత అని అంతవరకు ఇంచుమించు భారతదేశంలో ఎవరికీ తెలియదు. వీరికి ఈ బిరుదులు, లండన్‌లో ఒక హోటలులో జరిగిన విద్యార్థుల సమావేశంలో లభించినయి. పారిస్‌లో ఆ మహాసభ పూర్తికాగానే శ్రీ జహీర్ భారతదేశానికి వచ్చి, జాతీయముస్లిం బురఖాతో దేశమంతా సంచారం చేస్తూ, పండిత జవహర్‌లాల్ నెహ్రూ పరిచయం కూడా సంపాదించాడు.

ఒక కమ్యూనిస్టు ఈవిధంగా ప్రవర్తించడం చిత్రంగానే కనిపిస్తుంది. ఆరోజులలో రష్యా నిఘంటువుల ప్రకారం, గాంధీజీ అభివృద్ధి నిరోధకుడు; సామ్రాజ్య వాదుల సహచరుడు. ఆయన అనుచరులయిన నెహ్రూ, బోస్ మొదలైన జాతీయ నాయకులంతా మాస్కోనుండి ప్రకాశాన్ని వెలువరించే పవిత్రజ్యోతికి విముఖులైన మహాపాపులు. అయితే, జాతీయోద్యమాన్ని విచ్ఛిన్నంచేసి,

నాశనం చేయటం సాధ్యంకాకపోయేసరికి, భారత దేశంలోని మాస్కో అనుచరులు తామే ఆ ఉద్యమంలో దూరటానికి ప్రయత్నించారు. ఈ లక్ష్యసాధన కొరకు ఉపకరణంగానే అభ్యుదయరచయితల సంఘం ఏర్పాటైంది. నూతన అనుచరులను ఆకర్షించటం, బుద్ధిమంతుల మనస్సులను మళ్ళించటం ఈ ఉద్యమలక్ష్యం. వారి దృష్టిలో అసూయా విద్వేషాలను, దౌర్జన్యాన్ని రగుల్కొల్పని సాహిత్యం కేవలం అభివృద్ధి నిరోధకం; జమీందారుల సాని; పరమశత్రువు; పనికిమాలినది.

ఈ మాస్కో మనుష్యులు తమంత తాముగా సాహిత్యాన్ని తమ ఇష్టానుసారం భ్రష్టం చేయలేక పోయారు. అందుచేత, గౌరవనీయంగా కనిపించే కొత్త బురఖాకోసం వెదుక్కోవలసి వచ్చింది. అభ్యుదయ రచయితల తొలి సమావేశానికి వారు ఆకర్షింప కలిగిన వ్యక్తుల పేర్లు చూస్తే వారిది శుష్కప్రయత్నం కాలేదని తెలుస్తుంది.

అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ 1936 ఏప్రిల్ 10 వ తేదీన లక్నోలో సమావేశమయింది. పండిత జవహర్లాల్ నెహ్రూ ఆ సమావేశంలో ఉపన్యసించాడు. స్వర్గీయ రవీంద్రనాథ్ ఠాకూర్ అభినందన సందేశం పంపాడు. హిందీ కథారచనలో అందెవేసినచెయ్యి అయిన మున్షీ ప్రేమ్‌చంద్ ఆ సమావేశానికి అధ్యక్షుడు. అంతకు

పూర్వం లండన్‌లో తయారుచేసి ఉంచిన ఆశయనిర్వాచన పత్రాన్ని ఆ మహాసభ ఆమోదించింది. ఆ పత్రంలో ఈ విధంగా నిర్వచించారు. "...... సాంప్రదాయిక సంస్కృతి విచ్ఛిన్నమైపోయిన తరవాత భారతీయ సాహిత్యం ప్రత్యక్షజీవితానుభవాలకు వైదొలగి, వాస్తవికతకు దూరమై, పునాదిలేని ఆధ్యాత్మిక ఆదర్శ వాదాలను పట్టుకొని వేళ్ళాడట మారంభించింది......" "కనుక... కుటుంబం, మతం, భార్యా భర్తృ సంబంధం, యుద్ధం, సంఘం మొదలైన విషయాల్లో ఈ అభివృద్ధినిరోధక ప్రవృత్తులను, పునరుజ్జీవన ప్రయత్నాలను అరికట్టేందుకు అనువైన సాహిత్య విమర్శనా పద్ధతులను అనుసరించటం... ఆధునిక భారతీయ రచయితల కర్తవ్యం.

"చిరకాలంగా మితవాదుల చేతులలోబడి నలిగి, నవసిపోతూన్న సాహిత్యానికి, ఇతర కళలకు విమోచనం కలిగించి కాపాడటము, ఆ యా కళలను ప్రజలకు సన్నిహితం చేయటము జీవితవాస్తవికతత్వాన్ని నిరూపించి, మన మాశిస్తూన్న భవిష్యత్తు దెసకు మనలను నడిపించగల సమర్థసాధనాలుగా వాటినిరూపొందించటము ఈసంస్థ లక్ష్యం.

"...భారతీయ నవసాహిత్యం నేడు మన వాస్తవిక జీవితానికి సంబంధించిన వివిధ సమస్యలను — ఆకలి, దారిద్ర్యం; సాంఘికతిరస్కృతి, రాజకీయదాస్యం మొద

లైన సమస్యలను-గురించి చర్చించేదిగా ఉండాలని మన ఆశయం."

ఈ అభ్యుదయ వాదులు మనసాహిత్యాన్ని ఏవిధంగా మలచదలచుకొన్నది గ్రహించటానికి బుద్ధిమంతులు అట్టే శ్రమపడనక్కరలేదు. "సాహిత్య మర్యాదల"ను మంటగలిపి "చారిత్రక మర్యాదల"కు వారు ప్రాధాన్యం ఇవ్వటం మొదలు పెట్టారు. శబ్దార్థాలంకారాలు ఉన్నతవర్గాల వారి భోగవస్తువులని, "ప్రజలకు" అవి నిష్ప్రయోజనములనీ నిర్వచించి, వాటిని పరిహరించాలన్నారు. ముఖ్యంగా క్రిషన్ చందర్ అనే ఉర్దూ రచయిత ఈ విధమైన విమర్శనా పద్ధతిని విశేషంగా ప్రచారం చేశాడు. ప్రస్తుతం ఈయన మాస్కోలోని ప్రభుత్వ ప్రచురణాలయానికి పరమాప్తుడు. శబ్దానికి, అర్థానికి సమాన గౌరవం ఇచ్చే రచయితలనందరినీ ఈయన ఊహాకల్పితుడైన ఒక కార్మికునిచేత ఇలా మందలింపజేశాడు: "మన మిల్లులు పట్టుబట్టలు నేసి పడవేస్తున్నట్టుగానే రచయితలయిన మీరు అందమైన రచనలు చేస్తారు. కాని, శ్రామికులమైన మాకు ఇప్పుడీ పీతాంబరాల వల్ల ప్రయోజనం లేదు. మాకు కావలసింది ముతకగుడ్డలు. అవి ఎక్కువ కాలం మన్నుతాయి. ఒకనాడు ప్రపంచంలోని మిల్లులన్నింటికీ మేమే యజమానుల మవుతాము. అప్పుడు మేము పట్టుగుడ్డలు కూడా ఉత్పత్తిచేస్తాము." అంటే ప్రపంచమంతా

కమ్యూనిష్టుల వశమయ్యేవరకు రచయిత లెవరూ సృజనాత్మక రచనలు చేయగూడదని శ్రీ క్రిషన్ చందర్ ఉద్బోధిస్తున్నట్లు స్పష్టంగా తేలుతూనే ఉంది. గట్టిగ అరచినవాళ్ళు, తిట్టగలవాళ్ళు నాయకు లయ్యారు. అట్టివారిలో మక్ దుమ్ మొహియుద్దీను ఫెయిజ్, అహమ్మద్ ఫెయిజు ముఖ్యులు. ఈ రెండవ పెద్దమనిషి ఆతరువాత కొంతకాలానికి తెలంగాణా విప్లవోద్యమంలో చిక్కుకున్నాడు. మొదటి పెద్దమనిషి రావల్పిండి కుట్ర కేసులో ముద్దాయి.

1947 కు పూర్వం కేవలం అనుమానంగా ఉంటూ వచ్చిన విషయం స్వాతంత్ర్య సంపాదనానంతరం అందరికీ తేటతెల్లమయిన సత్యంగా ధ్రువపడింది. తన అంతర్వాణి అయిన కమ్యూనిస్టుపార్టీ తన రాజనీతిని నూతన పరిస్థితులకు అనుగుణంగా సంస్కరించుకునే సరికి, అభ్యుదయరచయితల సంఘ తత్వంకూడా ఫిరాయించింది. 1949 నాటికి ఈ సంఘం కేవల మొక రాజకీయపక్ష శాఖ అన్నసంగతి స్పష్టంగా బయటపడింది.

స్వాతంత్ర్యోదయ సమయంలో శ్రీ పి. సి. జోషీ, ఆయన అనుచరులు కమ్యూనిస్టుపార్టీని నడుపుతున్నారు. పి. సి. జోషీ కమ్యూనిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి అయిన నాటినుంచి ఆయన "సంస్కరణవాద" మని అనంతరం నిరాకరింపబడిన విధానాన్ని అనుసరిస్తూ ఉండేవాడు.

ఉపన్యాసాలలోను, రచనలలోను అప్పుడప్పుడు జాతీయ నాయకులను ప్రశంసించేవాడు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, జాతీయప్రభుత్వాన్ని బలపర్చటం అవసరమని సూచించేటంతవరకూ కూడా వెళ్లాడు. ఈవైఖరే ఆయన పదచ్యుతికి దారితీసింది. ఈ గ్రంథంలో ఆనాటి రాజకీయాలనుగురించిగాని, కమ్యూనిస్టు పార్టీలోని గూడుపుఠానీలను గురించిగాని చర్చించటం అప్రస్తుతం. అభ్యుదయ రచయితల సంఘానికి, కమ్యూనిస్టుపార్టీకి గల సన్నిహిత సంబంధాన్ని వివరించటానికి మాత్రమే పి. సి. జోషీగాథ ఎత్తుకోవలసి వచ్చింది. విప్లవవాద ప్రతికూల మయినదంటూ పార్టీలో జోషీ ముఠాకు ఉద్వాసన చెప్పగానే, అభ్యుదయ రచయితల సంఘం ఆశయాలలోను, కార్యక్రమాలలోను కూడా తదనుగుణమైన మార్పు అవసరమయింది. జోషీ స్థానంలో శ్రీ బి. టి. రణదివే కమ్యూనిస్టు పార్టీ ప్రధానకార్యదర్శిగా ఎన్నిక అవగానే, సాహిత్యరంగంలో సమష్టి సమర (యునైటెడ్ ఫ్రంట్) నీతికి స్వస్తి జెప్పారు. అంతవరకు భారత స్వాతంత్ర్య సంకీర్తనం చేస్తూ వచ్చిన కవులు, విమర్శకులు ఇది బూటక స్వాతంత్ర్య మనీ, వట్టి మేడిపండు అనీ, ఆంగ్ల సామ్రాజ్య వాదులతో గాంధీ, నెహ్రూ, పటేలు మున్నగు బూర్జువా నాయకుల గూడుపుఠానీ అనీ ఖండించ వలసిన అవస్థ పట్టింది. వర్గ సంఘర్షణాను తదనుగుణమైన వీరసాహిత్యాన్ని సృష్టించటం

అభ్యుదయ రచయిత లందరికీ విధ్యుక్త ధర్మ మయింది. ఒకప్పుడు సన్నిహిత మిత్రులుగా పరిగణించిన సహచరులను శత్రుపక్షానుచరు లన్నారు. 1949 మార్చిలో అభ్యుదయ రచయితల సంఘపత్రిక "నయాఅదబ్"లో ప్రకటించిన ఒక వ్యాసంలో ఈ పరిణామాన్ని సమగ్రంగా వివరించారు. అంతకన్న విస్పష్టంగా దాన్ని వివరించడం కూడా బహుశః కష్టం. ఈ వ్యాసానికి కూడా మళ్లీ వెనక చెప్పిన క్రిషన్ చందరే కర్త. ఆయన ఆ వ్యాసంలో ఇలా వ్రాశాడు: "మన అభ్యుదయోద్యమం నానా గోత్రికులకు - అనగా లీగర్లకు, కాంగ్రెసు వాదులకు, ఆర్జవం గల హిందువులకు, ముస్లిములకు, అతి వాదులకు, ఉదార వాదులకు, అర్ధోదార వాదులకు, ఆర్య సమాజం వారికి, మతోన్మాదులకు—బ్రిటిష్‌వారికి వ్యతిరేకు లయిన వారందరికీ ఆటపట్టుగా ఉపయోగించే రోజులు గతించి పోయినవి. లోగడ ఈ ఉద్యమంలో వారందరికీ అవకాశం ఉండేది. ఈ సంస్కరణ వాదం ఆ రోజులలో ఉపయోగకారి అయి ఉండవచ్చు. ఆ కారణంవలన నేడు మనము విప్లవశక్తులకు పూర్తిగా దూరమై పోయాం......మన సాహిత్యానికి సంస్కరణ వాద ముద్ర పడిందేమోగాని, అభ్యుదయవాద ముద్ర మాత్రం పడలేదు."

భారత కమ్యూనిస్టు పార్టీలాగే క్రిషన్ చందర్ కూడా సాహసికుడు. సాహిత్యం ఏమి చేయాలని తాను కోరు

తున్నదీ దాపరికం లేకుండా చెప్పేశాడు. గతంలో అభ్యుదయ రచయితలు అనుసరించిన విధానానికి, అప్పుడు ఏర్పడిన నూతన పరిస్థితిలో వారు అనుసరించ వలసిన విధానానికీ తారతమ్య వివేచనచేస్తూ ఆయన ఇలా అన్నాడు: "లోగడ మనం బ్రిటిషు శత్రువులతో పోరాడుతున్నాం. నేడు స్వదేశీయులనే మనం ప్రతిఘటించ వలసి ఉంది... ...మనం వారితో పోరాడ నయినా పోరాడాలి లేక ఆత్మనాశనాని కైనా అంగీకరించాలి. వారితో మనకు సమష్టి సమరపద్ధతికి అవకాశం లేదు. నేడు మనకు ఒకటే సమరరంగం కార్మిక కర్షక సమరరంగం."

ఈ అభ్యుదయ రచయితల సంఘనాయకుడికి ఈ నవీన భావాలు ఎక్కడినించి లభించినదీ తెలుసుకోనటానికి కూడా అట్టే ప్రయాసపడనక్కరలేదు. స్వతః కమ్యూనిజమే విభేద కారక సిద్ధాంత మనేమాట అలావుంచి, అసలు మాస్కోనుంచి తదనుచరు లందరికీ ఒక ఆదేశం జారీఅయింది. 1947 జూలై 10 వ తేదీన రష్యా ఉన్నత విద్యాశాఖా మంత్రి శ్రీ ఎస్. వి. కాఫ్టనోవ్ శాస్త్రీయ, రాజకీయ, విజ్ఞాన పరిషత్తులో ప్రసంగిస్తూ, "బూర్జువా జాతీయవాద నిర్వచనానికి పూనుకుంటున్నవారు గొప్ప పొరపాటు చేస్తున్నారు. లెనిన్, స్టాలిన్ ఇచ్చిన సలహాను వారు మరచిపోతున్నారు. బూర్జువా పరిపాలనలోని ప్రతిజాతిలోను

విధిగా రెండు జాతులు ఉంటాయని వారు సూచించారు.” అనగా, అంతర్యుద్ధాన్ని ప్రోత్సహించాలని, అట్టి ప్రతిజాతిని రెండుగా విడదీసి, ఆ విధంగా రాజకీయాధికారాన్ని చేజిక్కించుకోవాలని కాఫ్టనోవ్ ఆదేశిస్తున్నాడన్నమాట ఈ సిద్ధాంతం నిజానికి కాఫ్టనోవ్ సృజించిందికాదు. “లెనిన్ సిద్ధాంత సమస్యలు” అనే గ్రంథంలో స్టాలినే ఈ విషయం వ్రాసి “సంచాలక సాధనాలు”గా ఉపయోగపడ దగిన ప్రత్యేక ప్రజాసంస్థలుకూడా అవసరమన్నాడు అనంతరం జరిగిన సంఘటనల ననుసరించి, స్టాలిన్ మరణానంతరం ఆయన వాదాలకు తిలోదకాలిచ్చినా, రచయితలు మున్నగు వారిని సంఘటిత పరచడంలో మాత్రం ఆయన బోధించిన ఈ సంచాలకసాధన సిద్ధాంతాన్ని అంతర్జాతీయ కమ్యూనిష్టులు వదలిపెట్టలేదని తేలింది. అవసరాన్నిబట్టి రంగులు మార్చే ఊసరవల్లిలాగ, కమ్యూనిజంకూడా ఎన్నివేషాలు వేసినా, అసలు స్వరూపంలో మాత్రం మార్పురాదు. శ్రామిక వర్గానికి చెందిన రచయితలు మొదలైన వర్గాలను ఉపగ్రహాలుగా చేసేపద్ధతి ప్రపంచ కమ్యూనిజానికి చిర కాలంగా ధ్రువపడిన ఆచారం. ఈ విషయాన్ని లోగడ కమ్యూనిస్టు సిద్ధాంతకర్త అయిన ఆటోకూసినెన్ విశదీకరించినంతఘాటుగా, కమ్యూనిజాన్ని విమర్శించేవారు కూడా వివరించలేరు. ఆ నాడు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అని వ్యవహరింపబడుతూ వచ్చిన సంస్థ కార్యవర్గ సమ్మెు

మహాసభకు తాను సమర్పించిన నివేదికలో శ్రీ కూసినెన్ సర్వత్ర కమ్యూనిస్టు లందరినీ ఈ విధముగా ఆదేశించాడు.

"మన ప్రథమకర్తవ్యం కమ్యూనిస్టు సంఘాలను సంఘటిత పరచటమేకాదు. మన యాశయాలపట్ల సానుభూతి కలిగి ప్రత్యేక ప్రయోజనాలు సాధించటంలో మనకు సహాయపడగల ఇతర సంస్థలనుకూడా మనం సంఘటిత పరచాలి... మన సంస్థచుట్టూ అనేక సంఘాలతోకూడిన పెద్ద ఉపగ్రహ కూటమిని మనం సృష్టించాలి."

మరొక ప్రముఖవ్యక్తి 1928 జూలై 20 వ తేదీన ప్రపంచంలోని కమ్యూనిస్టు భక్తు లందరికీ మరొక మార్గం సూచించాడు: మనయెడల తూష్ణీభావంతో తటస్థంగా వుండే వారిని... నూతన మార్గాలలో నూతనకార్యక్రమాల ద్వారా ఉత్సాహపరచి, ఆకర్షించటం అవసరం... అందుకు అనువైన నూతన సంస్థలను... ...కమ్యూనిస్టుపార్టీ యెడ సానుభూతి ఉండి కొంతవరకు మనను అనుసరింప కలిగినా, పార్టీసభ్యులుగా జేరేటంత సాహసంలేని నిష్పక్ష కార్యకర్తలకూ పార్టీకీ నడుమ సేతుబంధన ప్రయత్నం చెయ్యాలి. ఈసంస్థల ద్వారా కమ్యూనిస్టుపార్టీ పలుకుబడిని వృద్ధి చేసుకొనటమే మన లక్ష్యం... ఈ సంస్థలలోనుంచి తగిన యోధులను, సంఘటన కౌశలం కలిగి కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలుగా ఉపయోగపడ దగిన వారినీ మనం ఎంచుకోవాలి."

ఈ ఉద్బోధ అంతా చేసినది శ్రీ విల్లీ మున్ జెన్ బర్గ్. ఇతడు కమ్యూనిష్టుల "సాంస్కృతిక పితామహుడు"గా పేరెన్నికగన్నవాడు. ఈ సంస్థలను నిర్వహింపదగిన విధానాన్ని సుప్రసిద్ధ అమెరికన్ కమ్యూనిష్టు నాయకుడొకడు వివరించాడు. కమ్యూనిష్టుల పట్ల సానుభూతి కలవారందరినీ ఆ సంస్థలలో చేర్చి, వారిలో నుండి కొందరినెన్ని చిన్న కార్యవర్గాన్ని ఏర్పాటు చేసి, ఆ సంస్థల అనుదిన కార్య నిర్వహణ బాధ్యతలను వారికి అప్పగించాలి. ఈ చిన్ని చిన్ని కార్యవర్గాల ద్వారా కమ్యూనిష్టు పార్టీ తన ప్రణాళికలను, తీర్మానాలను అమలు జరిపించుకోవాలి" అని ఆ అమెరికన్ కమ్యూనిష్టు ప్రముఖుడు సూచించాడు.

ఇక అభ్యుదయ రచయితల సంఘం ఈ ఆదేశానుగుణంగా ఏవిధంగా రూపొందినదీ పరిశీలిద్దాం. అసలీ అభ్యుదయ రచయితల సంఘానికి అంకురార్పణ జరిగిన ఆ లండనులోకూడా ఆ సంఘం సజ్జద్ జహీర్, ముల్క్ రాజానంద్ ల చేతులలోనే ఉండేది. జహీర్ రాజకీయాలను గురించి సంశయమే లేదు. పోతే ముల్క్ రాజానంద్ విషయమే తేలలేదు. అభ్యుదయ రచయితల సంఘం భారతీయ శాఖ అనేసంస్థకు నాయకత్వం కట్టబెట్టే నాటికి ఆనంద్ కి బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీతో సన్నిహిత సంబంధముండేది. కాకపోతే రష్యాలో పాలకవర్గం ఆతనిని గురించి ఏమనుకుంటున్నది తెలుసుకుంటే ఆతని స్వరూప స్వభావాలను గ్రహించటానికి

కొంతవరకు వీలవుతుంది. వ్రాక్లాలో జరిగిన ప్రపంచ బుద్ధిశాలుల మహాసభనుగురించి 1948 లో సోవియట్ సాహిత్య పత్రిక పన్నెండవ సంచికలో ప్రకటించిన నివేదికలో మిర్జో టూర్సేన్ జేడ్ ఆనంద్‌ను "భారతీయకవి" అని పేర్కొని అతనితో తనకు జరిగిన సంభాషణనుకూడ ఉటంకించాడు:

"అర్ధనగ్న స్వరూపాలతో, – దాదాపు పూర్ణనగ్న స్వరూపాలతో, – అలమటించే గుంపులకొలది నిర్భాగ్యులను అక్కడ నేను చూశాను... అని నేనన్నాను"

'అది సామాన్యదృశ్యమే' అన్నాడు ఆనంద్.

"రాత్రిళ్లు వాళ్ళు మామిడిచెట్లక్రింద, తాడిచెట్ల క్రింద అరటిచెట్ల క్రిందపడి నిద్రపోతూండడం కూడా నేను చూశాను. అతిక్రూరుడైన వేటకాని తూటాలకు ఆహుతి అయిన పక్షులు, పక్షిపిల్లల దృశ్యం నాకు తలపుకి వచ్చింది. మరునాడు ఉదయం వారిలో ఆకలితో చచ్చిపోయిన వారి శవాలను ఎత్తి పారవేస్తూండటం కూడా స్వయంగాచూశాను. వాళ్ళలో తల నెరిసిపోయిన బాలికలు, యువకులు కూడ ఉన్నారు"–అని నేను చెప్పాను.

"ఆనంద్ మాట్లాడకుండా నాకరస్పర్శచేశాడు."

టూర్సేన్ జేడ్, ఆనంద్‌లు బహుశః తమ భావనా జగత్తులోని భారతదేశాన్ని అభివర్ణించి ఉండవచ్చు

పోషలిస్టు వాస్తవికతావాదం, అతిపరిహాసాస్పదంగా, ఇంతో క్రూరంగా కూడా ఉండవచ్చు నన్నమాట.

ఆపత్రికలోనే పిమ్మట ఒక సంచికలో ముల్క్‌రాజానంద్ తన రష్యాయాత్రను గురించి వెల్లడించిన అభిప్రాయాలను ప్రకటించారు. రష్యాను అద్భుతంగా పొగడి, పొగడి, చివరికి స్వదేశాన్ని గురించి ఆనంద్ వ్రాసిన పంక్తులివి:

"నా స్వదేశమయిన భారతదేశంలో తమ భాష తాము మాట్లాడుకుంటూ, తమవ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూన్న అనేకజాతులను నేనుచూశాను. అయితే బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, నూతనధనికవర్గమూ కలిసి వారి సాంప్రదాయిక సంస్కృతిని నాశనంచేసి వారి ప్రస్తుత జీవితాన్ని కాలరాచి వేయడంతో, క్రమంగా వారు నశించిపోతున్నారు. వారుండే చోటనల్లా ఆకలి, మృత్యువు తాండవిస్తున్నాయి. కేవలం ప్రాణాలు నిలుపుకోడానికి సాగించే కృషిలోనే వారి సర్వశక్తులూ ఉడిగి పోతున్నాయి. పరమ నికృష్టమైన జీవనానికి అవసరమైన తిండి, బట్ట, నీడ మాత్రమే వాడికి లభిస్తూన్నాయి. మానసికానందానికి ఇంచుమించు వారికి తీరికే ఉండదు....ఇక్కడ సోవియట్ జార్జియా చూస్తూఉంటే, ఇక్కడికీ అక్కడకీ హస్తిమశకాంతరం భేదం కనిపిస్తూంది."

ఈ "భారతీయకవి" స్వప్నసామ్రాజ్యం అయిన సోవియట్ రష్యాలో అటుపిమ్మట కొంతకాలానికి సంచారం

చేసివచ్చిన శ్రీమతి ఇందిరా గాంధీకి ఆజార్బియాా రాష్ట్రంలో అలాంటి స్వర్గమేమీా కనిపించలేదు. అయినా, ఆనంద్‌ను విమర్శించటం మనకు అనవసరం. సోవియట్ రష్యా అతిథి సత్కారాలను అనుభవిస్తూన్న ఉత్సాహంలో ఆనంద్‌కి స్వదేశంపట్ల ఎంత అసహ్యాభావం కల్గినదీ గ్రహించటం మాత్రమే మన ఉద్దేశం.

మాస్కోలో విదేశ భాషా ప్రచురణాలయం వారు 1954 లో "ఇండియా, పాకిస్థాన్ కథలు" అనే పేరుతో ఒక సంపుటాన్ని ప్రకటించారు. అందులో ముల్క్‌రాజానంద్ కథలు, ఇంకాచాలామంది అభ్యుదయరచయితల కథలు ఉన్నాయి. 1954 సెప్టెంబరు 13వ తేదీపత్రికలో "ప్రవ్దా" పత్రిక ఈ సంపుటాన్ని గురించి సమీాక్షచేస్తూ ఇలా వ్రాసింది. "ఈ కథలను రచించినవారు ప్రధాన విషయాలను గురించి నిర్భయంగా వ్రాశారు. వీళ్ళంతా తమ ప్రజాజీవితాన్ని, సుఖతర జీవనస్థితిని సాధించటానికి వారుపడేపాట్లను, వలస రాజ్య బంధనాలనుండి తమ దేశానికి విమోచనం కలిగించుకోవాలనే వారి ఆశయాన్ని గురించి బాగా అవగాహన చేసుకున్నవాళ్ళు." భారతదేశం స్వాతంత్ర్యంపొంది యేడేండ్లైనా ప్రవ్దా అభిప్రాయంలో భారతదేశం "వలస రాజ్యబంధనాలనుండి విముక్తి" పొందలేదన్నమాట. స్వతంత్ర భారతం అవతరించిన ఏడేండ్ల తరువాత వెల్లడించిన

ఈ అభిప్రాయానికికూడా బహుశః ముల్క్‌రాజానంద్ వంటి బుద్ధిమంతుల భావాలే ఆధారమయియుండాలి.

భారత అభ్యుదయ రచయితలు 1949 మే 28, 29 తేదీలలో బొంబాయి శివారు భీమ్రిలో తమ పంచమ మహా సభ జరుపుకున్నారు. భారతదేశాన్ని గురించి ఆ నాడు మాస్కోలో ప్రచారంలో ఉన్న సిద్ధాంతాలకు అనుగుణంగా ఒక కార్యక్రమం రూపొందించుకొనడం కోసం ఆ సమావేశం ఏర్పాటు చేసుకున్నారు. కమ్యూనిస్టు సిద్ధాంత కర్తల ఆదేశానుసారం భారతదేశంలో అంతర్యుద్ధాన్ని ప్రోత్సహించటమే ఆసమావేశ ప్రధాన లక్ష్యమని తేలిపోయింది. కమ్యూనిస్టులు కోరే ఈఅంతర్యుద్ధం తెలంగాణాలో అప్పటికే ప్రారంభమయి సాగుతోంది. ఆ సమావేశంలో అహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం చాల చిత్రంగా ఉంది. శ్రీమతి షహీద్ ఇస్మత్ లతీఫ్ (ఇస్మత్ చుగ్తాయ్ అని ఈమె మారు పేరు) ఈ ఉపన్యాసంలో రచయితలను ఉద్బోధిస్తూ "నేడు మనదేశం ప్రపంచమంతటిలాగే రెండు వర్గాలుగా విభక్తమయిఉంది." అని సిద్ధాంతీకరించిది. అందులో ఒకవర్గం శ్రామికులని, రెండవవర్గం పెట్టుబడిదారులనీ అమె అభిప్రాయం. "మనం ఏ వర్గానికి చెందినవాళ్ళమో స్పష్టంగా ప్రకటించి, మనం శ్రామిక వర్గానికి చెందిన వాళ్ళమే అని మన చేతలతో రుజువు చేయవలసిఉంది." కమ్యూనిస్టుల

నిఘంటువు ప్రకారం రాజకీయ పరిభాషలో శ్రామికవర్గం అంటే కమ్యూనిస్టుపార్టీ అన్న సంగతి వేరే చెప్పవలసిన పని లేదనుకుంటాను. ఆ ఆహ్వాన సంఘాధ్యక్షురాలు తన ఉపన్యాసంలో అనేక రకాలుగా, స్పష్టంగా రచయితలంతా తమ వృత్తులు వదిలివేసి, విప్లవ శక్తులతో కలిసి పోవాలని ఉద్బోధించింది. "కేవలం కథలు, కావ్యాలు, విమర్శలూ వ్రాస్తూ కూచోటం విప్లవానికి సహాయంచేయటంకాదు. మన ఉద్యమంపైన కత్తిగట్టి పోరాడుతూన్న రచయితలంతా ప్రత్యక్షంగా ప్రతిఘటించాలి." అంటూ ఉపదేశించింది.

ఇది ఏదో ఒకవ్యక్తి, ఎక్కడో చేసిన హెచ్చరిక కాదు. సాహిత్యాన్ని తమరాజకీయ ప్రయోజనాలకు సానిగా చేయ దలచుకొన్న వారి ప్రబలనిశ్చయాన్ని ఈవిధంగా ఆమె వ్యక్తంచేసింది. పాకిస్థాన్ అభ్యుదయ రచయితల సంఘ ప్రధానకార్యదర్శి అహమ్మద్ నజీమ్‌కాశ్మీ ఆసమావేశానికి పంపిన సందేశంలో కూడా ఇంచుమించు ఈ ముక్కలే వ్రాశాడు. "వాస్తవ ప్రజాస్వామ్య స్థాపనకు కృషిచేసే అభ్యుదయరచయితలు కేవలం తమ రచనలతో సంతృప్తి పడి ఊరుకోకూడదు. సమర రంగాలకు దూరంగా వైదొలగి కూర్చున్నంతవరకు వారి వాస్తవికసంకల్పాలను శంకించ వలసే వస్తుంది. శ్రామికవర్గ సంఘర్షణలలో ప్రత్యక్షంగా పాల్గొనకుండా కేవల భావనాత్మకమైన సాహిత్యసృష్టివల్ల ప్రయోజనంలేదు," అని ఆయన వ్రాశాడు.

శ్రీయుతులు ముల్క్‌రాజానంద్, క్రిషన్ చందర్, రామ్‌బిలాస్ శర్మ, (హిందీరచయిత) సుశీల జానా (వంగ రచయిత) ఆసమావేశంలో ప్రముఖభూమికలు నిర్వహించారు. ఈ నలుగురు ప్రత్యక్ష కమ్యూనిస్టులు. లేదా కమ్యూనిస్టు ఉద్యమాలలో సన్నిహిత సంబంధాలు గలవారు. ఈ సమావేశంలో చాలా తీర్మానాలుచేశారు. వాటిలో మూడు చాలా విలక్షణమైనవి. భారతీయులకు పౌరస్వాత్వాలు కలుగజేయనందుకు భారతప్రభుత్వాన్ని నిరసిస్తూ చేసిన తీర్మానం అందులోఒకటి. రెండవది భారతదేశం కామన్వెల్తుతో సంబంధం కలిగిఉన్నందుకు నిరసన. మూడవది ఆంగ్లో అమెరికా కూటమివారి యుద్ధసన్నాహాలకు నిరసన. ఈ మూడవ తీర్మానాన్ని గురించి ప్రసంగించిన ప్రధాన వక్త ఎవరోకాదు. శ్రీ ముల్క్‌రాజానంద్. "రష్యా నాయకత్వాన" ప్రపంచశాంతి స్థాపనకోసం పోరాడ వలసినదిగా ప్రపంచరచయితలను, కళాకారులను ఆయనఉద్బోధించాడు.

ఆ మహాసభ ప్రకటించిన ప్రణాళికలో ఇలాఉంది. "1947 ఆగస్టు నెలనుంచి భారతదేశంలో ప్రజాఉద్యమం నూతనరూపం దాల్చింది. జాతీయోద్యమ సమయంలో నిరంతరం బ్రిటిష్‌సామ్రాజ్యవాదుల పొత్తుకోరుతూవచ్చిన పెట్టుబడిదారుల వర్గం నేడు ప్రత్యక్షంగా వారికి నమ్మినబంటు అయింది." ఇది శ్రీ నెహ్రూప్రభుత్వాన్ని గురించి

ప్రచ్ఛన్న విమర్శకూడా కాదు. ఇండియా కామన్వెల్తు లోనే ఉండాలన్న నిర్ణయమే "ఈ గూడుపుఠాణీకి ప్రబల నిదర్శనం," అని ఈ ప్రణాళికలో స్పష్టంగా వివరించారు. నెహ్రూ మొదలైన జాతీయ నాయకులు అనుసరిస్తూన్న సత్యాహింసల సిద్ధాంతము "పెట్టుబడి దారుల దోపిడీ విధానంలోని అమానుష కృత్యాలను మరుగు పరిచే బురఖా" మాత్రమే అనికూడా ఈ ప్రణాళిక నిరసిస్తూంది. మొత్తం మీద భ్రమిలో అభ్యుదయ రచయితల నిర్ణయాల ననుసరించి భారతీయ సాహిత్య భవిష్యత్తును "శ్రామిక వర్గనాయకత్వాన సాగే ప్రజాసమరంనుండి వేరు చేయటానికి ఎంత మాత్రం వీలులేదు."

అచ్ఛమైన అభ్యుదయ రచయిత ఎక్కడ ఉన్నా కమ్యూనిష్టు పార్టి ఆదేశాలను పాలిస్తూనే ఉంటాడు. భారత ప్రభుత్వం ప్రకటించే "ఆజ్ కల్" అనే ఉర్దూ పత్రిక కూడా కొంతకాలం పూర్తిగా ఈ ఆశయసాధనకు ఉపయోగపడింది. ప్రముఖ అభ్యుదయ రచయిత శ్రీ జోష్ మలిహాబాదీ ఆ పత్రికకు సంపాదకుడుగా ఉండటం వల్ల ఇది సాధ్యమయింది. పిమ్మట ఈయన పాకిస్తాన్ కు వలస వెళ్లిపోయాడు. ఆయన సంపాదకుడుగా ఉన్నంత వరకు మాత్రం ఆపత్రిక అభ్యుదయ రచయితల సంఘానికి అర్ధాధికార పత్రికగా వినియోగపడింది. ఇండియా పాకిస్తాన్ల నడుమ సంబంధాలు చాలా విషమంగా

ఉన్నా, లోగడ ఉటకించిన పాకిస్తానీ రచయిత అహమ్మద్ నజీమ్‌కాశ్మీని ప్రత్యేకంగా "విప్లవాత్మక కవిత" అనే విషయాన్ని గురించి వ్యాసం వ్రాసి పంపవలసినదిగా ఆ పత్రిక కోరింది. రచయితలు తమ "పదశక్తిని, బాహు శక్తిని" కూడా వినియోగించి విప్లవం తీసుకురావాలని ఆ వ్యాసంలో ఆయన ఉద్బోధించాడు. ఈ సందేశాన్నే ఇతర రచయిత లెందరో రవంత మృదువుగా ఆ పత్రిక ద్వారా ఆలపించారు. "ఆజ్‌కల్" 1951 డిసెంబరు నెల సంచికలో శ్రీమతి సర్వ్యాదా ఫర్హాత్ ప్రకటించిన ఒక ఖండ కావ్యంలో ఆమె ఈ పంక్తులు వ్రాసింది:

> హేమంతశాసనమె ఇందనుక మనతోట
> దూరముననే యుండి తొలి వసంతపు పాట
> ఫర్హాతా! లేవ మాన్చు పాతకాలపు రుజలు
> కళ వళపు బ్రతుకు వెత కనలుచుండిరి ప్రజలు

జోష్ సంపాదకత్వంలో ఇంచుమించు "ఆజ్‌కల్" సంచిక లన్నీ నిరాశా, నిస్పృహలను ప్రబోధించే కథలు కావ్యాలతోనే నిండి, భారత దేశ స్వాతంత్ర్యాన్ని కేవలమజాగళ స్తనంగా అభివర్ణిస్తూ ఉండేవి.

అభ్యుదయ రచయితలు, వారి శాసకులూ కూడా, తాము ప్రబోధించే ప్రజావిమోచనానికి ప్రజలింకా విముఖులుగానే వున్నారని గ్రహించారు. మారువేషాలు,

మాయోపాయాలు ఎక్కువ ఉపకరించలేదు. భారతదేశపు యెనాన్ కాగలదని కలలుగంటూ వచ్చిన తెలంగాణాలో కూడా ప్రజలు తమను పరదేశాదేశాల ప్రకారం పనిచేసే బందిపోటు ముఠాగానేచూస్తున్నారని కమ్యూనిస్టులు గ్రహించారు. పైగా, విదేశాలనుండి తమకు ఆదేశాలుపంపే బుద్ధిమంతులుకూడా తమ విధానాలను మార్చుకుంటున్నారు. అందువల్ల మన అభ్యుదయవాదులుకూడా కొత్తధోరణిలో మాట్లాడకతప్పలేదు. ఈధోరణి లోగడ 1930 లో వారు అవలంబించిన ధోరణిని జ్ఞప్తికి తెస్తూంది.

1953 లో మళ్ళీ వీరు ఢిల్లీలో మరో మహాసభ జరిపారు. ఈ సభ మార్చి 8 వ తేదీని ప్రారంభమయింది. వర్గ విభజన పద్ధతినుంచి తిరిగి సమష్టి సమరనీతికి ప్లేటు ఫిరాయించటమెలాగా అన్నదే నాటి వారి ప్రధానసమస్య. ఈ మహాసభలోవారు తయారుచేసిన ప్రణాళిక భిమ్రీసభ ప్రణాళికకన్న, తొలిప్రణాళికకు ఎక్కువ సన్నిహితంగా ఉంది. “సుఖతర, అభ్యుదయకర జీవనవ్యవస్థను సాధించటానికిగాను రచయితలు, కళాకారులు కలిసి సమష్టికృషి సాగించాలని ఈ ప్రణాళిలో ఉద్బోధించారు. కాని, వారు కోరే సమష్టి కృషి కమ్యూనిస్టుల జిత్తులకు అనుగుణమైన విలక్షణ తత్వం గలది అనటానికి వారు ఏర్పాటుచేసిన సాంస్కృతిక కార్యక్రమాలే నిదర్శనం. అభ్యుదయ నిరోధకులు, యుద్ధోన్మా

దులు నశించాలంటూ మామూలు కేకలన్నీ వేయనేవేశారు. లోగడ అవలంబించిన "తీవ్రవాదానికి, వర్గ వివేచన విధానానికి" బాధ్యతయావత్తు శ్రీయుతులు రామవిలాసశర్మ, ఆలీసర్దార్ జాఫ్రీల నెత్తినవేశారు. (శ్రీ జాఫ్రీ అంతవరకు రచయితలరంగంలో కమ్యూనిస్టుల నమ్మినబంటు) ఈమహాసభలోమళ్ళీకొత్తగా నాయకులను ఎన్నుకున్నారు. కాని, ఈ పర్యాయం క్రిషన్ చందర్ ని ప్రధానకార్యదర్శిగా ఎన్నుకోనటం మాత్రం చిత్రంగాఉంది. నిజానికి అతివాద ధోరణిలోను, వర్గవివేచన విధానంలోను ఆయన రామవిలాసశర్మ, జాఫ్రీలకు అణుమాత్రం తీసిపోయిన వాడుకాడు.

ఈ మహాసభ పాక్షికవిజయం మాత్రం సాధించింది. 'నూతన పరిణామం' అనే ప్రణాళికను ప్రచారం చేయటానికి ఈసభ ఉపయోగపడింది. ఆవిధంగా అభ్యుదయరచయితలు మళ్ళీ బురఖాలు తొడుగుకొని ప్రభుత్వప్రేరిత సాంస్కృతికోద్యమాలలోకి చొరబడడానికి, అదివరకే చొరబడిఉన్నవారి భద్రతకు, అవకాశం కల్పించింది. ప్రభుత్వార్థిక సహాయంతో నడపబడుతూన్న 'అంజుమనే తారాకేఉర్దు' వంటి సంస్థలు సజ్జద్ జహీర్ వంటివారిని కూడా తమకార్యవర్గాలలో చేర్చుకొనటానికి ఈ రకమైనప్రచారమే అవకాశం కల్పించింది. జహీర్ పాకిస్థాన్ పౌరుడుగా ఉండగానే అతనికి ఆస్థానం లభించింది.

అయితే అభ్యుదయ రచయితల వ్యవస్థను పునర్ని ర్మించి బలపరిచే ప్రయత్నంలో మాత్రం ఈ సమావేశం విఫలమయింది. అభ్యుదయవాదుల మధ్య ఏర్పడిన పరస్పర స్పర్థలు, అందరికీ గౌరవపాత్రుడయిన నాయకు డెవడూ లేకపోవటం, ఈ వైఫల్యానికి కారణాలు. సజ్జద్ జహీరు భారతీయ సాంఘిక జీవితంలో అతడు శీఘ్రంగా స్థిరపడటం ఈలోపాలను తీర్చగలదని ఆశించారు. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలకు స్వచ్ఛంద సేవకుల సహకారాన్ని సమ కూర్చడం నిమిత్తం ఏర్పాటు చేయబడిన భారత సేవక సమాజంలో కూడా అప్పటికే జహీర్‌కి ప్రవేశం లభించింది.

తరువాత మళ్ళీ 1956 మార్చి మొదటివారంలో ఉత్తర ప్రదేశములోని మహాపట్టణంలో జరిగిన అభ్యుదయ రచయితల సమావేశం ఈకార్యక్రమానికి పునాది వేసింది. సజ్జద్ జహీర్ ప్రచార సంచార సంరంభానికి పర్యవసానంగా ఈ సమావేశం జరిగిందని ఢిల్లీలో మహాల్ అనే ఉర్దూ పత్రిక వ్రాసింది. బొంబాయి, కలకత్తా, హైదరాబాద్, పాట్నా, ఢిల్లీ మొదలైన ప్రదేశాల అభ్యుదయ రచయితలు మహాసమావేశానికి హాజరయ్యారు.

అభ్యుదయ రచయితల సంఘం ఉర్దూ శాఖను పునర్నిర్మాణం చేయటం అవసరమని ఆ సభకు హాజరయిన వారంతా సమ్మతించారని అనంతరం జహీర్ ఒక ప్రకటనలో

వెల్లడించాడు. తరువాత క్రమంగా హిందీశాఖను, ఇతర శాఖలను కూడా పునర్నిర్మించాలి. ఆవిధంగా కేంద్ర సంఘాన్ని పునర్వ్యవస్థీకరించి బలపరచాలని వారి ప్రయత్నం. అప్పుడే, ఒక ప్రశ్నావళినికూడా విడుదల చేశారు. అసలు 'అభ్యుదయ' అనే పదం ఈ సంఘనామధేయంలో భాగంగా ఉండటం మంచిదేనా అన్నదికూడా అందులో ఒకప్రశ్న.

అనంతరం మే చివరివారంలో హైదరాబాదులో జరిగిన ఒక సమావేశంలో ఈ సంస్థను పునర్నిర్మించేటప్పుడు అభ్యుదయ శబ్దానికి స్వస్తి చెప్పటానికి తీర్మానించారు.

అచటచేసిన తీర్మానంలో అసలు అభ్యుదయ రచయితల సంఘం ఇంకఉండవలసిన అవసరంలేదని దాని స్థానంలో అందరు రచయితలకు, అందరు కళాకారులకు, "వారిరాజకీయ ఆర్థికాభిప్రాయాల" విచక్షణలేకుండా ప్రవేశంఉండే మరొక నూతన సంస్థను ఏర్పాటు చేయటానికి నిశ్చయించారు.

లోగడ అభ్యుదయ రచయితల సంఘ విధానాలు, కార్యక్రమాలు భారత కమ్యూనిస్టుపార్టీ కార్యవిధానాలతో పాటుగా లండన్‌లో నిర్ణయింపబడేవి. అలాగే, ఈ నూతన ప్రణాళికకూడా భారతదేశంలోకాక, విదేశాలలో అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకులచే రూపొందింప బడటం గమనింపదగిన విషయం. 1955 జూన్‌లో హెల్సింకీలో జరిగిన

ప్రపంచశాంతి మహాసభకు భారతదేశంనుంచి 90 మంది ప్రతినిధులు వెళ్ళారు. వారిలో ఆనంద్‌కూడా ఒకడు అక్కడ వీరికి అందజేయబడిన ఒక ప్రకటనపత్రంలో ఇలాఉంది.

"జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో సకపూర్ణంగా, స్వేచ్ఛగా, భావరచనా వినిమయాన్ని, భావనా ప్రకటన స్వాతంత్ర్యాలను అప్రతిహతంగా సమకూర్చగల విధానం అవసరమని హెల్సింకీలో 1955 జూన్ 22 నుండి 29 వరకు జరిగిన ప్రపంచశాంతి మహాసభకు హాజరయిన రచయితలు, కళాకారులు గాఢంగా విశ్వసిస్తున్నారు."

"జాతీయ సంస్కృతుల విషయంలో పరస్పర గౌరవ భావం ఉండాలనీ, ఈ సంస్కృతుల విశుద్ధతకు భంజకమైన చర్యలన్నీ దుస్సహాములనీ, వాటిని అభివృద్ధి చేయటం, పరిరక్షించటం అవసరమనీ, వారు భావిస్తున్నారు. ప్రపంచ వైషమ్యాలను సన్నగిలజేసి, శాంతిని సువ్యవస్థితం చేయ టానికి సాంస్కృతిక వినిమయావకాశాలను వృద్ధిచేసి స్వేచ్ఛగా సాగనివ్వటంవల్లఎక్కువ ప్రయోజనం ఉంటుందని వారు అభిప్రాయపడుచున్నారు."

"ఇందుకు ఈ దిగువ చర్యలు" ఉపకరించగలవని వారు భావిస్తున్నారు.

"జాతి విచక్షణ విధానాన్ని సమర్థిస్తూ, భిన్నజాతుల మధ్య వైషమ్యాలను పురిగొల్పేబాపతువి మినహా మిగిలిన

సాహిత్యం, నాట్య నాటకాలు, కళలు, చలన చిత్రాలపై ఏ విధమైన అజమాయిషీ, సెన్సార్ షిప్పు, లేకుండా చేయటం. పుస్తకాలపైనా, కళాఖండాలపైన, ఇతర సాంస్కృతిక సామగ్రిపైన ఎగుమతి, దిగుమతి పన్నులను పూర్తిగా రద్దు చేయటం, లేదా కనీసం బాగా తగ్గించటం. ప్రపంచశాంతిని గురించిన అభిప్రాయాల కారణంగా రచయితలను, కళాకారులను ఇతరబుద్ధిశాలులను శిక్షించటం, ఆంక్షపెట్టటం మానివేయటం. సర్వదేశాలలోని పుస్తక విక్రయశాలలోను జాతి విచక్షణను, యుద్ధోన్మాదమును రేపే రచనలు తప్ప మిగిలిన విదేశపత్రికలు, సారస్వతం సాధ్యమయినంత సమగ్రంగా, స్వేచ్ఛగా విక్రయించే అవకాశం కల్పించటం.''

"భిన్న భిన్న అభిప్రాయాలు గల రచయితలు, కళాకారులు అంతా పాల్గొనగల సర్వసారస్వత సహజీవన పరిషత్తును ఏర్పాటుచేయటం. కళా స్వభావాన్నిగురించి, ప్రయోజనాన్నిగురించి వివిధ దృక్పథాల వినిమయానికి అవకాశం కల్పించటం. కళాఖండాల ప్రచురణకు ఉపకరించే భిన్న భిన్న పద్ధతులను పరిశీలించటం. ఇవి ఆ పరిషత్తు ప్రధాన లక్ష్యాలుగా ఉండాలి.

"జాతీయ అంతర్జాతీయ రంగాలల్లో శాంతిప్రియులైన బుద్ధిశాలులకు, కళాకారులకు ఇతర సాంస్కృతిక సంస్థలకు పరస్పర పరిచయాలు కలుగజేయటం, ఆవిధంగా పరస్పర

సహకారానికి, ముఖ్యంగా సాంస్కృతిక వినిమయానికి అవకాశంకల్పించటం..."

"కళాకారుల విదేశసంచారాలకు ఇతోధిక అవకాశాలు కల్పించటం. బుద్ధిశాలులు, కళాకారులు, ముఖ్యంగా విలక్షణ సాంస్కృతిక వ్యవస్థలుగల విదేశాలలో పర్యటించటానికిగాను వారికి సాంస్కృతిక సంచార వేతనాలు ఏర్పాటు చేయటానికి ప్రభుత్వాలు, సాంస్కృతిక సంస్థలు ఇప్పటికన్న ఎక్కువగా, విస్తృతంగా విరాళాలు మంజూరుచేయాలని కోరటం.

రచయితల స్వాతంత్ర్యాన్ని గురించి, సాంస్కృతిక వినిమయాన్ని గురించి ఈ అభిమానానికీ, కమ్యూనిస్టు దేశాలలోని ప్రభుత్వవిధానాలకూ ఎక్కడా పోలికలేదు. రచయితలకు స్వాతంత్ర్యంగాని, భావ వినిమయానికి, సంఘీభావానికి, సంచారాలకు అవకాశాలుగాని కల్పించటానికి కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఎంతమాత్రం సమ్మతించవు. అప్పుడప్పుడు వారు విదేశాలకు పంపే ప్రతినిధి వర్గాలలో కేవలం ప్రభుత్వోద్యోగులు, పార్టీ భక్తులు మాత్రమే ఉంటారు. అందువలన ఈ ప్రకటనలోని ఆశయాలన్నీ కేవలం ఏకోన్ముఖవీధి వంటి వన్నమాట. అదే ఈనవీన రాజనీతిసారం కూడాను. లోగడ వారు జాతీయస్థాయిలో ప్రయత్నించి చూచిన ప్రచ్ఛన్న సంచార విధానాన్నే నేడు అంతర్జాతీయ

స్థాయిలో అమలు జరుప్పజూస్తున్నారు. రష్యా ప్రభుత్వం పెట్టుబడిదారీ దేశాలలోని రచయితలను ఏవిధంగా బుజ్జగించటానికీ, లోబరచుకొనటానికీ, లేక కొనటానికీ ప్రయత్నిస్తున్నదో ఏ కోస్లర్లో మనకు వేరే విప్పి జెప్పవలసిన పని లేదు. హైదరాబాదు సమావేశంలో ప్రముఖులయిన అభ్యుదయ వాదులు చేసిన ప్రసంగాలన్నీ ఈ ప్రకటన పత్రానికి యావద్వ్యాఖ్యలు.

వర్గవిచక్షణను పాటించరాదంటూ, 1936 నాటి సిద్ధాంతాన్ని మళ్లీ ఇప్పుడు పెళ్లగించి పైకితీశారు. కమ్యూనిస్టుల ప్రత్యక్ష ప్రచారాన్ని పెడచెవిని పెడుతున్నవారినీ, ఏవగించుకుంటున్నవారినీ బుజ్జగించి ఆకర్షించటమే వారి ఆశయం. అసలు కళ్ళేము అంతర్జాతీయ కమ్యూనిస్టులచేతులలో ఉన్నంతవరకు కమ్యూనిస్టులతో పూర్తిగా ఏకీభవించని వారిని అభ్యుదయ విరోధకులుగా తెగడి అవతలకి నెట్టివేసే అవకాశం ఎప్పుడూ ఉండనే ఉంది.

కమ్యూనిస్టులలో ఎన్నిలోపాలైనా వుండవచ్చుగాని, ఆత్మస్థైర్యలోపం మాత్రంలేదు. అయితే, ఈ ఆత్మస్థైర్యం ఏదో ఉదాత్తధార్మిక సిద్ధాంతాన్ని అనుసరించి ఏర్పడినద్ది మాత్రంకాదు. సామాన్య సభ్యత, మర్యాద అనే ప్రాథమిక ధర్మాలపట్ల అణుమాత్రం గౌరవం లేకపోవటంవల్ల కల్గిన బాపతు. వారి జిత్తులకు విరుగుడు ఒక్కటే ఉంది. లోగడ

చెప్పిన విషయ పరిజ్ఞానం; వారివాస్తవ లక్ష్యాన్ని, తత్సాధనకు వారి పన్నుగడలను గురించిన జ్ఞానం.

ఒకప్పుడు ప్రపంచశాంతి పేరుమీద, మరొకప్పుడు ఆసియా దేశాల ఐకమత్యం పేరుమీద, కమ్యూనిస్టులు లోబరచుకొన గోరుతున్న వారందరు అప్రమత్తులై వుండ వలసిన అవసరమును ఢిల్లీలో జరిగిన ఆసియా రచయితల మహాసభ మరొకపర్యాయం విశదం చేసింది. చారిత్రక దృష్ట్యా చెప్పాలంటే కమ్యూనిస్టుల లక్ష్యం మాత్రం ఎప్పుడూ ఒకటే. దానికి మార్పుఉండదు. సాధన విధానాలలోను మార్పుండదు. నేడు కమ్యూనిస్టుల ఆధిపత్యం క్రిందవున్న దేశాలలో రచయితలంతా తమ అనభిజ్ఞతకు, అలసత్వానికి ప్రతిఫలంగా దారుణ రక్తపాతానికి గురి అయ్యారు. ఈ దుస్థితి తదితర దేశ రచయితలకుకూడా పట్టకుండా చూసుకోవాలి.



# 2. అవర్గవిచక్షణా వాదంలో రవంతమార్పు

"అనుచితులనుకొన్న వారితో కూడా తాత్కాలికంగా చేతులు కలపటానికి భయపడేవారు ఆత్మస్థైర్య శూన్యులు మాత్రమే."

—'కర్తవ్యం' అనే గ్రంథంలో లెనిన్.

"నైష్ఠికుడు తన విశ్వాసాలను ఇతరుల మీద రుద్దటం మొదలు పెడితే, స్వైరవిహారవాది కన్నా ఇతడే ఎక్కువ చిరాకు గలిగిస్తాడు. స్వైరవిహారవాది ఎప్పటికైనా బాగుపడే అవకాశం ఉంది. నైష్ఠికాహంకారికి మాత్రం ఆ ఆశ లేదు."

రచయితలుగా పేర్కొనదగిన వారంతా అంగీకరించే ఒకానొక సామాన్య విశ్వాసాన్ని వివరించే ఈ మాటలు స్వర్గీయ మున్షీ ప్రేమ్‌చంద్ అన్నవి. 1936 ఏప్రిల్ 10 వ తేదీన లక్నోలో సమావిష్టమయిన అభ్యుదయ రచయితల మహాసభ ప్రారంభ సమావేశంలో అధ్యక్షోపన్యాసం చేస్తూ ఆయన ఈమాట అన్నాడు

ఈ మాటలలో, ఆ సుప్రసిద్ధ భారతీయ నవలాకారుని అభిప్రాయం అసందిగ్ధంగానే వ్యక్తమవుతూంది. అయినా, ఇంకా స్పష్టంగా చెప్పాలనే సంకల్పంతో, "ప్రత్యేకంగా ఒక వర్గానికి ముడిపెట్టుకుని ఉండే" సాహిత్యాన్ని మున్షీ ప్రేమ్‌చంద్ తీవ్రంగా నిరసించాడు. ప్రథమ, ద్వితీయ ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో ఇతరులు చాలామందితో పాటు ఈయనకూడా మానవకారుణ్యవాదం లాగా కనిపించే

కమ్యూనిస్టుల నినాదాలవల్ల ఆకర్షింపబడిన వాడవటం వల్ల, ఈ విషయం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోనటం అవసరం.

ఈయన అభిప్రాయాన్ని కమ్యూనిస్టుల సాహిత్య సిద్ధాంతానికి పునాదిరాయి అయిన లెనిన్ అభిప్రాయంతో పోల్చిచూద్దాం. రష్యాలో బోల్షివిస్ట్ రాజ్యస్థాపకుడు అయిన ఆ మహాశయుడు ఆ ప్రకటనలో ఇలా వివరించాడు. "సాహిత్యం అసలు పార్టీసాహిత్యం కావాలి...... సమాజవాద కార్మికవర్గం పార్టీ సాహిత్యసిద్ధాంతాన్ని రూపొందించి, వృద్ధిచేసి, సాధ్యమయినంత సంపూర్ణంగా, సమగ్రంగా తీర్చిదిద్దాలి."

లెనిన్ ప్రతిపాదించిన ఈ పార్టీసాహిత్యసిద్ధాంత స్వరూపమేమిటో చూద్దాం. ఇది కేవలం "సోషలిస్టుకార్మిక వ్యవస్థలో సాహిత్యం వ్యక్తులకు, బృందాలకు సంబంధించినదిగా ఉండరాదనీ, కార్మికవర్గ సమష్టిశ్రేయస్సుకు అతిరిక్తమైన వ్యక్తిగతప్రయోజనమేమీ సాహిత్యానికి ఉండరాదనీ మామూలుగా వారుచెప్పే సిద్ధాంతం"తో సరిపుచ్చక, "పార్టీ (అనగా కమ్యూనిస్టుపార్టీ)తో సంబంధంలేని రచయితలను, సాహిత్యాన్ని ఖండించాలి." అనికూడా శాసిస్తూంది. "పార్టీని బలపరచని రచయితలు నశించాలి. అతిమానవతా రచయితలు నశించాలి." అన్న నినాదాలను ఆ ప్రకటనలో లెనినే ఉపదేశించాడు. ఈ మాటలన్నీ లెనిన్

రచించిన "పార్టీపత్రిక – పార్టీసాహిత్యం" అనే గ్రంథం లోంచి ఉటంకించినవి.

కనక, మున్షీ ప్రేమ్‌చంద్ విశ్వాసాలకు లెనిన్ అభిప్రాయంతో సమన్వయం చేయటమనేది ఏవిధమైన తర్కం వల్ల సాధ్యంకాదు. ఒకరు స్వతంత్ర రచనావాది, అందులో స్వైరవిహారికి కూడ ఆ స్వాతంత్ర్యం ఉండాలంటూంటే, మరొకరు సాహిత్యమంతా కమ్యూనిస్టుపార్టీ అవసరాలకు, అగత్యాలకు అనుగుణంగా ప్రవర్తిల్లాలంటున్నారు. ఉదాత్త ఆశయాలుగల రచయిత లందరిలాగే ప్రేమ్‌చంద్ కూడా, సాహిత్యం "ఏదో ఒకవర్గానికి ముడిపెట్టుకుని" ఉండరాదన్నాడు. లెనిన్ అలాకాక సాహిత్యమంతా ఒకానొక పార్టీ, కార్మికవ్యవస్థ అనబడేపార్టీ అదుపాజ్ఞల్లో నడవాలన్నాడు.

సాహిత్యాన్నిగురించి కమ్యూనిస్టుల సిద్ధాంతానికి ఇంత విరుద్ధమైన అభిప్రాయాలుగలవ్యక్తి, తన విశ్వాసాలకు పూర్తిగా వ్యతిరిక్తమైన ప్రయోజనాలకు తనను వారు ఉపయోగించుకొనటానికి ఎలా ఒప్పుకున్నాడు? లేక, ఈ ప్రశ్ననే ఇంకోవిధంగా తిప్పిచెప్పుకుంటే, అసలు కమ్యూనిస్టులు తమ విశ్వాసాలతో ఏకీభవించే అనుచరుణ్ణి ఎవరి నయినా చూసుకోక, తమ భారతీయ రచయితల సమ్మేళన మహాసభకు అధ్యక్షత వహించవలసినదిగా ప్రేమ్‌చంద్‌ని ఎందుకు వరించినట్లు?

తొలి ప్రశ్నకు జవాబు చెప్పడం కొంతవరకు సులభమే. ఏవిధంగానైనాసరే పలుకుబడి సంపాదించటమే లక్ష్యంగా పెట్టుకునే అభ్యాసం కమ్యూనిస్టులకు లేకపోవచ్చునని భావించటం వల్లనూ, అమితోత్సాహం వల్లనూ ఇతరులు చాలామందిలాగే ఆయనకూడా వారి వాస్తవస్వరూపాన్ని గ్రహించలేకపోయాడు. పైగా, సర్వత్ర నిస్పృహ, నిరాశ వ్యాపించి ఉన్న ఆ రోజులలో ఈ విధంగా అపోహపడిన వాడు ఆయన ఒక్కడేకాదు. చుట్టూ ఎక్కడచూసినా వెలుగు, చీకటి ఒకదాని ప్రక్కన ఒకటి కనిపిస్తూ విభ్రాంతి కలిగిస్తూన్న ఆ సమయంలో సదాశయ ప్రేరితులయిన పురుషులు, స్త్రీలు ఎందరో తమకు ఇష్టం ఉన్నా లేక పోయినా దారుణమైన అప్రతిహతమైన ఆ చీకటినే ఆశ్రయించి ఇతరులకన్న తమకే హానికరమైన పెద్ద కుట్రకు దోహదం చేశారు.

ఈ మహాసభను ఏర్పాటు చేసిన కమ్యూనిస్టులకు మాత్రం ఇది ఉపాయంగా పన్నిన వల. రచయితలను, చిత్రకారులను పూర్తిగా తమ బానిసలుగా చేసుకొనటానికి కమ్యూనిస్టుల విస్తృత ప్రణాళికలో భిన్న భిన్న ఘట్టాలు ఉపఘట్టాలు చాలా ఉన్నాయి వాటికి తగిన వేరు వేరు నినాదాలున్నాయి. వారి రాజనీతి మారినప్పుడల్లా ఆ నినాదాలు మారిపోతయి. స్నేహితులు, శత్రువులుకూడా మారి

పోతారు. ఇప్పటి ధోరణి ప్రకారం ఇదొక ఏకోన్ముఖవీథి. ఈ నినాదాలవల్ల, స్నేహాలవల్ల కమ్యూనిష్టులకు లాభం ఉంది. మిగిలినవారు మాత్రం పిభ్రాంతులై, నిశ్చేష్టులై, తమకు కలిగిన నష్టాలనుకూడా గణించి చూసుకోలేని అయోమయస్థితి లోపడతారు.

భారతదేశంలో కమ్యూనిస్టులు తమ ప్రారంభ సమావేశానికి మున్షీ ప్రేమ్‌చంద్‌ను అధ్యక్షుణ్ణిగా ఎన్నుకొన్నప్పుడు ఆయన విశ్వాసాలు వారికి తెలియక పోనూ లేదు. తమ వేదిక పైనించే ఆయన తమ సిద్ధాంతాలకు విరుద్ధమైన విషయాలు చెప్పవచ్చుననే సంగతి వారు ఊహింపకపోనూలేదు. వారు లాభాలాభవివేకం పుష్కలంగా ఉన్న ఉపాయజ్ఞులు. ఆయన తమతో ఏకీభవించని విషయాలేమిటో వారికి తెలుసు. అవి వారి ఉద్యమానికి నష్టం కలిగింపకపోగా, మొత్తంమీద విశేషంగా దోహదం చేయు గలుగుతా యనికూడా వా రెరుగుదురు. ఆనాడు వారి సిద్ధాంతాలను ఆమోదించేవారు రచయితలలో అత్యల్ప సంఖ్యాకులు. అందువల్ల వారి సభలకు సాధ్యమయినంత ఎక్కువ మందిని ఆకర్షించి తమతో ఏకీభవించే వారిని ఎంచుకొనడాని కొక అవకాశం కల్పించుకొనటం, ఉపాయంగా తమ వాదానికి కొంత ప్రతిష్ఠను సంపాదించుకొనటం ఆనాడు వారికి ముఖ్యం. కనుక తమ వర్గవిభేదసిద్ధాంతాన్ని

కొంత ప్రచ్ఛన్నంగా ఉంచితే తప్ప ఇది సాగదు. మున్షీ ప్రేమ్‌చంద్ అధ్యక్షత ఈ లక్ష్యసాధనకు ఉపకరించిది. అంతేకాదు. "హిందూస్తానీ నవలా కథా రచయితలలో అగ్రగణ్యుడు ప్రముఖ మానవకారుణ్యావాది అయిన ప్రేమ్‌చంద్ ఈ ప్రథమ సమావేశానికి అధ్యక్షత వహించటమే "అభ్యుదయ" పదానికి మన నిర్వచనం సంకుచితంగాని, వర్గసంబంధి గాని కాదనటానికి ప్రబల నిదర్శనం" అని అభ్యుదయ రచయితల సంఘం ప్రధానకార్యదర్శి సజ్జద్ జహీర్ ప్రగల్భంగా చెప్పుకోటానికి కూడా అవకాశం ఏర్పడింది.

తమ రచయితల సంస్థ వర్గపరిమితం కాదని బాగా ప్రచారం చేసుకొనటం వారికి అవసరం. ఇది జరుగనిదే ప్రచ్ఛన్న వేషాలతో ఎక్కడికి పడితే అక్కడికి చొచ్చుకొనిపోయి, మోసగించాలనే తమ జిత్తులు పారవు. ఈ ఆశయం నెరవేరుతూండటం వల్లనూ, నడిపే యంత్రాంగం, కార్యవర్గం తమ చెప్పుచేతలలో కట్టుదిట్టం చేసుకొని ఉండటంవల్లనూ, కమ్యూనిస్టులు తమలో తాము నవ్వుకుంటూ, సంతృప్తిగా తలలూచుకొనటం సంభవించింది. ప్రస్తుత రచయితలకన్న విశ్వసనీయులు, తమకు పూర్తిగా లోబడి ఉండేవారు, దొరికేవరకు వేచి ఉండటంవల్ల వారికి నష్టమేమీ లేదు. ఆలాంటివారు దొరకగానే ఎలాగూ ఈ పూర్వ

స్నేహితులందరినీ వాళ్ళు అభ్యుదయ నిరోధకులనీ, విప్లవ వ్యతిరేకులనీ నిందించి బయటికి నెట్టివేయటం, ఈ లోగా ఒక వేళ ఏవిధంగానైనా తాము రాజకీయాధికారం చేజిక్కించుకోగలిగితే అసలు వారిని అయిపులేకుండా చేయటం, వారు సులభంగా చేయగలరు.

అనుకున్నట్టే, ఈపూర్వ స్నేహితులను తమ సాహిత్య వేదికనుంచి గెంటివేసే సమయం కూడా వచ్చింది. ఆ సమయంలో జాతీయ, అంతర్జాతీయ పరిస్థితిని అపార్థం చేసుకొని, తమకు రాజకీయాధికారం కూడా చేజిక్కబోతున్నదనీ, భారత దేశంలో కూడా కనీసం ఒక 'యెనాన్' (కమ్యూనిస్ట్ రాష్ట్రం) ఏర్పాటు కాబోతున్నదనీ, కమ్యూనిస్టులు ఆశిస్తున్నారు. అయితే, ఈ దేశానికి ఆ దురదృష్టం తప్పిపోయింది. దాంతో, కమ్యూనిస్టుల పూర్వ స్నేహితులకు ఆ పాప ఫలితాన్ని అనుభవించే యోగం కూడా తప్పిపోయింది. రష్యా, చైనా దేశాలలో రచయితలకు మాత్రం ఆ దురవస్థ తప్పలేదు. ఆ రెండు దేశాలలో కమ్యూనిస్టుల విజయం రచయితల దుర్గతికి కారణమయితే, భారత దేశంలో కమ్యూనిస్టుల పరాజయం రచయితలకు శ్రీరామ రక్ష అయింది.

అంతటితో ప్రమాదంతొలగిపోలేదు. కమ్యూనిస్టులు మళ్లీ తమ పాతఆట మొదలుపెట్టనూపెట్టారు; మళ్ళీ కొంత

కాలం ఉపయోగించుకొని, కల్లబొల్లి నేరాలు మోపి బయటికి నెట్టి వేయడానికి వీలుగా వారికి మళ్ళీ కొత్త స్నేహితులు దొరకనూ దొరికారు. భవిష్యత్తులో ఈ కుట్రకు గురి అవబోయేవారు, తెలియనితనం వల్ల తమపైన తామే కుట్ర పన్నుకుంటున్నా రన్నమాట. ఇప్పుడు పన్నుతూన్న కుట్ర లోగడదాని కంటె కట్టుదిట్టమైనది. అంతకన్న విస్తృతమైనది. ఈ పర్యాయం ఈ వలలోపడి భవిష్యత్తులో దెబ్బ తినబోయేవారు కేవలం రచయితలు ఆదర్శవాదులు మాత్రమే కారు. అంతకన్న విషయజ్ఞులై దేశీయ రాజకీయాల లోను, పరిపాలనలోను పాల్గొంటూన్న ప్రముఖులు కూడా ఉన్నారు.

కొంతవరకు, దీనికి కారణం దాదాపు ఒక తరంగా ప్రముఖ స్థానాలలోకి ప్రచ్ఛన్నంగా దూరుతూ వచ్చిన వారి చాకచక్యమే కావచ్చు. కాని, ప్రధాన కారణాలు మాత్రం కమ్యూనిస్టుల జిత్తులను గురించి, పన్నుగడలను గురించి, అంతిమ లక్ష్యాన్ని గురించిన అవజ్ఞ; ఔచిత్య మెరుగని ఆదర్శవాదం. ఇతర దేశాలలో జరిగిన సంఘటనలు మన దేశంలో కూడా జరుగవచ్చుననే ప్రమాదాన్ని వారు ఎందువల్లనో గ్రహించలేక పోతున్నారు.

సాహిత్యం సుఖతర జీవనతృష్ణకు సంకేతం. అందువల్ల ప్రస్తుత స్థితి ఇలాగే ఉండాలనకుండా, సాంఘికమైన

పరిణామాలను కోరవచ్చు. కాని, రచయితలు మాత్రం వాటికి అతీతంగా ఉండటం అత్యవసరం. జీవితంలో అనౌచితి పట్ల విప్లవంగా వెల్లి విరిసే అసంతృప్తి దివ్యమైనది. దాని ప్రభావం సహజంగా ఉదాత్తమై తద్భిన్నమైన రామణీయకం వంకకు మొగ్గు చూపుతుంది. ఈ అంతః ప్రవృత్తిని నిరోధించటమే జరిగితే అది జీవితాన్ని స్తబ్దం చేసి, భవిష్య దభ్యుదయాన్ని అరికడుతుంది.

ఒకానొక రచయిత కేవలం తన సాహిత్య ప్రవర్త కత్వంతో తృప్తిపడక, సాంఘిక విప్లవమని తాను భావిస్తున్న సమష్టి ఉద్యమంలో వేలుపెట్టబోతే మాత్రం ఆ మార్గంలో ఎదురయ్యే భూత ప్రేత పిశాచాలను గురించి ముందుగా అతణ్ణి హెచ్చరించడం అవసరం. అతడు తన ఆదర్శ వాదాన్ని ప్రచ్ఛన్నంగా భగ్నంచేసే కుయుక్తులనుండి ఆత్మరక్షణ చేసుకోవాలి.

జీవితంలోని అపరిపూర్ణతను గురించి చింతించడం అధర్మమూ కాదు, అనుచితమూ గాదు. అయితే తలనొప్పికి చికిత్స తల తెగ్గొట్టుకొనడం కాదుగద! బూర్జువా రచయితలు, చిత్రకారులు, నటులు అనుభవించే స్వాతంత్ర్యం వట్టి నేతి బీరకాయ అనీ, బ్రతుకు తెరువుకోసం, జీతండబ్బులకోసం, లంచంకోసం దేవులాడే ప్రచ్ఛన్న పారతంత్ర్యమనీ లెనిన్ గాని, ఆయనసూక్తికి వ్యాఖ్యానాలు చేసేవారు గాని చెప్ప

తున్నప్పుడు, వారి వాస్తవ అభిప్రాయ మేమిటో మనం స్పష్టంగా తెలుసుకోవాలి. ఈ ఆర్థిక పారతంత్ర్యాన్ని బాపు కొనడం, రచనాస్వాతంత్ర్యాన్ని సమగ్రమైనదిగా, పరిపూర్ణ మైనదిగా, పటిష్ఠమైనదిగా చేసుకొనడానికా? లేక, నిరంకుశ సర్వాధికార ప్రభుత్వానికో, సర్వజ్ఞత్వంగల పార్టీకో దానిని పూర్తిగా బలిపెట్టడానికా?

ఉపాయంగా తమపని తాము చక్కబెట్టుకోదలచు కొన్న కమ్యూనిస్టులు ఈసూటి ప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పక డొంకతిరుగుడు వాదాలు ప్రారంభిస్తారు. కాని, కమ్యూనిస్టు సిద్ధాంతుల రచనలను శ్రద్ధగా పరిశీలిస్తే మనకు సూటిసమాధానమే దొరుకుతుంది.



# సాహిత్యంలో 'పార్టీవాదం' అంతరార్థం

"మనదేశంలో సత్యానికి ఒక్కటే స్వరూపం—అదే ప్రభుత్వసత్యం. మనదేశం కమ్యూనిజం వంకకు పురోగమిస్తూంది."

—వి. లాప్షేవ్ జరియా.

1913 లో ప్రకటితమయిన 'భావనాస్వాతంత్రచరిత్ర' అనే గ్రంథంలో ప్రొఫెసర్ జె. బి. బర్రీ ఇలా వ్రాశాడు. "అధికార దురహంకారానికీ, హేతువాదానికీ జరిగిన సంఘర్షణ అంతమయిపోయింది. స్వేచ్ఛావాదానికి విస్పష్టమైన, శాశ్వతమయిన విజయం లభించింది. బాగా నాగరకమైన అభ్యుదయ దేశాలన్నీ చర్చాస్వాతంత్ర్యం ప్రధాన సిద్ధాంతమని అంగీకరించినవి."

ఆసమయంలో సముచితంగా కనిపించిన ఈవ్యాఖ్యానం చేసిన తరువాత, ఇంచుమించు అంతర్వాణి ప్రేరితుడై ఆయన ఇంకోవిషయం కూడా గ్రహించాడు. తన ఆశాలతను చరిత్ర క్రూరంగా త్రుంచివేసే అవకాశం లేక పోలేదన్నాడు. మానవాభ్యుదయాన్ని గురించి ముందుగా యోచించి పెట్టుకున్న విశ్వాసాలను పట్టుకుని ప్రాకులాడక, నిరంతర వివేచనతో సత్యాన్వేషణ చేసే వాడవటంవల్ల, ఈ అభ్యుదయం శాశ్వతమనీ, అప్రతిహతమనీ అయినా దానికి మధ్యలో చాలా అవరోధాలు కలుగవచ్చునని గ్రహించాడు.

నిజానికి ప్రొఫెసర్ బర్రీ సూచనలలో ప్రధానమైన విషయం, ఈ భావనాస్వాతంత్ర్యానికి అంతరాయం కలుగవచ్చునని ఆయన గ్రహించటం కాదు. ఆ అంతరాయం భవిష్యత్తులో ఏవిధంగా ఎవరివల్ల కలగబోయేదీకూడా కేవలం జ్యోతిష్కునివలె ఆయన చెప్పగలగటం. అట్టి భావి నిరంకుశత్వాన్ని గురించి ఆయన ఇలా వ్రాశాడు.

"నేడు భావప్రకటనాస్వాతంత్ర్యం ఉన్నదేశాలలో ముందు ముందు దమనవిధానాలు తలయెత్తవచ్చునని భావించటం ఎంత మాత్రం అసంగతంకాదు. విప్లవాత్మకమైన సమాజవాద ఉద్యమం బయలుదేరి; అదికూడా (ఫ్రెంచి విప్లవంవలె) సులభ సాధనోపాయాల పట్ల గల విశ్వాసంవల్ల ప్రేరితులైన వారిచే నడుపబడినదయి, ఆ విశ్వాసాలను అమలు జరపడమే ప్రధాన లక్ష్యంగా గలదయితే దమనవిధానానికి దారితీయక తప్పదని మనకు అనుభవ పూర్వకంగా తెలుసు."

పై వాక్యాలుగల గ్రంథం ప్రకటితమయిన నాలుగు సంవత్సరాలకే ఈ జోస్యం యథార్థమని రుజువయింది. "అధికార దురహంకారానికీ, హేతువాదానికీ సంఘర్షణ" జరిగి అది "స్వేచ్ఛావాదానికి విస్పష్టమైన శాశ్వత విజయంగా పరిణమించిన ఘటనకు అవకాశం లేని దేశంలో" ఇది రుజువవడం మరింత శోచనీయం.

---

(ప్రొఫెసర్ బర్రీ వాక్యాలు శ్రీయుతులు జార్జ్ ఎస్. కౌంట్స్, నూషియాలాడ్జ్‌లు రచించిన "అంధులరాజ్యం" అనే గ్రంథంలోంచి ఉటంకించినవి.)

4

"సులభ సాధనోపాయాల పట్ల గల విశ్వాసం" వల్ల ప్రేరితులైన వారిచే నడుపబడిన విప్లవాత్మక సమాజ వాదోద్యమం విజయవంతమయి స్థిరపడింది. కాని, ఇది 19 వ శతాబ్దిలో (యూరప్‌లో చెలరేగిన) మహా సంరంభం వల్ల ఉత్తేజితమైన దేశాలలో కాదు జరిగింది. అసలు మధ్యయుగాలనాటి నిరంకుశ విధానాల నించే బయటపడని రష్యా దేశంలో యీవిజయం లభించింది. ఈవిజయానంతరం ఆ విప్లవాత్మక సమాజవాదోద్యమ నాయకత్వం "సులభ సాధనోపాయ నిర్వచనాలచే ప్రేరితులు" అవటంతోపాటు దారుణ నిరాశావాదు లనికూడా అనంతరం రుజువయిన కొందరి చేతులలో పడింది.

ఆ పైన బెర్రీ చెప్పిన జోస్యాన్ని అక్షరాలా ఋజువు చేసిన ఆ సోవియట్ రష్యాల్లో జరిగిన సంఘటనలు వర్ణించటానికి, భావించటానికి కూడా అలవికానివి. నిరంకుశ దమన విధానాలను నమ్మటానికి కూడా వీలులేనంత దారుణంగా, అంతవిస్తృతంగా రూపొందించారు. ఈ నమ్మలేక పోవటానికి మూలకారణం మనకు తెలియని ఒకానొక భయం. దానిని అంగీకరిస్తే మానవ సహజమైన సహృదయతలో మనకు గల మూలవిశ్వాసానికే ముప్పు కలుగవచ్చుననే అంతరంగికమైన భయం. నిజానికి మానవ సహృదయతలో మనకు గల ఈ మూలవిశ్వాసమే అనేక దారుణసంఘటనలతో కూడిన

చరిత్ర పొడుగునా మానవునికి శ్రీరామరక్ష అయింది. మానవస్వభావం వాస్తవంగా అంతక్రూరమైనదీ, అసహన పూరితమైనదీ అయితే, ఇక తరుణోపాయం ఏముంది అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఆదర్శవాదం అంతనీచస్థితికి దిగజార గలిగితే, బ్రౌనింగ్ మహాకవి అభివర్ణించిన "సర్వవిషయాలలో నిక్షిప్తమైయున్న పరమ ఔచిత్యం పట్ల విశ్వాసం" అనే మనోహర భావన గతి ఏమి కావాలి?

ఈ ప్రశ్నలన్నీ మనకు తెలియకుండానే మనలో అంకురించి, చివరికి మన మధుర స్వప్నాన్ని భగ్నం చేసే ఈ వాస్తవ సంఘటనల దుర్భరస్వరూపాన్ని అవిశ్వసనీయాలని త్రోసివేయటానికి ప్రేరేపిస్తాయి.

మన మధుర స్వప్నాలను ఈ విధంగా సజీవంగా ఉంచుకొనగలిగితే, ఈ ఉద్యానవనం నిత్య మనోమోహనంగానే ఉండేది కాని, ఆ అవకాశం కనిపించటంలేదు. మన మధుర స్వప్నాలు వాస్తవికమైన దుస్సహదృశ్యాలచే భగ్నం కాకుండా కాపాడుకోటానికి మార్గం ఆజుగుప్సాకరదృశ్యాలను చూడకుండా కళ్ళుమూసుకోవడం కాదు. దానిని పరిశీలించి, చక్కబరిచే ఉపాయం చూడాలి. ఈ ఉద్యమానికి ఉపక్రమించటానికి పూర్వం, మానవాభ్యుదయానికి, హేతువాదానికి, స్వాతంత్ర్యానికి ఏర్పడిన ఈ నూతన ప్రమాదం యొక్క స్వరూపాన్ని, విస్తృతిని సక్రమంగా అర్థం చేసుకొనటం అవసరం.

మానవభావన పైన, ఆశయాల పైన కమూనిస్టులు ఆధిపత్యం చెలాయించటమనేది ఏదో దైవికంగా తటస్థించిన సంఘటన కాక, ముందుగా యోచించి నిర్ధారణచేసి ఉంచిన ఒకానొక ప్రణాళికలో భాగం అన్న విషయమే మనం ముఖ్యంగా గ్రహించవలసిన ప్రబల సత్యం. మానవుని మనస్సును బానిసగా చేయ బూనుకున్న వారు కేవలం "సులభ సాధనోపాయాల పట్లగల విశ్వాస" ప్రేరణతోనే ఈ పని చేయటంలేదు. తమ సాధనోపాయాలు శాస్త్రీయ పద్ధతులపై రూపొందించినవనీ, అవి పూర్తిగా నిర్దుష్టములనీ కూడా వారి నమ్మకం. తోటిమానవులపట్ల వారు చేసే క్రూర కృత్యాలు, దారుణ దురంతాలు విప్లవ సంరంభంలో అక్కడక్కడ తాత్కాలికంగా జరిగే దురాగతాలను బోలినవి కావు. చల్లగా కూచుని, ఆలోచించి ఆలోచించి, తీర్మానించినవి. నిరంకుశప్రభుత్వోపకరణాలన్నీ ఈ అకృత్యకాండకు అండ.

చండశాసనుడైన స్టాలిన్ ఈ ఉపకరణాలన్నింటిని సమగ్రంగా కట్టుదిట్టం చేసిపెట్టాడనటానికి సందేహించవలసిన పనిలేదు గాని, అతడే వాటిని సృష్టించాడనటం మాత్రం సబబుకాదు. అతడు చేసిన పనులన్నిటికీ ప్రాతిపదికలైన మూల సూత్రాలను నిర్వచించిన వారు మార్క్సు, లెనిన్.

మానవభావనాస్వాతంత్ర్యానికి మొట్టమొదట దెబ్బ కొట్టినవాడు కారల్ మార్క్స్. ఆయన అసలు అట్టి స్వాతంత్ర్యం ఉండటానికే వీలులేదన్నాడు. భావన సాంఘిక పరిసరాలకు బానిస అన్నాడు. ఈ విధంగా భావనకు స్వాతంత్ర్యమే లేదనీ, నాడు ప్రచారంలో ఉన్న భావాలే దానిని రూపొందిస్తాయనీ, ఆపైన సంభవించే సాంఘిక పరిణామాలతో పాటుగా భావనకూడా మారుతూ ఉంటుందనీ సిద్ధాంతీకరించాడు. ఈవిధంగా ఆయన, తన తరువాత తనపేరు మీద అధికారంలోకి వచ్చిన నిరంకుశులంతా తోటిమానవులకు తాము నిర్ణయించిపెట్టిన సాంఘికవ్యవస్థకు అనుకూలంగా భావనచేయలేని తల లన్నింటినీ తొలగించి వేయటానికి పునాది వేశాడు.

పైగా – కవులు, రచయితలు, చిత్రకారులూ కూడా తన వారసులు విధించే నిర్బంధాలను. శిక్షలను తప్పించుకొనటానికి వీలులేకుండా చేయటానికో అన్నట్టు సాహిత్యము, కళ, "మానిసిక విజ్ఞాన రూపములు" అనీ, అవికూడా "భావనా పరిధిలో భాగాలే" అనీ కూడా ఆయన సిద్ధాంతం చేశాడు.

కళాసృష్టి ప్రేరణలు వ్యక్తి మనస్సులోని బాహ్యభావనా పరిధిలో ఉద్భవించేవి కావనీ, అంతకన్న చాలా లోతైన ఆ వ్యక్తి మనస్సులో వికసించేవనీ విశ్వసించే కళా సాహిత్య విమర్శకులు కళను, సాహిత్యాన్ని ఈ విధంగా

నిరంకుశంగా వర్గీకరించటానికి వీలులేదని తీవ్రంగా వాదించ వచ్చు. కాని వారి వాదాన్ని ఖాతరుచేసే వారెవరు ?

కళ, సాహిత్యాలను గురించిన కమ్యూనిస్టుల సిద్ధాంతాన్నీ, దానితోపాటు కమ్యూనిస్టు సిద్ధాంతాలు అమలు జరుపబడే దేశాలలోని రచయితల, కళాకారుల బ్రతుకు బాటను కూడా మార్క్సు సిద్ధాంతమే శాశ్వతంగా నిర్ధారణ చేసివేసింది. లెనిన్ ప్రతిపాదించిన 'పార్టీ సాహిత్య సిద్ధాతం' ఈ మ్యార్క్స సిద్ధాంతలోంచి ఉద్భవించిన ఉపశాఖ. "పార్టీ రచయితలు కాని ఇతర రచయిత లందరూ నశించాలి" అనీ. "మానవతీత ధోరణిగల రచయితలు నశించాలి" అనీ ఆయన ఉపదేశించిన నినాదాలు కూడా అలాంటివే.

సాధారణంగా లెనిన్ పార్టీసాహిత్యసిద్ధాంతాన్ని విమర్శించే వారుకూడా ఆ సిద్ధాంతంలోని ప్రధానమైన దురాగతాన్ని తరచు గ్రహించరు. సాహిత్యం ఏ పార్టీ చెప్పుచేతలలో ఉండాలని లెనిన్ కోరుతున్నాడో ఆ పార్టీ స్వభావాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తేగాని ఈ దురాగతం అవగతం కాదు.

ఆయన సిద్ధాంతాన్ని అనుసరించి కమ్యూనిస్టుపార్టీ కార్మికనియంతృత్వపాలన ఏర్పరుస్తుందనే విషయం ఇంచు మించు అందరికీ తెలుసు. కాని, ఆయన "నియంతృత్వ విధానపు శాస్త్రీయ స్వరూపం" మాత్రం చాలామంది అర్థం

చేసుకోరు. తేలిక మాటలలో చెప్పాలంటే, ఆయన నియంతృత్వానికి అర్థం - ఏ విధమైన శాసనాలచే గాని, నిబంధనలచే గాని నిరోధింపబడక, కేవల బల ప్రయోగమే రక్షగా గల అపరిమితమైన సర్వాధికారం. 'నియంతృత్వమే కావాలి, మరేమీ అక్కరలేదు' అన్న లెనిన్ మాటలు వేడుకగా చెప్పినవి కావు.

ప్రబలమైన నిరంకుశ పాలనా యంత్రాంగ మంతా తనకు ఎదురై నిలిచినప్పుడు ఏరచయితగాని దానిని ప్రతిఘటించి నియంతకు ఎదురు చెప్పగలగటం అసంభవం. కనుక 1930 లో ఖార్కోవ్‌లో జరిగిన అంతర్జాతీయ కార్మిక వర్గ రచయితల మహాసభ ఆ రచయితలకు మార్గదర్శకంగా ఈ దిగువ ఆదేశాలు చేయటంలో ఆశ్చర్యమేమీ లేదు. (ఈ రచయితలనే అనంతరం స్టాలిన్ "మానవాత్మ ప్రచోదకులు" అని అభి వర్ణించాడు.)

కార్మిక వర్గ కళాకారులను సంఘటిత పరచాలి.
కార్మిక వర్గ కళను సువ్యవస్థితం చేయాలి.
కార్మిక వర్గ కళాసృష్టి కమ్యూనిస్టుపార్టీ యొక్క వివేక వంతమైన, దృఢమైన అధిపత్యం క్రింద జరగాలి.
కార్మికవర్గ కళ వర్గ సంఘర్షణలో ఆయుధంగా ఉపయోగపడాలి.

మార్క్సు, ఎంజెల్సు సంయుక్తంగా రచించిన కమ్యూనిస్టు మానిఫెస్టోలో 1848 లో ఈ విషయాలనే ఇంత

---

('స్టేట్ అండ్ ప్రొలెటేరియన్' (1920) సంపుటం 7, పుట 254. ఇంటర్నేషనల్ పబ్లిషర్స్, న్యూయార్క్ 1943.)

వివరంగా కాకపోయినా, సూత్రప్రాయంగా ఇలా వ్రాసి పెట్టారు: "లోగడ పవిత్రమైనవిగా, అద్భుతావహాలుగా పరిగణింపబడుతూ వచ్చిన మానవ వ్యాపారాలపట్ల గౌరవ ప్రపత్తులన్నిటినీ, బూర్జువా వర్గం వారే తుడిచి పెట్టారు. వైద్యుణ్ణి, న్యాయాధిపుణ్ణి, మతగురువుని, కవిని, శాస్త్రవేత్తను వారు తమ తాబేదారులుగా మార్చుకున్నారు."

బూర్జువా రాజ్యాలలో ఎక్కడా ఇట్టి కట్టు దిట్టమైన ప్రయత్నం జరిగినట్టుగాని, ఫలించి నట్టుగాని చరిత్రలో ఎక్కడా కనిపించదు. కాని, ఈ మహామహులిద్దరూ తిరిగి సజీవులై, తమభావాలకు ప్రతి బింబంగా రూపొందిన దేశాన్ని ఒక్కసారి సందర్శిస్తే మాత్రం, పై అభివర్ణన పూర్తిగా ఆ దేశానికి వర్తిస్తూండటం కళ్లారా చూడగలుగుతారు. అట్టి అవమానకరమైన ఆదేశాలకు విధిలేక తలవంచవలసివచ్చిన తరువాత ఇక ఆ పవిత్రభావరగాని, భక్తి ప్రపత్తులుగాని మిగలటానికి ఆస్కారమేముంది ?

ఈ ఆదేశాల కన్న రచయితకు వేరే తలవంపులు ఇంకేంకావాలి? నియంతలకు అధికారం లభించిన కొద్దీ ఆ అధికారతృష్ణ పెచ్చు పెరుగుతూంటుంది. ఈ ఆదేశాలను రూపొందించిన కార్మికవర్గరచయితల సంఘాన్ని కూడా 1934 లో అణచివేసి, వారినాయకులైన అవెర్ బెక్ ని, బెజిమెన్ స్కీని ట్రాట్ స్కీ పక్షంవేపు మొగ్గు చూపుతున్నారంటూ హతమార్చారు. తరువాత క్రెమ్లిన్ నాయకులు మళ్లీ తమ

నూతన "మానవాత్మ ప్రచోదకులు"గా గోర్కీ, షొలొకోవ్, ఫెడయేవ్ అనే ముగ్గురిని తెరమీదికి ఎక్కించారు. రష్యాలో రచయితలందరికి ప్రాతినిధ్యం వహించవలసిన ఏకైక నూతన "రష్యా రచయితల సమ్మేళ" నానికి వారి నాయకత్వాం ఏర్పాటు చేశారు. అవమానకరమైన, ఆత్మ నాశకమైన ఆ మార్గానికి వారు నాయకులయ్యారు. వారు బహుశః తమ ఇష్టానుసారంగా, తమపైన ఇతర రచయితలపైనా విధించిన ఈ దిగువ శాసనాలను పరిశీలిస్తే సరిపోతుంది.

సూత్రం 1 సాహిత్యోద్యమం పార్టీవిధానాలలోని ఆధునిక సమస్యలతోను, సోవియట్ ప్రభుత్వంతోను అత్యంత సన్నిహిత సంబంధం కలిగిఉండటం—సాహిత్యాభివృద్ధికి,కళాత్మక వికాసానికీ, సిద్ధాంత శుద్ధికి, ప్రత్యక్ష పటిష్ఠతకు సునిశ్చితమైన ప్రధానావసరం. అనగా, రచయితలందరు సమాజ వాద స్థాపనోద్యమాల్లో ప్రత్యక్షంగా పాల్గొనటం.

సూత్రం 2 సోవియట్ రచయితల సమ్మేళనం ఈ దిగువ ప్రధాన కర్తవ్యాన్ని గుర్తిస్తున్నది. అంతర్జాతీయ కార్మికవర్గ వీరసమర భేరీ నినాదాలను ప్రతిధ్వనించే ఉత్తమ తరగతికి చెందిన కళాఖండాలనదగిన రచనలను, విజయసంపన్నమైన సోషలిస్టు భావబంధురములైన రచనలను, కమ్యూనిస్టుపార్టీ

యొక్క ఉత్తమ విజ్ఞానమును, శౌర్యసాహసాలను వివరించే రచనలను చేయటం.

ఆత్మాభిమానం చంపుకోనటంలో పూర్తిగా అట్టడుగుకు దిగిపోయి, పై శాసనాలను తయారుచేసిన రచయితలు, పాపం కనీసం అక్కడైనా తమకు కొంత విశ్రాంతి ఉంటుందని ఆశించారు. కాని, ఆ ఆశ అత్యంత దారుణమైన భ్రాంతి అయింది. 1936 నాటికి వారు ఇంకా కిందికి దిగిపోవలసి వచ్చింది. వివిధ కళా ఖండాల రచనా ప్రక్రియను కూడా రష్యా గూఢచారిదళం అజమాయిషీకి అప్పగించే ఒక తీర్మానాన్ని ఆ సంవత్సరం వాళ్ళు ఆమోదించ వలసి వచ్చింది. ఆ తీర్మానంలో రష్యా రచయితల సమ్మేళనం అధ్యక్ష కూటమివారు ఈ విధంగా శాసించారు:

"ఈ మనచర్చకు పర్యవసానంగా, ఈ క్షణం నించే మన మీా కార్యక్రమాన్ని అమలు జరపాలి. రచయిత లందరూ తాము ఇప్పటికి పూర్తిచేసిన రచనలన్నిటినీ రష్యా రచయితల సమ్మేళన పరిశీలనార్థము దాఖలు చేయవలసి ఉంటుంది. అంతేకాక, ఇక కొందరు చేయబోయే రచనల తాలూకు విషయ సంగ్రహాలను, సభ్యులంతా ఎప్పుడు ఏమి చేయదలచుకున్నదీ ముందుగా సమ్మేళనం పరీక్షించేందుకు వీలుగా ఎప్పటి కప్పుడు దాఖలు చెయ్యాలి.

ఇక్కడ సమ్మేళనం అనేమాట కేవలం రష్యా గూఢ చారిదళం ఎన్. కె. వి. డి. కి పర్యాయపదంగా వాడ బడింది. ఇంచుమించు రచయితల సమ్మేళనంలో నాయక వర్గం అంతా ఆ గూఢచారి వర్గానికి తాబేదారులై వారి చెప్పు చేతలలో నడచుకోవలసిన ప్రభుత్వోద్యోగులు. అత్యంత దుర్భరమైన విషయ మేమిటంటే, ఈ దాస్య దమన భావాలకు ఎక్కడా అంతంటూ లేకపోవటం. మాక్సిం గోర్కీ మరణించిన భయంకరపరిస్థితులను తలచుకుంటే, నియంతలు రచయితను ఎంత నీచాతి నీచస్థితికి తొక్కివేయ గలిగేది బోధపడుతుంది.

దైవవశాత్తు, ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామం రష్యానంతా చుట్టు ముట్టిన తరువాత ఈ దుర్భర పరిస్థితి కొంత మెరుగయింది. పాశ్చాత్య దేశాలతో పొత్తు కలుపు కోవలసి రావటంవల్ల, ప్రజోత్సాహాన్ని రేకెత్తించటానికి దేశభక్తిభావాలను రగుల్కొల్పవలసిన అగత్యం ఏర్పడటం వల్ల ఈ సోషలిస్టు వాస్తవికతావాదాన్ని కొంతకాలం వెనక్కు నెట్టి, తిరిగి వెనుకటి రష్యన్ భావావేశవాదం వాడుకలోకి వచ్చింది. ఈ సమయంలో రష్యా రచయితలు దేశ భక్త్యావేశంతో రచనలు చేయవచ్చు. రష్యా పవిత్ర తను గురించి ఆవేశంతో సంకీర్తన చేయవచ్చు. వాటిలో "సోషలిస్టుల ఆదర్శాలు, కార్మికవర్గ ప్రశంస" లేకపోయినా

ఘర్వాలేదు. అన్నా అఖమటోవా అనే కవయిత్రి, నవలా కారుడు మైకాయిల్ జోషెంకో ఈ సమయంలో ప్రఖ్యాతిలోకి వచ్చారు. ప్రభుత్వం కూడా వారికి అన్ని విధాలా బ్రహ్మరథం పట్టింది. అఖమటోవాను "ఆధునిక పుష్కిన్" అనికూడా ప్రశంసించారు. జోషెంకోను "ఆధునిక షెకోవ్" అన్నారు.

కాని, యుద్ధం శాశ్వతంగా ఉండేది కాదుగద! యుద్ధం ఆగిపోగానే ఈ ఆధునిక పుష్కిన్‌ల వైభవం, ఆధునిక షెకోవ్‌ల వైభోగం కూడా అంతమయి పోయినవి. వారిచుట్టూ పెద్ద తుపాను రేగింది. ఆధునిక పుష్కిన్ తన రచనలను "నిరాశా వాదంతో, సామ్రాజ్యవాద దేశాల లోని వినోద కవిత్వానికి మాత్రమే లాయకీఅయిన నిర్జీవ భావాలతో" నింపిందని తీవ్రంగా ఖండించారు. ఆధునిక షెకోవ్ "యువకుల విజ్ఞాన వికాసాన్ని మందగింపజేసి, వారి మనస్సులను విషపూరితములుగా జేసే రచనలను, నీరస మైన, నిరర్థక మయిన చెత్తను" సృష్టిచేస్తున్నాడని నిందించారు.

నాడు సోవియట్ సంస్కృతికి నియంత అయిన ఆంద్రీ ఝదనోవ్ అఖిలరష్యారచయితల సమ్మేళన మహా సభలో ప్రసంగిస్తూ జోషెంకోను ఇలా హెచ్చరించాడు. "జోషెంకోకు సోవియట్ విధానాలు నచ్చకపోతే, మా-

ఆ దేశం ఏమిటి? ఎలాగో మనం జోషెంకోతో సరిపెట్టు కొనడమా? మన అభిరుచులను మనం మార్చుకొనడం అసంభవం. అతనకే మార్పు కావాలి. కాని, మార్పు అతనికి ఇష్టంలేదు. కనుక సోవియట్ సాహిత్యరంగంనుంచి అతడు తప్పుకోవాలి. సోవియట్ సాహిత్యంలో సిద్ధాంత శుద్ధిలేని, సారంలేని, జుగుప్సాకరమైన, కుళ్ళుబోతు రచనలకు స్థానంలేదు."

అఖమటోవాకు కూడా ఇలాంటి హెచ్చరిక వచ్చింది. "మన సాహిత్యం సామాన్య సారస్వత విపణులలోని రకరకాల అభిరుచులకు అనుగుణంగా ఉత్పత్తిచేయబడే వ్యక్తిగత పరిశ్రమ కాదు. సోవియట్ ప్రజల గుణగణాలకు, నీతి నియమాలకు సరిపడని అభిరుచులకు, రసావేశాలకు మన సాహిత్యంలో అవకాశ మీయటానికి వీలులేదు." అనిఆమెను హెచ్చరించారు.

సర్వాధికారప్రభుత్వాలుగల దేశాలల్లో ఇట్టిమందలింపులను ఖాతరుచేయని రచయితలకు పుట్టగతు లుండవు. జోషెంకో, అఖమటోవాది తలలెత్తుకుని తిరుగదలచుకొని ఉంటే, వాళ్ళకు సోవియట్ సారస్వతరంగంలోం చేకాదు, అసలీ పాంచభౌతికప్రపంచం నించికూడా స్వస్తిచెప్పి ఉండేవారు. అందువల్ల వారు తమ అపరాధాలను ఒప్పుకొనటం సహజం.

అయితే నిజంగా వారు ఏమైనా అపరాధాలు చేశారా? లేదు. వారిద్దరు మార్క్సిస్టులు. తమపైన ప్రభుత్వం చెలాయించ దలచుకున్న అధికారపు హద్దులను వారు సరిగా అంచనా వేసుకో లేకపోయారు. ఏరచయిత భావాలూ అధికారులు ఏర్పరచిన సరిహద్దులను అతిక్రమించి పోవటానికి వీల్లేదు. పోతే ప్రభుత్వంసహించదు. నైష్ఠిక కమ్యూనిస్టులు కానివారిలో గుండెలు తీసిన బంటు వడైనా ఉండి, తనకు తోచిన ధోరణిలో వ్రాసినా, అది అచ్చుముఖం చూసే అవకాశంలేదు.

ప్రచురణశాల లన్నీ, పత్రికలన్నీ ప్రభుత్వపు సొత్తులు. నిజానికి, అఖమటోవా గాని, జోషెంకో గాని తమపై ప్రభుత్వం, విధించిన హద్దులను ఎన్నడు అతిక్రమించలేదు. వారికి అతీతమైన శక్తులు వారిపతనానికి హేతువులయినవి. అందులో ముఖ్యమయినది ప్రభుత్వనీతిలో కలిగినమార్పు. రాజకీయరంగంలో కలిగిన మార్పులవల్ల వారికా గతి పట్టింది. లోగడ క్రెమ్లిన్‌కి మిత్రదేశాలయినా, ఇప్పుడు మళ్ళీ రష్యాను చుట్టుముట్టుతున్న అమెరికావంటి ధనికవాద దేశాలపైన, పెట్టుబడిదారీపద్ధతి గల ఇతరదేశాల పైన రష్యాలో ప్రజోద్రేకాన్ని రెచ్చగొట్టవలసి వచ్చింది. రాజకీయ విధానంలో ఈ ప్రధాన పరిణామానికి ఎవరో కొందరు అపరాధులను చూపవలసి వచ్చింది. ఎప్పటి

కెప్పుడు ఎవరినో కొందరిని అపరాధులుగా నిర్ణయించి దండించటం నియంతకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలంత అవసరం. ఎవరినో కొందరిని అపరాధులుగా నిర్ణయించనిదే ప్రభుత్వ రాజనీతిని ఒక్కసారిగా మళ్ళించటానికీ, నియంత మాత్రం ఎప్పుడూ నిర్దోషిగా కనిపించటానికీ వీలుండదు.

ఝుడ్‌నోవ్ ఉపన్యాసానికి పూర్వం రష్యా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘంవారు ఒక తీర్మానంచేశారు. "సోవియట్ సాహిత్యం తనగోడవేదో తాను చూసుకుంటూ స్తబ్ధులాగ ఉండటానికి వీలులేదనీ, బోల్షివిస్ట్ విప్లవవాద ధోరణిని అవలంబించి, యువజనులను ప్రబోధించటంలో ప్రభుత్వానికి సహాయపడాలనీ తీర్మానించారు." ఈ తీర్మానానికి వివరణే ఝుడ్‌నోవ్ ఉపన్యాసం. రష్యా రచయితల సంఘం యొక్క అఖిల రష్యా అధ్యక్షవర్గం ఈ తీర్మానం "అత్యంత వివేకవంతం గాను, అన్నివిధాల ఉచితం గాను ఉన్న" దని ఆమోదించిన దని చెప్పటం కూడ అవసరమేమో. రచయితల సంఘ సభ్యులందరు అప్పటినించి, "కామ్రేడ్ స్టాలిన్ ఆదేశాలను ఆయుధాలుగా జేసుకొని, తమ తమ రచనలలో ఆధునిక సామ్రాజ్యవాద విధాన స్వరూపాన్ని అభివర్ణించి చెప్పాలనీ" బూర్జువాసంస్కృతి, పట్ల నిరసన భావంవహించి ఊరుకోనడం "మానా"లనీకూడా ఆ తీర్మానంలో సభ్యులందరినీ హెచ్చరించారు.

ఆధునిక పుష్కిన్‌ని, ఆధునిక షెకోవ్‌ని రష్యా రచయితల సమ్మేళనంలోంచి బహిష్కరించారు. వారి రచనలేవీ ప్రకటించటానికి వీలులేదని నిషేధించారు.

సోషలిస్టుల వాస్తవికతావాదం ప్రభుత్వవిధాన మయినప్పుడు ఎంత ప్రమాదకరమైన నిరంకుశత్వానికి దారితీసేదీ, అవిధేయులపట్లనేకాదు, విధేయులపట్లకూడా ఎంతక్రూరంగా ప్రవర్తించేదీ ఈసంఘటనే వ్యక్తంచేస్తూంది. రచయిత ఆకలిదప్పులకు, ఉరికంబానికి గురికాకుండా ఆత్మరక్షణ చేసుకోవాలంటే ప్రభుత్వానికి ఎప్పటికప్పుడు పక్కతాళం వేస్తూ ఉండాలి. సోవియట్ సాహిత్యరంగంలో నిత్య ప్రత్యక్షంగా ఈలక్షణం వర్తమానపరిస్థితిని గురించిన సత్యాన్ని తారుమారుచేయటానికి ఒకసాధనం అని లూయీఫిషర్ వ్యాఖ్య. కాని, ఆ సత్యాన్ని తారుమారు చేయటం ఎప్పటికప్పుడు నియంతమనస్సులో ఆనాడు ఉన్నభావాలకు అనుగుణంగా జరుగుతూ ఉండాలనేమాట అయనకూడా వదలివేశాడు. ఈ లక్షణం ఇలాగే ఉంటున్నంతకాలం, రష్యాపాలకుల విధానాలు, వారి ప్రత్యర్థుల విధానాలు ఎన్నిసార్లు మారినా ఇట్టి దురంతాలు జరుగుతూనే ఉంటాయి. ఒక అంచనా ప్రకారం 1936–1938 సంవత్సరాల మధ్యనే రష్యాలో మొత్తం 329 మంది రచయితలను కాల్చి చంపటంగాని, వెట్టిచాకిరీ ఖైదులలో వారు మరణించటంగాని జరిగింది.

వీరిలో రచయితలసమ్మేళనం ప్రథమ మహాసభలో డైరెక్టర్లబోర్డు సభ్యులుగా ఎన్నికైన మైకాయిల్ కోల్ట్సోవ్, ఇవాన్ కాటయేవ్, వ్లాడిమిర్ కిషోవ్, బోరిస్ పిల్న్యాయిక్, బ్రూనోజాసీయన్స్కీ, ఆంద్రీ అలెగ్జాండ్రోవిచ్, పాలోయాష్విల్లీ అనే ఏడుగురు ప్రముఖులుకూడా ఉన్నారు.

ఒక్కరోజునే 1944 డిశెంబరు 14 వ తేదీన - ఉబ్రిచ్ అధ్యక్షతను ఏర్పాటయిన ఒక న్యాయాధిపతివర్గం యుక్రేన్ లోని ఇరవైఎనమండుగురు రచయితలను, సాంస్కృతిక నాయకులను కాల్చివేయవలసిందిగా తీర్పు చెప్పింది.

విష్కో ఒలాస్కా వీరిలో ఒకడు. ఇతడు 1908 లో జన్మించిన యుక్రేనియన్ యువకవి. "విప్లవాశావాదపూరితమైన విష్కో కవిత్వంలో ప్రధానలక్షణం ఆయన శాంతహృదయవాదం," అని 1929 లో ప్రకటితమైన రష్యాసారస్వతవిజ్ఞాన సర్వస్వం రెండవ సంపుటంలో వ్రాశారు. ఆయనరచించిన "మనిషిమనిషికీ నా వినతి," వంటి గ్రంథాలు యుక్రేన్‌లో విశేషప్రజాదరణ పొందినాయి.

ఈ విధంగా కాల్చివేయబడిన వారిలో మరొకడు కోస్ట్రిగిగర్. సాహిత్య విజ్ఞాన సర్వస్వం అయిదవ సంపుటంలో ఈయనను గురించి ఇలా వ్రాశారు. "యుక్రేన్‌లో అక్టోబరు సంరంభానంతరం అగ్రగణ్య రచయితలలో కోస్ట్రిగిగర్ ఒకడు. కీవ్ రాష్ట్రంలో ఒక పేదరైతు ఇంట జన్మించిన

ఈయన యుక్రేన్ రచయితలలో రసవత్ర్పకృతి చిత్రణలో సిద్ధహస్తులైన వారిలో ఒకడు."

సోషలిష్టు వాస్తవికతాసిద్ధాంతం సాహిత్యానికి కూడా మార్గదర్శక సూత్రంగా అంగీకరింప బడటానికి పూర్వమే చాలా మందిని బలిగొన్నది. రచయితల ఆయురారోగ్య భద్రతకు అత్యావశ్యకమైన, సుప్రసిద్ధమైన ఈదిగువ చతురుపాయ ప్రవర్తనను అలవరచుకొనటానికి పూర్వం రష్యారచయితలు పడరాని పాట్లన్నీ పడ్డారు.

భావించకు, భావించినా మాట్లాడకు!
మాట్లాడినా, వ్రాయకు!
వ్రాసినా, ప్రకటించకు!
ప్రకటిస్తే వెంటనే ఉపసంహరించుకో!

అయితే కొందరిలా వాదించవచ్చు. 'అవును, స్టాలిన్ హయాంలో అలా ఉన్న మాటనిజమే. కాని, ఇప్పుడా వర్గీకరణయుగం అంతమై పోయిందిగదా. "స్వగతభావణల కాలం అంతరించింది; ఇది సంభాషణల కాలం." అని ప్రావ్డా పత్రిక అభయ హస్తం ఇచ్చింది. ఇంక ఆందోళన ఎందుకు? నిన్నటి మంచుకరుడును గురించి విచారణ ఎందుకు? నేటి చల్లని పానీయం హాయిగా త్రాగక!'

వాదం యుక్తి యుక్తంగానే ఉంది. అయినా, దాన్ని మరికొంత శ్రద్ధగా పరిశీలిద్దాం.

# 4. పానీయం, మంచుకరుడు

"రష్యా సాహిత్యం సోషలిస్టు వాస్తవికతా వాదాన్ని మినహా, ఇంకే వాదాన్ని ఆమోదించదు."

—రష్యా రచయితల ద్వితీయ మహా సభలో సుర్కోవ్ ప్రసంగం.

రష్యాభాషలో సంభాషణ అంటే సజీవభాషణ మని గాని, జీవితాన్ని గురించి, సాహిత్యాన్ని గురించి స్వేచ్ఛగా జరిగే పటిష్టమైన చర్య అనిగానీ అర్థం చేసుకోకూడదు. అసలు నియంతృత్వ పాలనలో అది సమష్టి నియంతృత్వంగా మారి నప్పటికీ, అలాంటిది ఎన్నటికీ సాధ్యంగాదు. తాము ఇత రులకంటె అధికులమనీ, ఇతరులందరికీ తాము శత్రువుల మనీ భావించటం నియంతల సహజప్రకృతి. అందువల్ల ఆ మాటకు మనం చెప్పుకునే అర్థానికీ, క్రెమ్లిన్ ఉద్దేశించిన అర్థానికీ చాలా తేడా ఉంది. ఈ విధంగా భావించటానికి రష్యాయే మనకు అత్యుదారంగా అనేక నిదర్శనాలను చూపుతోంది.

ప్రవ్దా పత్రిక 'ఇంక సంభాషణలకాలం వచ్చింది అని 1953 మేనెలలో వ్రాసిన తరువాత, ఆమాటను యథాతథంగా అర్థంచేసుకొని నిజంగా యథేచ్ఛా సంభాషణలు ప్రారం భించిన వారందరికీ మళ్ళీ ఆపత్రికే 1954 సెప్టెంబరు 8 వ తేదీ సంచికలో ఇలా హెచ్చరిక చేసింది. "సోషలిస్టు వాస్త

వికతాసాహిత్య సిద్ధాంతాలు, కళానియమాలు, అనుల్లంఘ నీయాలు. వాటిని అతిజాగరూకతతో పరిరక్షిస్తూ అనుస రించాలి. సోషలిస్టు సిద్ధాంతాల అనుసరణలో ఏమాత్రం లోపం వచ్చినా, బూర్జువాసిద్ధాంత ప్రభావం పెచ్చుపెరుగు తున్నదని గుర్తుంచుకోవాలి."

"సోవియట్ రచయితల సమ్మేళనం అతి శ్రద్ధగా తయారుచేసిన నియమావళే సోషలిస్టు వాస్తవికతా సూత్రాలు" అనికూడా ప్రవ్దాపత్రిక స్పష్టంగా వివరించింది.

సోవియట్ రచయితల సమ్మేళనం ఈ నియమావళిని తయారుచేసిందెప్పుడు? స్టాలిన్ హయాం అత్యంతనిరంకుశంగా సాగుతున్న రోజులలో. వాటి స్వరూపంకూడా మనకు ఇప్పుడు పూర్తిగా తెలుసు.

సోషలిస్టు వాస్తవికతా సూత్రాలన్నీ అతిశ్రద్ధగా ఈ నియమావళిలో పొందు పరచ బడినాయని ప్రవ్దా హామీ ఇస్తూంది గనుక, ఈ నియమావళి కూడా ఆసూత్రాల లాగే అనుల్లంఘనీయాలని మనం గ్రహించాలి. అయినప్పుడు, ఈ పానీయపు రోజులకు, స్టాలిన్ హయాంలోని ఆ మంచుకరుళ్ల రోజులకు తేడా ఏమిటనే ప్రశ్న ఉదయిస్తుంది. స్టాలిన్ వాటి నిబంధనలను ఎడతెగకుండా అమలుజరపడం అవసరమని కూడా ప్రవ్దా తిరిగి హెచ్చరించినమాట జ్ఞాపకం ఉంచు కుంటే, ఈ ప్రశ్నకు సమాధానం సులభమవుతుంది.

సుప్రసిద్ధమైన రష్యాసాహిత్య పత్రిక 'నోవీమీర్' సంపాదకవర్గం "దారుణమైన రాజకీయాపరాధాలు" చేయడం వల్ల రష్యారచయిత లందరికీ ప్రవ్దా ఈసూత్రాలను గురించి హెచ్చరించవలసి వచ్చింది. అయితే, ఈహెచ్చరికకు కారణ మయేందుకు, ఆపత్రిక చేసిన అపరాధాలేమిటో చూద్దాం. ప్రవ్దా దృష్టిలో తప్పుల తడకలుగాను, ప్రమాదకరమైన ధోరణులలోను, "సాహిత్యరంగంలో పార్టీ సూచనలకు విరుద్ధంగాను" రచింపబడిన కొన్ని రచనలను ఆపత్రిక ప్రకటించింది.

ఈ విషయాన్ని గురించే వ్యాఖ్యానిస్తూ కమ్యూనిస్టుల దివ్యవాణి అయిన ఆపత్రిక, లోగడ తాను సూచించిన "సంభాషణలకాలం' అన్నమాటకు అర్థాన్ని మళ్లీ వివరించింది. "జీవన సత్యానుసరణమార్గంనించి, సోషలిస్టువాస్తవికతా విధానంనించి, పార్టీ ధర్మాన్నిగురించిన లెనిన్ సిద్ధాంతం నించి, ఏమాత్రం వైదొలగినా పెద్దపెద్ద పొరపాట్లు జరగటానికి, కళాకారులు అపమార్గం పట్టి అంధకూపాలలోకి మళ్ళటానికి కారణం కాగలదని అనేక సంఘటనలవల్ల రుజువయింది." ప్రవ్దా మరికొన్ని విషయాలు కూడా వ్రాసింది.

"పరదేశసిద్ధాంతాలు తలయెత్తకుండా చూడటం, సోవియట్ సాహిత్య ప్రధాన సూత్రాలను సంస్కరించాలనే ప్రయత్నాలను భగ్నపరచటం, సాహిత్య విమర్శ ప్రధాన

ధర్మం. అయితే, నవీనమైన ఉజ్జ్వల యత్నాలన్నిటినీ ప్రోత్సహిస్తూ, రచయితలు సోషలిస్టు వాస్తవికతా వాదమనే సమష్టి పథాన్ని విడవకుండా స్వతంత్రమైన నూతన కళా సృష్టి చేయటానికీ, వారు వ్యక్తిగతంగా స్వతంత్ర మార్గాలనుఅన్వేషించు కొనటానికి దోహదం చెయ్యాలి."

ఇది సంపూర్ణమైన సోషలిస్టు ఆరోగ్యానికి విధించిన 'వాస్తవికతా' కాయకల్ప చికిత్స అన్నమాట. రచయిత ప్రధానమైన సోషలిస్టు వాస్తవికతా పథంలోనే వ్యక్తిగతమైన నూతన మార్గాలు అన్వేషించుకోవాలి. కాని, ఆ నూతన మార్గాలలో పయనించేటప్పుడు సోవియట్ సాహిత్యప్రధాన నియమావళిని సవరించాలనే ప్రయత్నాల వంకకు అణు మాత్రమైనా మొగ్గు చూపకూడదు. అలాంటి ప్రయత్నాలు అంధకూపాలలోకే దారి తీస్తాయి. రష్యాలో అట్టి అంధకూపాలనించి రచయిత తిరిగి బయటపడటమంటూ ఉండదని వేరేచెప్పటం అనవసరం. నోవీమీర్ పత్రిక ప్రధాన సంపాదకుడు ఎ. టి. ట్వార్డోవిస్కీ ఈ ప్రమాదకరమైన మార్గాన ప్రయాణం చేస్తూ ఆత్మ రక్షణ చేసుకోలేక "అంధకూపంలో" పడి బహుశః దానికే ఆహుతి అయిపోయాడు.

ఈ దారుణ దమనకాండ ప్రవ్దా ప్రచండ విమర్శతో ఆగలేదు. సోవియట్ రచయితల సమ్మేళనం తాలూకు

సర్వశక్తిమంతమయిన అధ్యక్షవర్గం వారి రౌద్ర దృష్టి నోవీమిర్ పత్రికాధిపతి పైన, ప్రధాన సంపాదకుని మీద కూడాపడింది. ప్రధాన సంపాదకుడు తన నేరాలను ఒప్పుకొన్నా ఆయనకు బహిష్కార ప్రాయశ్చిత్తాలు తప్పలేదు. ఉద్యోగం లోంచి బర్తరఫుచేశారు. ఆయన భవిష్యత్తు భగ్నమై పోయింది. మంచుకరడు కరిగి పానీయంగా మారినదనే అద్భుత సమయంలోనే ఇంతపని జరిగింది గనుక, దీనిని గురించిన ఇతర వివరాలుకూడా శ్రద్ధగా పరిశీలించి చూద్దాం.

సోవియట్ రచయితల సమ్మేళనం అధ్యక్షవర్గం వారు 1954 ఆగస్టు 11 వ తేదీన నోవీమిర్ పత్రికా వ్యవహారాన్ని గురించి విచారణ చేశారు. అనగా, సోవియట్ రచయితల ద్వితీయ మహాసభ జరగడానికి కొన్ని నెలలు ముందు.

లిటరేటర్నయాగజెట్ ఆగస్టు 17 వ తేదీ సంచికలో సోవియట్ రచయితల సమ్మేళనం కార్యదర్శి ఎ. సుర్కోవ్, నోవీమిర్ పత్రికా వ్యవహారాలను విమర్శిస్తూ ఆ పత్రికపైన ఈ దిగువ నేరాలు మోపాడు :

"సాహిత్యప్రపంచంలో అత్యంత బాధ్యతతో ప్రవర్తించవలసిన ఈసమయంలో నోవీమిర్ పత్రిక ఆదర్శవాద, సర్వవినాశకవాద దృక్పథంగల రచనలను, సాహిత్యాన్ని, ప్రోత్సహించటానికి పూనుకుంది. గత సంవత్సరాంతంలో ప్రకటించిన వి. పామెరెంటోన్సెల్ రచించిన "సాహిత్యంలో

శ్రద్ధాప్రాముఖ్యం" అన్న వ్యాసంలో ఈధోరణి కనిపిస్తుంది. యుద్ధానంతర వచన రచనలో గ్రామసీమ "సమష్టివ్యవసాయ క్షేత్రవాసుల జీవనం" అనేవిషయంమీద ఎఫ్. అబ్రమోవ్ రచించిన వ్యాసంలోను, ఎమ్. విఫ్ పిట్స్ రచించిన "మారి యెట్టాషాగిన్యాన్ డైరీ" అనే వ్యాసంలోను, ఓచారీన్. ఎక్. వియునోవ్‌ల గ్రంథాలపై ఎమ్. షెగ్లోవ్ చేసిన సమీక్షలలోను కూడ ఈధోరణి ఉంది. ఈవ్యాసాలలో వ్యక్తమవుతూన్న అభిప్రాయాలు గాని, భావనావిధానంగాని, సాహిత్య పరామర్శావిధానాలు గాని 'రష్యాసాహిత్యంయొక్క ప్రధాన సృజనావిధానం సోషలిస్టు వాస్తవికతాపద్ధతి' అంటూ సోవియట్ రచయితల సమ్మేళనం నియమావళిలో వ్రాసి పెట్టిన సూత్రాలకు అనుగుణంగా లేవు."

"నోవీమీర్ పత్రికలో ప్రకటితమైన ఈవ్యాసాలలో (ముఖ్యంగా, పొమెరెంట్సేవ్ వ్యాసంలో) మరీస్ఫుటంగా ఆ రచయితలు ప్రస్తుతపరిస్థితులలో పూర్వపు 'ప్రతిభోన్మేష వాదాన్ని' పునరుద్ధరింప దలచుకొన్నట్టు కనిపిస్తుంది. ఈ వాదన లోగడ ఈశతాబ్దం ద్వితీయదశాబ్ది చివరిభాగం లోను, తృతీయదశాబ్ది మొదటిభాగంలోను కొన్ని ముఠాల రచయితలు ప్రచారంచేశారు. సోషలిజం స్థాపనకు, పార్టీ అనుసరించే కార్యక్రమాలకు విరోధులైనవారి ప్రోత్సాహంతో ఆముఠాలవారు అప్పుడీవాదాన్ని ప్రచారంచేశారు.

సాహిత్యకళాఖండాలలో వ్యక్తమయే శ్రద్ధనుబట్టి, అనగా వెనువెంటనే కలిగే అనుభూతిని అనుసరించి విలువకట్టాలి– అని పామెరెంట్సోవ్ ప్రతిపాదించాడు. ఇంచుమించు ఈ అభిప్రాయాన్నే, ఈమాటలలోనే లోగడ 'పెరెవల్' ముఠా వారు తమ సాహిత్యఆశయాలలో వ్యక్తంచేశారు."

"కళలవిషయంలో అసలు అన్నింటికన్న ప్రధానమైన రచయిత సాంఘిక దృక్పథాన్ని తన చుట్టూ చూస్తూ తాను అభివర్ణించే జీవనవిధానంపట్ల అతని వైఖరిని సరిగా అర్థం చేసుకొనటానికి వీరి ధోరణి ప్రతిబంధకం అవుతుంది."

పెద్దగా ప్రచారంచేసిన, 'సానీయ' సిద్ధాంతాన్ని గురించి రష్యాలో అధికార యుక్తమైన వ్యాఖ్యానం ఇదే.

రచయితల ప్రవర్తనకు స్టాలిన్ హయాంలో తయారుచేసిన నియమావళిని ఇప్పటికీ కమ్యూనిస్టులు అతి పవిత్రంగా ఆరాధిసున్నారని తేలిపోయింది. ఈ 'సానీయం' రచయితలకు కొత్తగా ఒరగ పెట్టిందేమీ లేదు. రష్యనుల పరిభాషలో ఆదర్శవాదము, వినాశవాదము యించుమించు పర్యాయ పదాలు. రచనలో ప్రతిభోన్మేషం, శ్రద్ధా, ప్రసన్నానుభూతివాదం యిప్పటికీ అపరాధాలుగానే పరిగణింపబడుతున్నాయి. 'సాంఘికదృక్పథం' ఎటువంటిదైనా వీటిని మాత్రం సహించరు. పోనీ, ఈ సాంఘిక దృక్పథాన్ని

రచయిత నిర్ణయించుకో వచ్చునా? అంటే, అదీ పీలు లేదు. వినాశ వాదుల శ్రద్ధా, ప్రసన్న రసాను భూతి, రచయితను పెడదారులు పట్టించ వచ్చు. కనుక, సోవియట్ రచయితల సమ్మేళనంవారి నియమావళే రచయితలకు శాశ్వత నిత్య విధి.

నోవీమిార్ దారుణ రాజకీయాపరాధాలకు, సాహిత్య విమర్శనలలో అవలంబించిన దుష్ట దృక్పథానికి ప్రధాన సంపాదకుడుగా బాధ్యత యావత్తు తనదే అని ట్వార్డో విస్కీ నెత్తిన వేసుకున్నాడు. అయితే, సైద్ధాంతిక లోపాలు గల వ్యాసాలను ఆపత్రికలో ప్రచురించటం ఆ పత్రికా సంపాదక వర్గం దురుద్దేశంతో చేసిన పనిగాని, సాహిత్యాన్ని కలుషితం చేయాలనే సంకల్పంతో చేసినదిగాని కాదనీ, "దూరదృష్టి లేకపోవటం, రాజకీయానుభవ లోపము" మాత్రమే కారణాలనీ కూడా విన్నవించాడు. "నా తప్పులన్ని నేను ఒప్పుకుంటున్నాను. ఈ పని దురదృష్టవశాత్తు చాలా ఆలస్యంగా చేస్తున్నా, నిస్సందేహంగాను, హృదయపూర్వకంగాను, చేస్తున్నాను." అని ఆయన ఘోష పెట్టాడు.

సోవియట్ రచయితల బోర్డు అధ్యక్ష వర్గానికి ఇది సంతృప్తి కలిగించలేదు. దండన విధానం పటిష్ఠంగా సాగించాలి. పాపాలను నెత్తిన వేయటానికి ఒకరు చాలలేదు.

సోవియట్ రచయితల బోర్డు అధ్యక్ష వర్గం ఈ విషయాన్ని గురించి చర్చించిన తరువాత, ప్రధాన సంపాదకుణ్ణి

బ్త్రతఫ్ చేశారు. సోవియట్ రచయితల సమ్మేళనం కార్యాలయము, దేశములోని పత్రికలన్నిటికీ పంపదగిన అభ్యుదయాదేశాల పట్టిక నొకదానిని రెండువారాలలో తయారు చేసి, ముందుగా అధ్యక్షవర్గ సమావేశంలో చర్చించే నిమిత్తం సభ్యులందరికీ అందజేయాలని కూడా అధ్యక్షవర్గం ఆదేశించింది.

సోవియట్ రచయితల సమ్మేళన కార్యాలయము పత్రికలన్నిటికీ పంపే ఆదేశాలను అధ్యక్షవర్గము, సంస్కరించటమంటే, పత్రికలమీద నిఘాను, కట్టుబాట్లను తీవ్రతరంచేయట మన్నమాట. 'స్వాగతభాషణే' సోవియట్ సారస్వతానికి శాశ్వతవిధి అనే మాట దీంతో లోగడ కన్న స్ఫుటంగా రుజువయింది.

నోవీమీర్ పత్రికమీద తీసుకొన్న ఈ చర్య ఏదో క్వాచిత్కంగా జరిగిన సంఘటన కాదు. ఈ విషయాన్ని రుజువుచేయటానికే నేమో అన్నట్టు 'మంచుకరడు పానీయం' అన్న మకుటంతో ఎహ్రెన్ బర్గ్ రచించిన సాంకేతిక కథను కూడ ఖండిస్తూ లిటరేటర్నయా గజెట్‌లో ఒక విమర్శ వెలువడింది. ఈ ఖండనవ్యాసం నోవీమీర్ పత్రిక నూతన సంపాదకుడు కె. ఎమ్. సిమినోవ్ వ్రాయటం మరొక చిత్రమైన విషయం.

ఈ కథను విమర్శించిన తరువాత సిబనోవ్ ఆజర్ బైజాన్ రచయితల సభలో ప్రధానమైన సిద్ధాంతవివరణోప

న్యాసంచేశాడు. రచయితలు ఏ యే విషయాలను గురించి చర్చింప దగినదీ, ఏ యే విషయాలను గూర్చి చర్చింప దగనిదీ కూడా ఆ ఉపన్యాసంలో సిద్ధాంతం చేశాడు. ఆయన అభిప్రాయం ప్రకారం ఎన్నడూచర్చింప దగని విషయాలలో ఒకటి: కమ్యూనిస్టు సమాజనిర్మాణానికి సోవియట్ రచయిత సహాయ పడవలసిన విధిని గురించినది. ఆయన యిలా హెచ్చరించాడు. "ఈ విధిని నిర్వహించటంలో మనకు ఉపకరించగల విషయాలన్నీ మనకు హితమైనవి; దానికి అంతరాయం కలిగించేవన్నీ చెడ్డవి... సాహిత్యానికి విలువ కట్టేటప్పుడు మనం ముఖ్యంగా—అది మన ఆశయసాఫల్యానికి ఎంతవరకు ఉపకరింప గలదనేదే ప్రధాన సూత్రంగా పరిగణించాలి. సైద్ధాంతికంగా మనకు విరుద్ధమై, మనశత్రువులకు ఉపకరింపగల రచనలు నిరర్థకమైన కళాదృష్టిలో ఎంత అద్భుతమైనవిగాక కనిపించినా తీవ్రవిమర్శకు గురికాక తప్పదు."

ప్రజాస్వామ్య దేశాలలో కమ్యూనిష్టులు రష్యా సాహిత్యంలో 'నూతన దృక్పథాన్ని' గురించి గొప్పగా చెప్పుకుంటూన్న రోజులలోనే సిమినోవ్ ఈ ఉపన్యాసం చేశాడు. వాళ్ళుమాత్రం ఇంకా ఎహ్రెన్‌బర్గ్ ప్రతిపాదించిన 'మంచుకరడు పానీయం' మంత్రాన్నే పునశ్చరణచేస్తూ, ట్వార్డొవిస్కీ బర్తరఫు, ఆయన స్థానంలో సిమినోవ్ నియామకం మొదలైన సంఘటనలేవీ తమకుపట్టనట్టు ఊరుకున్నారు.

ఎహ్రెన్‌బర్గ్ వంటి అసిధారావ్రత నిపుణుడే తడబడి తప్పటడుగు వేయటం ఎలా సంభవించిందా అనేది మరొక ప్రశ్న. సోషలిస్టువాస్తవికతావాదం లోతుపాతులను గురించి ఆయన పొందిన శిక్షణ నిరూపమానమైనది. కనుక, నిజానికి ఏమరపాటున కూడా ఆయనకు ఆవిషయంలో ఎన్నడూ తప్పటడుగు పడటంకాని, సాహిత్యంలో పార్టీ తత్వానికి లేశమయినా ఆయన వైదొలగటం గాని జరుగ కూడదు. రష్యా సాహిత్యంలో ఈ 'పానీయం' దృక్పథం అచిరకాలంలోనే తిరిగి అంతరించనున్న ఎండమావి అనీ, మంచుకరుడు తత్వమే శాశ్వత సత్యమనీ ఆయనకు తెలిసి ఉండవలసింది. అలాంటప్పుడు ఆయనే విమర్శకు గురిఅవటం, తత్పర్యవసానమైన బహిష్కార ప్రమాదానికి, అంతకన్న కూడా దారుణమైన ప్రాయశ్చిత్తాలకు గురి అయ్యే పరిస్థితిలో పడటం ఎలాజరిగిందీ – అనేది మరో ప్రశ్న.

ఈ ప్రశ్నలు చాలా సమంజసమైనవే కావచ్చు. అయితే, ఇదంతా ముందుగా ఏర్పాటుచేసుకున్న ప్రకారం ఆడిన భాగోతం కావచ్చు.

రష్యా సాహిత్యరంగం ఎప్పుడూ ద్విముఖంగాఉండటం మామూలు. ఒక ప్రక్కన విదేశాలలోని బుద్ధిమంతులను ఆకర్షించటానికి ప్రయత్నం జరుగుతూ ఉండాలి. ఇటీవలి పరిణామాల పర్యవసానంగా విదేశాలలో పార్టీ విధేయులు

అయోమయస్థితిలో పడటంవలన ఇదిమరింత అవసరం అయింది. కనీసం అనుమానగ్రస్తులను నిరుత్తరులను చేయటానికి, విధేయుల విశ్వాసాన్ని పటిష్ఠంచేయటానికీ అయినా ఈ నాటకం ఉపయోగపడుతుంది. కనుక, క్రెమ్లిన్ దృష్టిలో ఈ నాటకం లాభసాటిగానే కనిపిస్తుంది. ముఖ్యంగా, రష్యా వేపు మొగ్గుచూపే తటస్థవాదులు ఎక్కువ అవటం వలన సాహిత్యరంగంలోను, రాజకీయ రంగంలోనూ కూడా ఈ తటస్థవాదులను, రష్యాలో నిరంకుశత్వం తగ్గుతున్నదనీ, "సంభాషణలకాల''మనీ, చర్చాసౌకర్యమనీ, మంచుకరడు కరిగి మధుర పానీయమయిందనీ, తియ్యని మాటలతో సులభంగా ఆకర్షించవచ్చు. అయితే, దీనివల్ల రష్యాలో కొన్ని ప్రమాదలు లేకపోలేదు. అధికారులు ఏమిచెప్పినా విశ్వసించే వారు ఈ భాగోతాన్ని కూడా నిజమనుకోవచ్చు. ఈ చర్చా సౌకర్యం నిర్ణీతపరిధుల్ని అధిగమించవచ్చు. ఆవిధంగా, అది పార్టీ అజమాయిషీకే సవాలుగా పరిణమించ వచ్చు. మరొక ప్రక్కన కొందరు రచయితలను దండించి, పార్టీ అధికారాన్ని బలవత్తరం చేయటం కూడా అవసరం. కనుక, ఎహ్రెన్‌బర్గ్ మంచు కరడు కథ బహుశః ఈపథకంలో ఒక పన్నాగమై ఉండవచ్చును. నోవీమీర్‌లో ప్రకటితమైన వ్యాసాలు అమాయికంగా రచించినవి కావచ్చు. నోవీమీర్ పత్రికా సంపాదకుడు అపరాధాలకు సంతాపం ప్రకటించినా, ఆయనకు శిక్ష తప్పక పోవటం, ఎహ్రెన్‌బర్గ్‌కి

మాత్రం తన చర్యను సమర్థించుకుంటూ అతడు వ్రాసిన వ్యాసాన్ని ఆయన కథను విమర్శించిన పత్రిక లోనే ప్రకటించే అవకాశం కల్పించటం, ముఖ్యంగా గమనింప వలసిన విషయాలు. ఎహ్రెన్‌బర్గ్ ఆ కథలో రెండు రకాల కళాదృక్పథాలను తారతమ్యదృష్టితో చిత్రించి, వ్యంగ్యంగా సోవియట్ కళాదృష్టిని నిరసించాడని అసలు విమర్శఅయితే, ఆయన తన సమర్థనలో తెలివిగా ఈ ప్రధాన విషయాన్ని విడిచిపెట్టేశాడు. కాని, అసలు ఆసమర్థనను ప్రకటించ నీయడమే పార్టీకి ఆంతరంగికులు కాని మిగిలిన రచయితలకు వడ్డించే పద్ధతి వేరుగాను, ఈయనకు వడ్డించే పద్ధతి వేరుగాను ఉన్నదనడానికి ప్రబల నిదర్శనం. ఆ సమయంలోనే ట్వార్డొవిస్కీ పట్ల అవలంబించిన విధానానికీ, ఈ విధానానికీ ఎక్కడా పోలికలేదు. ఒప్పుకోమన్న తప్పులన్నీ ఒప్పుకొన్నా ట్వార్డొవిస్కీని బర్తరఫ్ చేశారు. ఎహ్రెన్ బర్గ్‌కి అలాంటి తలవంపులేమీ లేకపోగా, తనచర్యను సమర్థించుకుంటూ ఆయన వ్రాసిన ప్రతివిమర్శను ప్రచురించారు.

ఎహ్రెన్‌బర్గ్ రష్యాబాహ్యప్రపంచానికిచూపేముఖం. ట్వార్డొవిస్కీ ఆ దేశంలో రచయితలంతా బుద్ధిమంతులుగా నడచుకునేటట్టు చేయటానికిగాను దండింపబడిన దురదృష్ట శాలుడు.

సోవియట్ రచయితల ద్వితీయ మహాసభ జరగబోయే నాటికి ఉన్న పరిస్థితి యావత్తు మనకు బోధపడింది.

అయినా, మంచుకరడు సూత్రానంతర విధానాలన్నీ ఈ ద్వితీయ మహాసభలో నిర్ణయింప బడినాయని, అంతకు పూర్వం జరిగిన శోచనీయ సంఘటనలన్నీ పొరబాటున జరిగినవే గాని, వాటి పర్యవసానాలన్నీ ఆలోచించి చేసినవి గాని, సమగ్ర విధానంలో ఒక భాగంగా గాని జరిగినవి కావనీ వాదించే వారు కొందరు ఇప్పటికీ ఉండవచ్చు. కాని, ఆ మహాసభ కార్యక్రమాలను శ్రద్ధగా పరిశీలిస్తే, ఈ ఉదార సమర్థనకు ఎక్కడా ఆస్కారం కనిపించదు.

ఈ ద్వితీయ మహాసభ 1954 డిశెంబరులో, ప్రథమ మహాసభానంతరం ఇరవయ్యేళ్ళకు జరిగింది. ఈ మధ్య కాలంలో ఇట్టి సమావేశాలు జరిగినప్పుడల్లా వాటి స్వరూప స్వభావాలు మారిపోతూ వచ్చినవనే ముఖ్యమైన సంగతి కూడా మనం ఈ సందర్భంలో జ్ఞాపకం ఉంచుకోవాలి. 1934 లో సభకు హాజరయిన వారిలో కమ్యూనిస్టులు నూటికి యాభై మందికి కొంచెం హెచ్చుగా ఉండాలన్నారు. 1954 నాటికి ఈ నిష్పత్తి డెబ్భయి రెండుకి పెరిగింది. పార్టీ సభ్యులు కారనే రచయితల స్వరూప స్వభావాలను, వారు నిర్వహించే పాత్రలను గురించి తెలుసుకోవలసిన విశేషం ఉంది. వేలెంటిన్ కటయేవ్ అట్టి వారిలో ఒకడు. కాని, పార్టీ తత్వాన్ని గురించి అందరికన్న గట్టిగా బల్లగుద్ది వాదించిన ప్రబుద్ధులలో ఈయన ఒకడు. తాను పార్టీ రచ

యిత కానంటూ ప్రారంభించి, "అయినా నేను పార్టీనించి విడిపడి ఉండను," అని ఆయన ఉద్ఘోషించాడు. అక్కడితో ఊరుకోలేదు. "పార్టీ నిర్ణయాలకు అత్యంత విధేయుడనై తు. చ. తప్పకుండా వాటిని అమలు జరపటం నా విధిగా భావిస్తున్నాను." ఆ అమిత విధేయుడికి ఈ మాటలతో కూడా సంతృప్తి కలుగలేదు, "సమంజసమైన, ప్రజలకు ఉపయోగకరమైన రచనలు చేయాలంటే, ఏ రచయితైనా, సైద్ధాంతికంగా కమ్యూనిజానికి సంపూర్ణంగా బద్ధుడై ఉండటం అవసరం. నాలో ఈ పార్టీ దృక్పథం ఏ మాత్రం సడలినా నా రచనలు పేలవంగా ఉంటాయి. అది బలంగా ఉన్నప్పుడు నా రచనలు పటిష్ఠంగా ఉంటాయి," అని వివరించడం కూడా అవసరమని ఆయనకు తోచింది.

ఇన్ని విషయాలు చెప్పి, ఒక్క విషయం మాత్రం ఆయన ఆ మహాసభకు చెప్పలేదు. అంతకు పూర్వం ఆ రేళ్ళ క్రిందట, ఆయనలో ఈ పార్టీ దృక్పథం స్ఫుటంగా అలవడి నప్పుడు, ఆయన "సోవియట్ ప్రజల అధికారార్థం" అనే తన నవలను సరిదిద్దుకోవలసి వచ్చింది. ఈపని ఆయనకు స్వయంగా కోరి చేసుకొన్నదిమాత్రం కాదు.

1934 లో జరిగిన మహాసభలో పాల్గొనిన వారికన్న 1954 సభలో పాల్గొన్నవారు "సైద్ధాంతికంగా" ఎక్కువ తరిఫీదు పొందినవారనీ, సోవియట్ సంసర్గం లేని రచయితలను

మభ్యపరచటానికి అవసరమయిన కుహనాచర్యలను జరప టంలో అత్యంత విశ్వాసపాత్రులనీ చూపటానికే ఈవిషయం చెప్పవలసి వచ్చింది.

ఈ మహాసభలో చర్చలన్నీ "విమర్శ, ఆత్మవిమర్శల వాతావరణంలో" సమర్థంగా నిర్వహింప బడినాయని ఈ మహాసభవారు కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘానికి పంపిన సందేశంలో నివేదించారు. నాటకమంతా సక్రమంగా ఆడామని ఇందులో సూచన.

ఇన్ని ఏర్పాట్లు ముందుగాజరిగినా, ఆమహాసభలోని వక్తలలో ప్రజ్ఞావంతులైన కొందరి ప్రసంగాల్లో, ఆ అసి ధారావ్రతంలో అతిజాగరూకత వ్యక్తమయింది. లెలెన్ టిన్ ఓవెచ్ కిన్ అనే ఒక ప్రతినిధి ఇలాంటి అవస్థలోపడి, ఉండబట్టలేక, "రష్యాలో కాల్పనిక వచన సాహిత్యంమీద సాధికార సమీక్షలన్నీ సమపాళంలో విమర్శగా, సమ పాళంలో ఆత్మవిమర్శగా, సమపాళంలో సాహసంగా, సమ పాళంలో జాగ్రత్తగా - అన్నీ ఉచితమైనపాళ్ళతో సరసంగా ఉంటూన్నాయి", అని అభినందించాడు. "సోవియట్ కావ్య నాయకుడు" ఎంత ఉత్సాహవంతుడుగా ఉండవలసినది శ్రీ సెమినోవ్ సోవియట్ రచయితలకు వివరించాడు. అయితే, సోవియట్ సాహిత్యంలో ఉత్సాహవంతుడైన నాయకుడు అసలు ఎందుకు ఉండాలన్న ప్రధానమైన విషయం మాత్రం ఆయన వదలివేశాడు.

సోవియట్ సాహిత్యం "సోషలిస్టు వాస్తవికతా వాదాన్నితప్ప మరేవాదాన్ని ఆమోదించదు" అనీ, ఆ ఒక్క వాదంలోనే "వివిధశాఖలు ఉండవచ్చునేకాదు, ఉన్నాయికూడాను", అనీ ప్రతినిధు లందరికీ జ్ఞాపకం చేయటం అవసరమని సోవియట్ సాహిత్యలోకంలో పార్టీ తత్వానికి మూలస్తంభం అయిన సుర్కోవ్ భావించాడు. ఈ వాదానికి, శాఖలకుగల సూక్ష్మభేదాన్ని నిర్ణయించే అధికారం యావత్తూ సర్వదా సోవియట్ రచయితల సమ్మేళనం బోర్డువారి హస్తగతమయి ఉంటుందని వేరే చెప్ప నక్కరలేదు. పార్టీవాంఛలను గ్రహించటంలో పొరబాటు బడిన వారిగతి ఏమయ్యేదీ మనకు తెలుసు.

"జాతీయ వాదం, విశ్వమానవతా వాదం, బూర్జువాతత్వచిహ్నాలైన ఇతర వాదాలు ఎక్కడ మొలకెత్తినా వాటినితుంచి వేయటం రచయితల విధి" అని రచయితలందరికీ పంపిన అభినందన సందేశమనబడే హెచ్చరికలో మళ్లీ జ్ఞాపకం చేయటం ఉచితమని పార్టీ కేంద్ర సంఘం భావించింది. సంప్రదాయ వాదాన్ని, విశ్వమానవతా వాదాన్ని కూడా "యుద్ధోన్మాదుల అసహ్యాకర సిద్ధాంతాలతో" తుల్యమైనవిగా సుర్కోవ్ జమ కట్టాడు.

సోవియట్ సాహిత్యంలో పార్టీ తత్వం అవిచ్ఛిన్నంగా సాగుతూండటం అవసరమని పునరుద్ఘాటించటానికో అన్నట్లు,

ఖెడయేవ్ 1946-50 మధ్య సర్వసమతా వాదంతో యేర్పడిన సంఘర్షణ ఏవిధంగా సమర్థనీయమైనదీ జ్ఞాపకంచేసి, ఆ ప్రమాదం ఇంకా తొలగి పోలేదని కూడా హెచ్చరించాడు. ఎంతమంది సోవియట్ రచయితలకో ప్రాణాంతంగా పరిణమించిన ఝుడ్నోవ్ చండశాసనమే ఈసంఘర్షణ శబ్దంచేత సూచితం.

సోవియట్ సాహిత్యంలో "నూతన దృక్పథాన్ని" గురించి విని ఉబ్బిపోతూన్న విదేశ రచయితలు, తమలో చాలా మంది విజ్ఞాన వికాసానికి పర్యాయ పదంగా భావించే విశ్వమానవతావాదం రష్యాలో కేవలం "యుద్ధోన్మాదుల అసహ్యకర సిద్ధాంతం"గా పరిగణింప బడుతున్నదని గ్రహించటం అవసరం. నిజానికి విశ్వ మానవతా వాదం అనగా రష్యా ఆధిపత్య రహితమైన అంతర్జాతీయ వాదమే అని కొంచెం ఆలోచిస్తే అర్థమయి పోతుంది.

కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘం రచయితల మహాసభకు పంపిన సందేశంలో రష్యా జాతీయ, ఆర్థిక వ్యవస్థలో బృహత్పరిశ్రమల ప్రాముఖ్యం, బంజరు భూముల సాగు, జర్మనీలో ఫాసిజం పునరుజ్జీవనం మొదలైన కేవల రాజకీయ సమస్యలకు ప్రాధాన్యం ఇవ్వటంతో రష్యాలో సాహిత్యంపైన రాజకీయాల ఆధిపత్యం నిరాఘాటంగా పునః ప్రతిష్ఠితమయింది.

అయినప్పటికీ, ఈ మహాసభలో కూడా కొన్ని వ్యతిరేక విమర్శలు జరుగక పోలేదు. అట్టి వాటిలో చాలా

చరిత్రాత్మక మైనవి వెనియామిన్ కావెరిన్, ఓల్గాబెర్గో ల్ట్స్‌ల ప్రసంగాలు. సృజనాత్మక రచయితలుగా వీరిరువురి హోదా ఎంత గొప్పదైనా, సోవియట్ రచయితల సమ్మేళనం కొత్తగా ఎన్నుకున్న బోర్డులో వారు సభ్యులుగా ఎన్నిక అవక పోవటం ఏదో కాకతాళీయంగా జరిగిన సంఘటన మాత్రం కాదు. పైగా, నాటినుంచి వారిని గురించి ప్రపంచానికి ఏమీ తెలియదు.



# 5. పార్టీ తత్వానికి ఆసియా నమూనా

సాహిత్యంలో పార్టీ తత్వం సోవియట్ రష్యాలో ఏ విధంగా పనిచేస్తున్నదీ మనం తెలుసుకున్నాం. రచయితలు ప్రభుత్వానికి బానిసలుగా ప్రవర్తించటం, ఆవిధేయుల వినాశం దాని ప్రధాన స్వరూపమని కూడా మనకు తెలుసు. ఇక ఈ సిద్ధాంతం కమ్యూనిస్టు చైనాలో ఏ విధంగా అమలు జరుగుతున్నదీ చూద్దాం. ఈ సిద్ధాంతాన్ని అమలు జరుపుతున్న కమ్యూనిస్టు చైనా ప్రభుత్వం కార్మిక వర్గ నిరంకుశతా విధానాన్ని గాక, ప్రజా జనస్వామిక విధానాన్ని అవలంబిస్తున్నట్టు వారు చెప్పుకుంటూఉండటంవల్ల, ఈ పరిశీలనలో మరింత శ్రద్ధ అవసరం. పైగా, ఈ రెండు విధానాలకు గల వ్యత్యాసం చాలా ముఖ్యమైనదని ఇక్కడ వారి సహచరులు తరచు మనకు చాలా గట్టిగా చెబుతున్నారు. చైనా రచయితలకు, కళాకారులకు స్వాతంత్ర్యం ఉన్నదనీ, అక్కడ వర్గీకరణ విధానం అసంభవమనీ కూడా వారు గట్టిగా చెవుతున్నారు. ఇప్పుడు 'ప్రజల చైనా' అంటున్న రాజ్యంస్థాపింప బడినప్పటి నుంచే కాదు, అంతకు పూర్వం, "యెనాన్" రాష్ట్రస్థాపన దినాలనించీ కూడా వారి సహచరులు ఈ మాట చెబుతూ వచ్చారు.

అందుచేత మన మీా దిగువ ప్రసంగభాగంతో ప్రారంభిద్దాం:

"...అన్నప్పుడు, మార్క్స్-లెనిన్‌లవాదంసృజనాత్మక శక్తిని సున్నజుడుతున్నట్టె గద! అవును. ప్రజాసమూహానికి, కార్మిక వర్గానికి సంబంధింపని ఏ విధమయిన సృజనాత్మక శక్తినయినా సరే ఈవాదం పూర్తిగా తుడిచిపెడుతుంది. కార్మికపక్ష రచయితలకు, కళాకారులకు సంబంధించి నంత వరకు ఈ విధమైన సృజనాత్మక శక్తులను నాశనం చెయ్యటంలో తప్పేముంది ? ఏమీలేదని నా అభిప్రాయం. నూతన సృజనాత్మక శక్తులకు అవకాశం కల్పించటంకోసం వీటిని నాశనం చేయటం అవసరం. విద్యావివేకాలు గల బుద్ధిమంతులు ప్రజాసామాన్యంతో ఐక్యమయి, ప్రజాసేవ చెయ్యాలి. ఈ కార్యక్రమం చాలా బాధాకరమైనది, సంఘర్షణలతో కూడినది కావచ్చు. కావచ్చునేమిటి, అవుతుందనే చెప్పుకోవచ్చు. కాని, మనమందరం దృఢనిశ్చయులమై ఉంటేఇందులో అసాధ్యమేమీ లేదు." ఈమాటలు శ్రీమావోసే టుంగ్ 1942 లో యెనాన్‌లో "కళాసాహిత్యగోష్టి"లో చేసిన ప్రసంగంలో అన్నవి.

మావోసేటుంగ్ చేసిన ఈ ఉపదేశానికి, ఇట్టిఇతర ఉపదేశాలకుగల ప్రాముఖ్యాన్నిగురించి, తదంతరార్థాలనుగురించి తరువాత చర్చిద్దాం. ఆ చర్చలోకి దిగటానికి పూర్వం మరొక చిన్నవిషయం తెలుసుకోవలసి ఉంది. రష్యాలోను, చైనాలోను గల కమ్యూనిస్టులు ఇతరదేశాలలో తమ సహచరులవలె గాక, సాహిత్యం విషయంలో ఉభయత్ర అవలం

చిస్తున్న విధానాలలో సామాన్యులను గురించే ఎప్పుడూ ప్రస్తా విస్తారు. వారి సహచరులవలె ఊహాకల్పితమైన వ్యత్యాసాలను గురించి ఎన్నడూ మాట్లాడరు. రష్యా అధికార ప్రచురణ అయిన "సోవియట్ తత్వ నిఘంటువు" ఈ విధంగా ఆదేశిస్తూంది:

"పెట్టుబడిదారుల దాస్యం నుండి విముక్తిపొంది, సోషలిస్టు వ్యవస్థను, సోషలిస్టు సంస్కృతిని ఏర్పాటు చేసుకుంటున్న నూతన ప్రజా జనస్వామ్య దేశాలలోని కార్మిక కళాకారు లందరికీ సోషలిస్టు వాస్తవికతా విధానం వారసత్వంగా సంక్రమించింది. పెట్టుబడి దారుల దేశాలలో ప్రజా స్వాతంత్ర్యం కోసమూ, శాంతికోసమూ పోరాటం జరుపుతూన్న సాహిత్య కళాకారుల ఉత్తమ ప్రతినిధులకు కూడా ఈ వారసత్వం సంక్రమిస్తూంది."

ఇక చైనాలో పీకింగ్ ప్రభుత్వ దివ్యవాణి అని చెప్పదగిన క్వాంగ్ మింగ్ జీ పావోపత్రిక 1954 ఫిబ్రవరి 14 వ తేదీ సంచికలో ఇలా ఆదేశించింది:

"సోవియట్ సాహిత్యం ద్వారా మనం సోషలిస్టు వాస్తవికతావాదం లోని సృజనాత్మకవిధానాలను గ్రహింపగలుగుతున్నాం. మనరచనలు భావసంపన్నంగా ఉండాలని ఈవాదం మనకు బోధిస్తూంది. లెనిన్, స్టాలిన్‌ల ఆదేశాలను అనుసరించి ఈ విధానాల లక్ష్యం సాహిత్యాన్ని చాలా వరకు కమ్యూనిస్టులపార్టీ పారిశ్రామికోత్పత్తిగా చేయటమే."

చౌయాంగ్, టిన్‌లింగ్, లావోషే ల నాయకత్వాన చైనా ప్రతినిధివర్గ మొకటి 1954 డిశెంబరులో సోవియట్ రచయితలసమ్మేళనం ద్వితీయ మహాసభకు హాజరయి ఈ దిగువ అభిప్రాయాన్ని వెల్లడించింది.

సాహిత్యం జీవనకళకు పాఠ్యగ్రంథం అంటూ చెర్నిషెవిస్కీ చేసిన అభివర్ణనకు ఉదాహరణ కావాలంటే, సోవియట్ సాహిత్యానికి చైనాప్రజలకు గల సంబంధంకన్న ఉత్తమనిదర్శనం మరొకటి దొరకబోదు." ("సాహిత్యం — కళ" అనేపత్రిక 23, 24 సంచికల సంయుక్త సంపుటం 1954.)

ఈ అభిప్రాయానికీ చైనా, సోవియట్ సాహిత్యాలకు తేడా ఉన్నదనే అభూతకల్పనలకు ఎక్కడా పొంతన కని పించదు. వారుచెప్పే తేడాలకు వాస్తవికజగత్తులో ఎక్కడా నిదర్శనలు కనిపించవు.

అయితే, ఇది అంత ముఖ్యమైన విషయం కాదు. నిజా నికి మనం యెనాన్ సాహిత్యసభతో ప్రారంభించాలి. సర్వత్ర కమ్యూనిస్టులందరికీ మార్గదర్శకము లయిన సాహిత్య సిద్ధాంతాలను మావోసేటుంగ్ ప్రథమతః ఆసభలో స్వయంగా ప్రవచించాడు.

చైనా కమ్యూనిస్టులు దేశదిమ్మరులైన బందిపోటు దండులుగా జీవిస్తూన్నరోజులలో కూడా రచయితల విష యంలో శ్రద్ధచూపుతూ ఉండేవారు. కాని, ఆనాడు వారితో

సహకరిస్తూవచ్చిన రచయితలు వారికి స్నేహితులేగాని. వారి ఉద్యమంలో భాగస్వాములు కారు. ఆ స్నేహం కూడా చాలావరకు అమాయకమైన స్నేహం. అట్టి రచయితలందరినీ కలిపి 1930 మార్చి 2వ తేదీని షాంగైలో "వామపక్ష రచయితలసంఘం" ఏర్పాటుచేశారు. (ఇది అభ్యుదయ రచయితలసంఘానికి నకలు.) ఇందులోని కొందరు రచయితలకు మాత్రం పార్టీతో ప్రత్యక్షసంబంధం లేకపోలేదు. జపాన్‌తో యుద్ధం ఆరంభం అయినమీదట గాని చెప్పుకోదగినంతమంది రచయితలు యెనాన్‌కి వెళ్ళలేదు. అప్పటివరకు వారు మాసే టుంగ్ దండుతో సంబంధం లేకుండానే ఉంటున్నారు. వారి యెనాన్ ఆగమనాన్ని గురించి మాసేటుంగ్ ఇలా అన్నాడు.

"నిజానికి ఈ ఉభయ వర్గాలకు ఎప్పుడూ సంబంధం ఏర్పడలేదు. ఉభయ వర్గాలు విడి విడిగా పోరాడుతూ ఉండేవి. జపాన్‌తో యుద్ధం సంప్రాప్తం అవటంతోనే, చైనా విప్లవానికి చెందిన రచయితలు, కళాకారులు అధిక సంఖ్యాకులుగా యెనాన్‌కి, జపాన్‌మీద జరిగే ప్రధాన యుద్ధ క్షేత్రాలకు వచ్చారు... ఈ ఉభయ వర్గాలను సమైక్యం చేయటానికి ప్రయత్నాలు జరిగినాయి"

అనగా, స్పష్టంగా చెప్పాలంటే. రచయితల పైనా, కళాకారుల పైనా ప్రత్యక్షంగా కమ్యూనిస్టుల ఆధిపత్యం ఏర్పరచటమన్నమాట. వారిపైన కమ్యూనిస్టులు తమ

భావనా దమన విధానాలను ప్రయోగించటానికి తగిన అవకాశం అప్పుడు ఏర్పడింది. అప్పటికి రచయితలు తమ ఇష్టం వచ్చినట్లు కలాలను ఆడించటానికి వీలు ఉండడం వలన, ముందు ముందు తమకు పట్టనున్న గతిని వారు ఊహించలేక పోయారు. యెనాన్ వెళ్ళేటప్పుడు వారి భావాలు విశృంఖల వీర విహారం చేస్తున్నాయి. తీరా అక్కడికి వెళ్లిన తరువాత, అచటి పరిస్థితులు, పరిసరాలు తాము అనుకున్నంత మనోహరంగా లేకపోవటం చూశారు. తీరని ఆశాభంగం కలిగింది. ఆ ఆశాభంగం అందోళనకు హేతువయింది. తాము లోగడ చాంగ్ కై షేకు పాలనలోని "భూస్వామ్య అభివృద్ధి నిరోధక విధానాల"ను స్వేచ్ఛగా విమర్శించినట్టు, ఇక్కడ కమ్యూనిస్టులను విమర్శించటానికి వీలు లేదని తెలుసుకున్నారు. "అడవికలువ" అన్న సుప్రసిద్ధ గ్రంథ రచయిత వాంగ్ - షీ - లీ అట్టివారిలో ఒకడు.

యెనాన్‌లోని అసహ్యాకరజీవనపరిస్థితులను వర్ణించడం కమ్యూనిస్టులు ఎంతమాత్రం సహించ లేకపోయారు. తాము శత్రువులపైన సాగిస్తున్న యుద్ధంలో తమ ఉపకరణాలుగా వాడుకొన దలచుకొన్న రచయితలు సత్యసంధత వంకకు ఇంతగా మొగ్గు చూపుతారని కమ్యూనిస్టులు అనుకోలేదు. వెంటనే భావసంస్కరణ, మనోక్షాళన అవసరమన్నారు. అదే జరిగింది.

కమ్యూనిస్టులు తమ మిత్రులైన రచయితలను గురించి ప్రథమతః సాగించిన విచారణ "యెనాన్ సాహిత్య సమావేశం" సమయంలో జరిగింది. ఈ సమావేశంలో చేసిన "ప్రసంగాల"లోనే మావోసేటుంగ్ తన ప్రియసిద్ధాంతాన్ని ప్రకటించాడు. ఈ ప్రసంగాలే అనంతరం కమ్యూనిస్టు చైనా కళ, సాహిత్య జీవనానికి బైబిలు, కురానులుగా పరిణమించినవి. మావోసేటుంగ్ యెనాన్ సమావేశంలో చేసిన హెచ్చరిక "ఆనాడెంత సమంజసమైనదో ఈనాడూ అంత సమంజసమైనదే. భవిష్యత్తులోకూడా అంత సమంజసమైనదిగాను ఉంటుంది," అని 'పీపుల్స్ డెయిలీ' పత్రిక (1952 మే 23 న) వ్రాసింది.

ఈ "ప్రసంగాల"లో ప్రతిపాదించిన "సంఘర్షణ"కు మొట్టమొదటిసారిగా వారి మిత్రరచయితలే గురిఅవటంతో వాటి ప్రాముఖ్యం మరింత హెచ్చింది. "అడవికలువ" గ్రంథకర్త వాంగ్-షీ-లీ బహిష్కారశిక్షకు గురిఅయ్యాడు. అక్కడితో ఆయన అంతర్థానమయి పోయాడు. బహుశః చైనారచయితల విషయంలో మనం అంతరించి పోయాడని వాడకూడ దనుకుంటాను.

ఆ సమావేశంలో మావోసేటుంగ్ ముఖ్యంగా రెండుసారులు ప్రసంగించాడు. 1942 మే 2 వ తేదీన ఆసమావేశం ప్రారంభంలో ఒకసారి, మే 22 న సమావేశం ముగిసే

టప్పుడు ఒకసారి మొదటిది "పరిచయప్రసంగం" రెండవది "ముగింపుప్రసంగం."

ప్రథమ ప్రసంగారంభంలోనే మౌసేటుంగ్ ఈవిధంగా హెచ్చరించాడు:

"సాహిత్యం, కళ విప్లవయంత్రాంగం మొత్తంలో ఒకభాగంగా విశ్వాసనీయంగా పనిచేసేందుకు తగిన కట్టుదిట్టాలు చేయటానికి ఈ సమావేశం ఏర్పాటుచేశాం."

తానుకూడా పెద్దకవి అని పేరు పొందిన వాడైనా, మౌసేటుంగ్ కళా, సాహిత్య స్వరూప స్వభావాలను గూర్చి అసలు ఏమీ మాట్లాడక పోవటంకూడా చిత్రమైన విషయం. రచయితలందరు "పార్టీకి చెందినవారై ఉండి", పార్టీ చేతులలో కీలుబొమ్మలుగా మెలగాలన్నదే ఆయన ప్రకటించిన ప్రధాన విషయం. సాహిత్యం, కళ విప్లవ యంత్రాంగం మొత్తంలో ఇమిడిపోయిన భాగాలుగా చేయాలని ఆయన సంకల్పం. ఆ యంత్రాంగాన్ని నడిపే నాయకులెవరు ? రచయితలు మాత్రం కారని మనకు తెలుసు. ఈవిధంగా ఆయన రచయితలకు కళాకారులకు స్వతంత్రమైన అస్తిత్వం లేకుండా ఘనున్నచుట్టాడు వ్యక్తిగత వాదాలు ఆయనకు పనికిరావు. "విప్లవ యంత్రాంగం మొత్తంలో ఇమిడిపోయిన భాగాలుగా" ఆయంత్రాంగాదేశాలను వినయ విధేయతలతో

అనుసరించడమే రచయితలకు, కళాకారులకు విధ్యుక్తధర్మ మని ముందుముందు మనకు బోధపడుతుంది.

రచయితలు, కళాకారులు ఏమిచెయ్యాలన్న విష యంలో తన అభిప్రాయాన్నిగురించి ఏవిధమైన సందేహాలూ ఉత్పన్నమవకుండా చేయటానికోఅన్నట్టు,ఆయన"దృక్పథం" అనేమాటను, "ప్రత్యేక సందర్భాలను, సంఘటనలను గురించిన విశిష్ట దృక్పథాన్ని" గురించి వివరిస్తూ ఇలా అన్నాడు.

"ఉదాహరణకు ప్రశంసించాలా ఖండించాలా అన్న విషయం తీసుకుందాం. ఇది దృక్పథానికి సంబంధించిన సమస్య. ఈ ద్వివిధ దృక్పథాలలో మనం దేనిని అవలంబిం చాలి ? ఆయా సంగతి సందర్భాలను అనుసరించి రెండింటినీ వాడాలని నా అభిప్రాయం.

"మొత్తం మీద మూడురకాల వ్యక్తులు ఉన్నారు. ఒకడు మనకు శత్రువు. మరొకడు మిత్రుడు. మిగిలిన వాళ్ళం మనం: అనగా కార్మికవర్గం, అందులో అగ్రశ్రేణి. ఈమూడు రకాల మనుష్యులను గురించి చర్చించేటప్పుడు మూడురకాల దృక్పథాలను అవలంబించాలి" కనుక మావో నిర్ణయం ప్రకారం "శత్రువులకు" సదాఖండనే లభిస్తుంది. కార్మిక వర్గానికి వారి అగ్రశ్రేణికి సదాప్రశంసే లభిస్తుంది. ఇక మిత్రులకు విమర్శ.

మావో తన అభిప్రాయాలను గురించి ఇతరుల ఊహా పోహాలకు అవకాశం ఇచ్చేరకంకాదు. ఆయన ఇంకా ఇలా వివరించాడు. మార్క్సులెనిన్ వాదం ప్రకారం ఆత్మేతర విషయాలంబన వాదం (Objectivism) ఆత్మాలంబన వాద (Subjectivism) విరోధి. అనగా, వర్గసంఘర్షణలు, జాతి సంఘర్షణలు అనే ఆత్మేతర వాస్తవికతే మనభావాలను, రసాలను నిర్ధారణచేస్తుంది."

సోషలిస్టువాస్తవికతకు చైనానమూనాకు ఇది సంక్షిప్త వివరణ.

ప్రజాచైనాలోని రచయితలు, కళాకారులు తమ భావాలకు, ఆవేశాలకు స్వస్తిచెప్పి, తాము స్వయంగా సత్య దర్శనం చేయాలనే పట్టుదల వదలాలి. ప్రతివిషయాన్ని వర్గ సంఘర్షణ, జాతి సంఘర్షణ అనే రంగద్దాల జోడులోంచే చూడాలి. కమ్యూనిస్టు ప్రణాళికలో వర్గసంఘర్షణ అనే పరమసత్యమే ప్రధానం. కనుక, రచయితలు, తమభావా లను, ఆవేశాలను దానికి అనుగుణంగా మలచుకోవాలి. వారు "విప్లవ యంత్రాంగం మొత్తంలో ఇమిడిపోయిన భాగాలు" గనుక స్వతంత్రంగా సత్యాన్వేషణ చేస్తామన టానికి ఎంతమాత్రం అవకాశంలేదు.

మావోసేటుంగ్ ప్రజ్ఞాదృష్టి ననుసరించి, "ప్రేమ", "స్వాతంత్ర్యం", "సత్యం", "మానవస్వభావం" వంటి

ఆవేశాలకు, ఆశయాలకు వర్గసంఘర్షణలనే వాస్తవికతలో ఆధారం లేనందువల్ల, అవి కేవలం "వర్గాతీతమైన" "అవాస్తవిక మైన" అసందర్భాలు.

మావోసేటుంగ్ ఈ విధంగా స్పష్టంగా శాసించటంవలన, దానితోనే యెనాన్ సమావేశంలో చర్చలకు గల అవకాశం ధోరణి నిర్ధారితమై పోయింది. అనగా, తద్విరుద్ధ భావప్రకటనకు అవకాశం లేదని తేలిపోయింది. పోతే చర్చించ తగిన విషయం ఒక్కటే మిగిలింది. పార్టీని సేవించటంలో అత్యుత్తమ మార్గాన్ని గురించి, తమ కార్యక్రమాన్ని కొనసాగించటానికి తగిన ఉపాయాలను గురించి, ఆ కార్యక్రమం రూపం, ప్రక్రియ ఎలాఉండాలనేవిషయాలను గురించి అంతులేనిచర్చ ప్రారంభమయింది.

"ముగింపు" ఉపన్యాసంతో మావోసేటుంగ్ కనీసం ఒక్క విషయం నిర్ధారణ చేసివేశాడు. రచయితలు ఏ విషయాలను గురించి వ్రాయాలన్న అంశాన్ని గురించి అతడు ఇలా స్పష్టంచేశాడు: "సాహిత్యం, కళ" కార్మికులకు, కర్షకులకు, సైనికులకు చెందినవి" గనుక, అవి "కార్మిక కర్షక సైనికులను గురించినవి" అయి ఉండాలి. తరువాత వాటిని కార్మిక, కర్షక సైనికులలో బాగా ప్రచారంచేసి, "కార్మిక కర్షక సైనికుల" అభ్యుదయాన్ని అనుసరించి కళా సాహిత్యాల స్థాయికూడా పెంచించాలి!"

కళా సాహిత్యాల స్థాయిలో పెరుగుదల కార్మిక కర్షక, సైనికుల స్థాయి హెచ్చటానికి పూర్వాంగాక, ఆ పిమ్మట దాని ననుసరించి సాగాలనటం ముఖ్యంగా గమనింప దగినది. ఆ దుష్కర లక్ష్యం సాధించేటంత వరకు, సాహిత్య స్థాయి పెరగటం అనవసరము, అసాధ్యము అన్నమాట. అంతవరకు సాహిత్యము, కళ మావొసేటుంగ్ కార్మిక కర్షక సైనికులంత మొరటుగానూ ఉండి తీరాలన్నమాట.

సాహిత్యం, కళ రాజకీయాలకు లోబడి ఉండాలని మావొసేటుంగ్ పాపం స్పష్టంగానే చెప్పేశాడు.

"నేడు ప్రపంచంలో కళా సాహిత్యాది సంస్కృతి యావత్తు ఒక ప్రత్యేక వర్గానికి, ప్రత్యేక పక్షానికి, అనగా ఒక ప్రత్యేక రాజకీయ దృక్పథానికి చెందినవి. ...వర్గాలు, పక్షాలుగల సమాజములో కళా సాహిత్యాలు ఏదోఒక వర్గానికి, పక్షానికి లోబడి ఉండక తప్పదు. గనుక, సహజంగా వామ వర్గ పక్ష రాజకీయాశయాలకు విధేయులై ఆ విలక్షణ విప్లవ యుగానికి చెందిన విప్లవాత్మక ధర్మాలను నిర్వహించటానికి దీక్ష వహించాలి... ...కార్మికవర్గ సాహిత్యము, కళ ఆ కార్మికవర్గ విప్లవోద్యమ మంతటిలో ఒక భాగం కావాలి. అనగా, "యంత్రాంగంలో శీల" లని లెనిన్ చెప్పిన దాని వంటి స్థితి. ఈ కారణం వలన, పార్టీ సాహిత్యానికి, కళలకు మన పార్టీ తాలూకు విప్లవ కార్య

క్రమంలో నిర్దిష్టమైన, ముందుగా రూపొందించిన స్థానం ఉన్నది.”

ఈ నిర్ణయంవలన బాధపడే అంతరాత్మలుగలవారిని ఓదార్చటానికో అన్నట్లు, వారికి కొంచెం ఉత్సాహం కలిగించే మాటకూడా ఒకటి ఆయన చెప్పాడు: “కళా, సాహిత్యాల ప్రాముఖ్యాన్ని మరీ పెద్దచేసి చెప్పటం మనం అంగీకరించక పోయినప్పటికీ, ఆ ప్రాముఖ్యాన్ని తక్కువ చేయటానికి కూడా మనం అంగీకరించము. కళాసాహిత్యాలు రాజకీయాలకు ముడిపెట్టుకొని ఉండవచ్చు. కాని, ఒకప్పుడు అవి ముందంజ వేసి రాజకీయాలపై తమ ప్రభావాన్ని ప్రసరింప జేయవచ్చు.”

ఈ ఉపచార వాక్యం కమ్యూనిస్టుల యాజమాన్యం క్రింద ఉండిన ప్రాంతాల్లో రచయితలకన్న చైనా నడిగడ్డ పైన వారిసహచరులకోసం ఉద్దేశించినదై ఉండవచ్చు. చైనా నడిగడ్డపై గల రచయితలుకూడా తమకు ఉపకరణాలు కావాలనే కమ్యూనిస్టులు కోరుతున్నారు. కనుక, వారాగాలాన్ని మింగడానికి ఏదో ఎరచూపాలి. రాజకీయాలపైన, పార్టీపైన తమ ప్రభావాన్ని ప్రసరింప చేయటానికి విశేషంగా ప్రయత్నించే రచయితలకు, కళాకారులకు ‘అడవికలువ’ రచించిన వాంగ్-షీ-లీకి పట్టిన అవస్థే గొప్పకనువిప్పు.

మావోసేటుంగ్ ఉపన్యాసంలో ఈ భావమొక్కటే కొంచెం విరుద్ధంగా కనిపిస్తుంది. మిగతా ఉపన్యాసమంతా

సాహిత్య కళా రంగాలలో చైనా కమ్యూనిస్టుల ఆశయాలకు, కార్యక్రమానికి విస్పష్టతమమైన వివరణమని చెప్పవచ్చు. పెకింగ్ ప్రభుత్వపు అధికారవాణి అయిన 'పీపుల్స డెయిలీ' పత్రిక వ్రాసిన ప్రకారం, "మావోసేటుంగ్ ఆదేశం ఇప్పటికీ యథాతథంగా చెలామణీ అవుతూంది.......భవిష్యత్తులో కూడా శాశ్వతంగా నిలచిఉంటుంది." చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం చెల్లుబడి అయినంతకాలం ఈ ఆదేశం అమలు జరుగుతూనే ఉంటుందని భావించటంలోకూడా బేసబబేమీ లేదు.

(కమ్యూనిస్టు చైనా తనచుట్టూ అల్లుకున్న) వెదురు తెరకు ఇవతల ఉన్న అత్యావేశపరులైన మన వ్యాఖ్యాతల మాట కాసేపు మరచిపోతే, మావో మంత్రోపదేశంలో చైనాలో వాస్తవరచయిత లెవరికీ అంతగా సంతోషింప దగిన విషయం ఏమీ కనిపించలేదని కూడా తేలుతూంది. ఉదాహరణకు లూ సున్ ఈవిధంగా వ్యాఖ్యానించాడు:

"సాహిత్య సౌధ ద్వారాలవద్ద ఇటువంటి చిరాకు కలిగించే నిరోధాలు ఏర్పాటుచేస్తే, అసలా మందిర ప్రవేశం కోరకుండా ఉండటమే మంచిది. ఎడారిలోనే ఉండిపోయి, ఆ దుమ్ము తుపానులను, ఆ ఇసుక పర్రలను స్వయంగా చూస్తూ ఉండటమే అంతకన్న మేలు."

.......

అయితే లూసున్ అదృష్టవంతుడు. కమ్యూనిస్టుల సాహిత్య సౌధంలో ప్రవేశించటానికి, ప్రవేశించక పోవ

టానికిగాని అప్పటికి ఆయనకు అవకాశం ఉంది. "ఎడారి" లోనే ఉండిపోయి, కమ్యూనిస్టుల సాంస్కృతిక సౌధాలను తిరస్కరించటానికి ఆయనకు వీలుకలిగింది. చైనా నడిగడ్డను కమ్యూనిస్టులు ఆక్రమించుకున్న తరువాత ఆ "ఎడారి" కూడా అసలక్కడ ఉండదు. ఆతరువాత చైనా రచయిత లందరికీ కమ్యూనిస్టు సాహిత్య సౌధంలోకి బలవత్ప్రవేశం కలిగి, ఆ "చిరాకు కలిగించే నిరోధాల"కు బద్ధులై ఉండక తప్పదు.

ఆ తరువాత జరిగినదంతా విషాదగాథ. వాంగ్-షీ-లీ ఉద్వాసనతో ఆదారుణ విషాదకథ ప్రారంభమయి, చైనాలో విద్వాంసు లందరినీ చుట్టబెట్టింది. చాలామంది అంతరించారు. అంతకన్న ఎక్కువమందికి వాగ్బంధనం జరిగింది. ఇంచు మించు అందరికి భయ విహ్వలత కలిగింది. ఇదంతా జరిగిన తరువాతనే 1954 సెప్టెంబరులో, "ప్రభుత్వం సాగించిన భావనాసంస్కరణోద్యమం ఎవరో కొద్దిమంది అభివృద్ధి నిరోధకులైన విద్వాంసుల విషయంలో తప్ప, మిగిలిన అంద రివిషయంలోను విజయవంత మయింది అంటూ – లియూ షా వోచీ, చౌ ఎన్ లాయ్ ప్రకటించ గలిగారు. ఆపై సంవత్సరం సాగిన 'తుడిచివేత' కార్యక్రమంలో "ఆకొద్దిమంది విద్వాం సులకు" కూడా ఉద్వాసన చెప్పారు. ఆవిధంగా, "అన్ని పూలూ ఏకకాలంలో వికసించాలని,.....సర్వభావనా విధా నాలను పరస్పరం వివరించుకో నీయాలని" తన సంకల్పమని

మావో సేటుంగ్ 1956 మే 2న నిరాటంకంగా ప్రకటించ గలిగాడు.

అంతకు పూర్వమే అన్నిపూలను నాశనంచేసి కమ్యూనిజం కలుపు తీగ విచ్చలవిడిగా ప్రాకిపోవడానికి అవకాశం కల్పించారు కనుక, ఆపైన అన్ని భావనా విధానాలు పరస్పరం వివరించుకో వచ్చుననటం – క్రికెట్ ఆటపెట్టి, నీ ఎదురుగా ఎవడైనా పరుగులు చేస్తే, ఆ తరువాత బంతికి బదులు అతనికి చేతి బాంబే ఎదురవుతుందని ముందుగా చెప్పినట్టు ఉంది. 

ఆ తరువాత జరిగిన సంఘటన లేవీ అనుకోకుండా హాఠాత్తుగా జరిగినవి కావు. మావో సేటుంగ్ కి సుప్రసిద్ధమైన ఆయన మెనాన్ ప్రసంగ సమయములోనే ఈ విషయా లన్నీ తెలుసు. ఈ దిగువ మాటలు కూడా ఇతరు లెవరో చెప్పినవి కావు: 

"అయితే మరి మార్క్స్-లెనిన్ సిద్ధాంతం సృజనాత్మక శక్తిని అంతరింప జేయదా అని ప్రశ్న. ఔను చేస్తుంది. ప్రజా సామాన్యానికి, కార్మిక వర్గానికి ఉపకరింపని సృజనాత్మక శక్తిని మాత్రం అంతరింప జేస్తుంది. కార్మికవర్గ రచయితలలో, కళా కారులలో ఈ రకమైన శక్తిని అంతరింప జేయడం అవసరం కాదనగలమా? కాదన రాదనే నాఅభిప్రాయం. ఆ శక్తులను తుడిచిపెట్టి, నూతన శక్తులకు అవకాశం కల్పించాలి."

# 6. దైవోపహతులు

"కనుక, మాననీయులైన మీ అందరి మనస్సుల లోను, క్రైస్తవ నిష్ఠా గరిష్ఠు లందరి మనస్సులలోను సహేతుకంగా నాపై ఏర్పడిన ప్రబలమైన అనుమానము లను తొలగింప గోరి నేను హృదయ పూర్వకంగా, అకలంక మైన విశ్వాసంతో పైన పేర్కొనిన నాలోపాలను, పాపా లను, పవిత్రమైన మన మతాధిప వవ్యస్థ పట్ల అపరాధము లయిన నా ఇతర దోషాలన్నింటినీ మనః పూర్వకంగా నిస్సంకోచంగా, నిండు మనస్సుతో అంగీకరిస్తున్నాను. నిరసిస్తున్నాను, అసహ్యించు కొంటున్నాను. భవిష్యత్తులో ఎన్నడూ నాపై ఇట్టి అనుమానాలను కలిగింపగల అభి ప్రాయాలేవీ వాచా గాని, లిఖిత పూర్వకంగా గాని ప్రక టించనని ప్రమాణం చేస్తున్నాను."

అని వెనక గెలీలియో తన సుప్రసిద్ధ పాపవిచారణా సభలో ప్రకటించాడు.

"రాజకీయాల సర్వాతిశయ ప్రధాన్యాన్ని, ప్రాము ఖ్యాన్ని ఇప్పుడు నేను గ్రహింప గలిగాను. రాజకీయ తత్వ శాస్త్రము యొక్క గభీరప్రాధాన్యం మార్క్స్, ఎంజెల్స్, లెనిన్, స్టాలిన్‌ల నిర్వచనాలలోనే గాదు, మా సేటుంగ్ మహనీయ ప్రచురణలలోకూడా సుస్పష్టంగా వివరింపబడి

ఉన్నది. జీవితంలో అత్యల్పవిషయాలకు కూడా పార్టీతోను, రాజకీయాలతోను సర్వవ్యాప్తమైన సంబంధం కనిపిస్తోంది."

అని షెన్ సుంగ్ వెన్ 1951 నవంబరు 29 న 'టాకుంగ్ పావో'లో ప్రకటితమైనతన 'ఆత్మవిమర్శ'లో వెల్లడించాడు.

పరమార్థతః, ఈ ఉభయ ప్రకటనలలో సామ్యం స్ఫుటంగా కనిపిస్తూనే ఉంది. మత విషయాలలో పశ్చాత్తాప ప్రకటన, కమ్యూనిస్టుల పాలనలో ఆత్మవిమర్శ పూర్తిగా ఒకేధోరణిలో కనిపిస్తున్నాయి. మొదటిది మతవ్యవస్థ యాజమాన్యాన జరిగిన నేరవిచారణను పురస్కరించుకుని జరిగినదయితే, రెండవది అభ్యుదయం, శాస్త్రీయ భావనల పేర్మిూదుగా జరిగినది. నిందితుని నిస్సహాయ నిర్వేదాలు ఉభయత్ర సమానం అవటమే విశేషం. ఆదిలో స్వాభిమత ప్రియులైన వారిలో బ్రూనో మొదలైన ధీరులు కొందరు తమను సజీవంగా తగులబెట్టినా తల వంచనట్టే, చైనాలో కూడా రెండవ 'భావసంస్కార' సమయంలో వందల కొలది పండితులు, బుద్ధిమంతులు స్వాభిప్రాయాలను మార్చుకొనటానికి అంగీకరింప జాలక ఆహుతైపోయారు. అయితే ఈసంఘటనలపై ఇక మానవానుభూతి విషయంలో మాత్రం చాలా తేడా వుంది. తొలిసంఘటనల సమయంలో ప్రజలు, న్యాయ నిర్ణేతలు రాక్షసంగా ప్రవర్తించారని విమర్శించి, వారి దారుణ దండనలకు గురియైన వారిని

మహాత్ములని, మానవాత్మ స్వాతంత్ర్యం కోసం, భావనా స్వేచ్ఛ కోసం ప్రాణాలర్పించిన మహా త్యాగులని కీర్తించే వారు. నేడీ ఆధునిక విచారణలకు బలిఅైన ధీరులవిష యంలో ప్రజలా విధంగా సానుభూతి చూపటానికి అవకా శం లేదు. దీనికి కారణం అసలు వారికి వాస్తవ సమాచా రాలు తెలియక పోవటమా, లేక మానవుని ఆత్మలో ఇటీ వల గలిగిన పరిణామమా అన్నది చర్చనీయాంశం.

ఒక్కవిషయం మాత్రం నిజం. ఎర్రచైనాలో జరిగిన దారుణ దండన ప్రక్రియలు నిర్దయతలోను, విస్తృతి లోను మధ్య యుగాలలో జరిగిన అతినికృష్ట దండన కాండలను కూడా అతిశయించి పోయినవి. అప్పటికన్న ఎక్కువ నిరంకుశమైన, విస్తారమైన సాధనాలు, విధానాలు ఇప్పుడు వీరికి ఉండటంవలన అంతకన్నా చాలా ఎక్కువ నరబలి ఇప్పుడు సులభ సాధ్యమయింది. పైగా, ఆకాలంలో న్యాయ నిర్ణేతలు "మానవ మస్తిష్కంలో లగాయతు ఏమూలా వ్యక్తిగతాభిప్రాయాలంటూ ఉండటానికి వీలులే"దని ఎన్నడూ శాసించలేదు. అయితే, ఈ ఆధునిక నిరంకుశుల చండశాసన మింత నిరాఘాటంగా సాగటానికి, మానవజాతి దానిని సహించేటంతగా నీరసపడటానికి విద్యా వివేక వంతుల అలసతే చాలావరకు కారణ మనక తప్పదు.

ఉత్తరప్రదేశం మాజీగవర్నరు, సుప్రసిద్ధ రచయిత, విజ్ఞాని అయిన శ్రీ కె. ఎమ్. మున్షీ బొంబాయిలో

1951 మార్చిలో జరిగిన సాంస్కృతికస్వాతంత్ర్య మహాసభకు ప్రారంభోత్సవంచేస్తూ ఈ లోపాన్నిగురించే ఇలా ఉద్ఘాటించాడు.

"మానవ విజ్ఞానానికి ఏర్పడిన ఈ సంకటస్థితి విద్వాంసులు తమ భావనాస్వాతంత్ర్యాన్ని తృణప్రాయంగా వదులుకోవటంలో మరీ విపరీతంగా కనిపిస్తూంది."

అయితే అన్నింటికన్న దారుణమైన చైనాలోని సంఘటనలను కొంచెం శ్రద్ధగాపరిశీలిస్తే, ఆ విశాలదేశంలోని విద్వాంసులందరు మున్షీజీ చెప్పినంత సులభంగా తమ స్వాతంత్ర్యాన్ని వదలిపెట్ట లేదని బోధపడుతుంది. వారిలో కొందరు ధైర్యంగా పోరాడారు. అదొక విషాదాంత వీర గాథ అయింది. చివరకు వారు పరాజితులైనది వారి శౌర్య సాహసాల లోపంవల్ల మాత్రం కాదు. అంతకన్న ప్రబలమైన పాశవిక శక్తి వారిపై కుట్ర పన్నుతున్న వారి హస్తగతమై ఉండటమే వారి పరాజయానికి కారణం.

చైనాలో కూడా గెలీలియోలు, బ్రూనోలు లేక పోలేదు. యెనాన్ సమావేశంలో ప్రారంభమైన ప్రతిఘటన బహుశః నేటికీ ఇంకా సాగుతూనే ఉందని చెప్పవచ్చు. పైగా వాంగ్ షీ లీ, హ్యూ ఫెంగ్‌ల వంటి పురుషులు మానసికంగా బాధపడి ఉద్రిక్తులై, "సాహిత్య జగత్తుకి మృత కమ్యూనిస్టుల శవాల పాలన ప్రాప్తించింది." అని వ్రాసే

టుంగ్ ని, భయస్తులైన ఆయన అనుచరులను బహిరంగంగా విమర్శించ గలిగి ఉన్నంతవరకు మనం నిస్పృహ చెంద వలసిన అవసరం లేదు. వీరెవరు ? ఇతర రచయితలు చాలా మందితో పాటుగా ధర్మసంకటస్థితిలో పడి చివరకు కమ్యూనిస్టులతో సహకరించటమే ఉత్తమ మనుకొన్న విశ్వాస పాత్రులైన రచయితలలో అగ్రగణ్యులు. కమ్యూనిస్టు చైనా సాహిత్య రంగంలో హ్యూ ఫెంగ్ కి సంప్రాప్తించిన ఉన్నత పదవులే ఇందుకు నిదర్శనం. ఒక విధంగా ఆయన గోర్కీతో పోల్చదగినవాడు. సుప్రసిద్ధుడైన ఆ రష్యా రచయిత లాగే, ఈయనకూడా తాను రచయితననే భావించాడు గాని, నిర్జీవమైన ప్రభుత్వ యంత్రంలో తానొక పళ్ల చక్రమని అనుకోలేక పోయాడు. గోర్కీలాగే ఈయన కూడా తత్ఫలితాన్ని అంతకన్న కూడా దారుణంగా అనుభవించ వలసి వచ్చింది. అభిమానధనులైన ఆ రచయితలకు, ఆ మహాత్యాగులకు జోహారు లర్పించి అట్టి దురవస్థ ఇతరత్ర గల రచయితలకు పట్టనీయరాదని గట్టిగా సంకల్పించుకొనటమే మనం చేయగల పని.

గత అధ్యాయంలో చెప్పిన ప్రకారం, ఈ భావనా సంస్కార కాండకు గురి అయిన ప్రథమ వ్యక్తి "అడవి కలువ" రచయిత వాంగ్-షీ-లీ, స్వయంగా మావ్ సేటుంగ్ చేతి మీదుగానే ఆయన బహిష్కారం పరిష్కారం జరిగి.

నవి. ఈ రచయిత చరిత్ర, పొందిన దండన వివరంగా తెలుసుకొన దగినవి.

1926 లో వాంగ్-షీ-లీ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా చేరాడు స్వయంగా చాలా వ్యాసాలు రచించాడు. సుమారు ఇరవైలక్షల పదాలవరకు మార్క్స్ - లెనిన్ సిద్ధాంత గ్రంథాలను చైనా భాషలోకి అనువదించాడు. ఆయనను హతమార్చిన కమ్యూనిస్టులు కూడా ఆయన దక్షిణ పక్ష భావాలు గలవాడని నిందింపలేక, ట్రాట్‌స్కీ పక్షపు బందిపోటు ముఠాలకు చెందినవాడని మాత్రం ఆరోపించటం వల్ల ఆయన భూస్వామ్యానుకూలవాది కాడని తేలిపోయింది. నిజానికి ఆయన చేసిన అపరాధమల్లా ఒక్కటే. స్వతంత్రంగా ఆలోచించి, తనకు తోచిన అభిప్రాయం చెప్పబోవటం.

అయితే, ఈ విధంగా చేయటానికి ఈయనే ప్రథముడు మాత్రం కాడు. యెనాన్‌లో కమ్యూనిస్టుల పాలనలో జరుగుతున్న అన్యాయాలను, ఆయన టింగ్‌లింగ్ అనే స్త్రీ రచించిన ఒక వ్యాసంనించి గ్రహించాడు. 1942 మార్చి 9వ తేదీని వెలువడిన 'యెనాన్ లిబరేషన్ న్యూస్' పత్రికలో ఆ వ్యాసం ప్రకటిత మయింది. "మే 8వ తేదీనాటి భావాలు" అనే శీర్షికతో ఆ వ్యాసంలో ఉత్తర షాన్సీ ప్రాంతంలోని స్త్రీల దురవస్థలు అభివర్ణింబడినవి. ఇంచుమించు ఆసమయం లోనే వాంగ్ నవల కూడా ప్రకటితమయింది.

వాంగ్ చేసిన సాహస మల్లా, అతడు తనటార్చిలైటును అత్యున్నత శ్రేణి నాయకుల ముఖాలమీదే వేయటం. అదే ఆయన ప్రధానాపరాధం అయింది. ఇద్దరు బాలికల మధ్య సంభాషణ రూపంలో ఆయన ఇలా వ్రాశాడు:

"దిగువ బూర్జువా తరగతివారని ఆయన ఇతరులను నిందించేవాడు. నిజానికి ఆయనకొక స్వతంత్రమైన 'వాదం' ఉంది. తాను సామాన్యులకంటె అన్నివిధాల విలక్షణంగా కనిపించటానికి ప్రయత్నించేవాడు. తనక్రిందపనిచేసే కామ్రే డుల యోగక్షేమాలనుగాని, వారి ఆరోగ్య అనారోగ్యాలను గురించి గాని కనుక్కునేవాడు కాడు. వారు బ్రతికి ఉన్నదీ చచ్చినదీ కూడా ఆయనకు పట్టేదికాదు. అది తనపని కాద న్నట్లు ఉండేవాడు."

"ఔను! కాకులు ఎక్కడఉన్నా నలుపే. మన కామ్రేడులు సరిగా అదే తరహా."

"వారు మృదువుగా సాదరంగా, ప్రేమగా మాట్లాడ తారు. కాని, మానవుడు మానవునిపట్ల చూపవలసిన సాను భూతి వారిలో కనిపించదు. మీరు ఎదురైనప్పుడు తియ్యగా చల్లగా చిరునవ్వులొలుకుతూ పలకరిస్తారు. కాని, ఆ నవ్వు పెదవులచివరపుట్టినదేగాని, హృదయంలోంచివచ్చేదికాదు. రవంత కదిపితే వారిరంగు బయటపడుతుంది. తమ అహంకార మంతా ప్రదర్శిస్తూ, మిమ్మల్ని శాసించటమారంభిస్తారు."

చైనా కమ్యూనిస్టులు చైనా నడిగడ్డనంతటినీ ఆక్ర మించుకొనటానికి పూర్వం చేసిన అభివర్ణన ఇది. ఈవిమర్శ వాంగ్ కి చిరాకు కలిగించటం సహజం. అతనిచేతి అద్దంలో తమ ముఖాలను చూసుకొన్న కమ్యూనిస్టునాయకులు అతని ప్రవర్తనకు చిరాకుపడటంకూడా సహజమే. నిరంకుశు లందరిలాగే వారూ తమ ముఖాలలో ఏవో లోపాలున్నా యని ఒప్పుకోలేరు. అందువలన తమకా అద్దం చూపించ టానికి సాహసించిన వ్యక్తిని పట్టుకొని దండించారు.

ఆ నవలలో వారికి ఆగ్రహంకలిగించే మరికొన్ని పంక్తులుకూడా లేకపోలేదు.

"యువకులు సౌమనస్యం, సౌందర్యం కోరి యెనాన్ వచ్చారు." కాని వారికిక్కడ "కర్కశత్వం, కాలుష్యం" ఎదురైనవి.

"మిడిమిడి జ్ఞానం గల మార్క్సిస్టులు అజ్ఞానాంధకార మనేది ఉండటం సహజం అనుకుంటారు. ఆ అంధకారంలో తాము హాయిగా నిద్రపోవచ్చుననీ, ప్రమాదమేమీ లేదనీ భావిస్తారు. ఆవిధంగా వారు పరోక్షంగా ఆ అంధకారాభి వృద్ధికే సదా సహాయపడుతున్నారు."

"సౌమనస్య, సౌందర్యాలను" అన్వేషిస్తూ తత్ప్రతి కూలమైన ప్రదేశానికి రావటమే వాంగ్ చేసిన ప్రాణాంతక మైన పొరపాటు. పూర్తిగా సమయం మించిన తరువాతగాని, ఇది పొరపాటని అయన గ్రహించలేక పోయాడు.

లోగడ చెప్పినట్లు, మావో సేటుంగ్ ఉపన్యాసానంతరం యెనాన్ లోకమ్యూనిస్టులు 'సంఘర్షణసభలు' అని వారు నామకరణం చేసిన సమావేశాలు ఏర్పాటుచేసి. పూర్తిగా పదహారు రోజులపాటు వాంగ్ కి వ్యతిరేకంగా ప్రచారం చేశారు. అయినా, ఆయన లొంగిపోవటానికి ఒప్పుకోక ధైర్యంగా తల యెత్తుకొని నిలబడ్డాడు. బ్రూనో చేసినపనే ఆయనా చేశాడు. ఆయనలాగే ఆహుతి అయాడు. యెనాన్ ప్రభుత్వ విమర్శకులలో మనోదార్ఢ్యంలేని వారంతా భీతిల్లి, బెంగటిల్లి లొంగిపోయారు. అట్టివారిలో టింగ్ లిన్ అనే బాలిక కూడా ఒకతె. వీరందరు ఆత్మవిమర్శలు చేసుకున్నారు. పశ్చాత్తాపాలు ప్రకటించారు. ఆ విధంగా గండం గడుపుకొని బయటపడ్డారు.

వాంగ్ అంతర్హితుడై పోయాడు. కాని, చైనాలోను, ఇతర దేశాలలోను గల రచయితలందరికీ ఆయన చేసిన హెచ్చరిక మాత్రం శాశ్వతంగా ప్రతిధ్వనిస్తూంది "హార్వెస్ట్ అండ్ రెయిన్" లో ప్రకటితమైన "రాజ్యపాలకులు, కళాకారులు" అనే వ్యాసంలో ఆయన ఇలా వ్రాశాడు:

"కళాకారులు ధైర్యంగా, సముచితమైన తీరులో, ముసువులు తొలగించి లోపలవున్న చీకటిని, కాలుష్యాన్ని బహిరంగంగా ప్రకటిస్తారు. ఈ అంతఃప్రక్షాళనం పరిశుభ్రతకు హేతువవుతుంది. సల్లక్షణాలను ప్రశంసించటం ఎంత అవసరమో, ఇదీ అంత అవసరం. నిజానికి అంతకన్న కూడా ఎక్కువ అవసరం."

"కామ్రేడ్ కళాకారు లందరికీ ఇదే నా సవినయ విజ్ఞప్తి. మనం ఆత్మ పునరుజ్జీవనానికి పూనుకుందాం. ఈపని ముందుగా మనతోను, మన సహచరులతోను ప్రారంభం కావాలి." నీతి నియమాల్లేని ఆత్మోత్కర్షకు పేరుమోసిన ప్రభుత్వానికి, నిజంనికి ఇది దుస్సహమైన పనే.

యెనాన్ దశలో ఇదే దుర్గతికి గురిఅయిన మరొక రచయిత షావో చున్. ఈయన హార్బిన్స్ "కల్చర్ న్యూస్" పత్రిక సంపాదకుడు. యెనాన్‌కి మొట్టమొదట వచ్చిన వారిలోను, ట్యూసున్ ప్రియ శిష్యులలోను ఈయన ఒకడు. "వామపక్ష సమీకరణ" కాలంలో ఈయన చాలా ప్రముఖ పాత్ర నిర్వహించాడు. యెనాన్‌లో లోపాలను చూడకుండా కళ్లు మూసుకోటం ఈయనకు చేతకాలేదు. పోనీ చూసీచూడనట్టు ఊరుకోనూ లేదు. అయితే పార్టీ సభ్యుల లోను, ప్రజలలోను పలుకుబడి గల వాడవటం వలన, వెంటనే ఆయనపై చేయి జేసుకోనటం మంచిదికాదని ఊరుకున్నారు.

...

అయితే, షావో చున్ ధైర్యసాహసాలు వారికి ఇంచు మించు గాభరా పుట్టించినవి. పునరుద్ధరణ ప్రయత్నాల సమయంలోనే మరొకవంక వారు జరుపుతున్న 'అధ్యయన గోష్ఠులకు' హాజరవటానికి ఆయన నిరాకరించాడు. పైగా 'అడవికలువ' గ్రంథాన్ని గురించి స్వాభిప్రాయాన్ని నిర్భ

యంగా ప్రకటించటానికి కూడా సాహసించాడు: "విమర్శించేటప్పుడు రచయిత నిర్దాక్షిణ్యంగానే ఉండాలి. కాని, వీలైనంత వరకు, న్యాయంగా ఉంటటానికి కూడా ప్రయత్నించాలి. 'సన్మార్గాన్ని వదిలిపెట్టకుండా ధర్మయుద్ధం సాగించట' మంటే ఇదే. వాదవివరణకు, నచ్చజెప్పటానికి ఎక్కువ కాలం వినియోగించి, ఒత్తిడిని, దౌర్జన్యధోరణిని తగ్గించాలి," అని ఆయన వ్రాశాడు.

అమితావేశం కనిపించని ఈ విమర్శ కమ్యూనిస్టు వర్గాలకు రుచింపలేదు. ముఖ్యంగా, పార్టీ సభ్యులలో కలుపుతీత ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న సమయంలో ఇది వారు అసలే సహించలేక పోయారు. పైగా, కళా సాహిత్యాలను గురించి మా సేటుంగ్ ప్రతిపాదించిన సిద్ధాంతాలనుకూడా ఆయన ఆమోదించలేదు. తన గురువు ల్యూసున్ సూక్తులను ఉటంకించి, వాటిని ఖండించాడు: "కళ, సాహిత్యం, రాజకీయాలు తరచుగా పరస్పర సంఘర్షణకు గురి అవుతున్నవి.... రాజకీయాలు తమ మార్గాన్ని సమర్థించుకొనగోరుతున్నందువల్ల, కళా, సాహిత్యాలు మరొకమార్గం పట్టటం చూచి సహించలేక పోవటం సహజం"

ఆయన ఆహుతికి ఇంతకన్న కారణం ఏంకావాలి? అయినా అప్పటికీ కమ్యూనిస్టులకు ఆయన అవసరంఉంది. జపాన్‌తో యుద్ధం ముగిసిపోయిన తరువాత, ఈశాన్య

చైనాలో తమ బలాలు నిలదొక్కుకొనటానికి బహుశః ఆయనపలుకుబడి ఉపయోగపడవచ్చు. అక్కడ వారు బల వంతంగా స్వాధీనంచేసుకున్న ముద్రణయంత్రాలయాన్ని ఆయనకు అప్పగించి, హాంకాంగ్‌నుండి "కల్చరల్‌న్యూస్" పత్రిక నడపటానికి కూడా సాయంచేశారు. కాని, షావోచున్ లంచాలకుగాని, బెదిరింపులకుగాని లొంగిపోయే మనిషికాదు; ఆయన విమర్శనల ధోరణిలో మార్పులేదు. అంతర్యుద్ధాన్ని ఇంకా సాగించటం తప్పని కూడా ఆయన ఖండించాడు. "చైనా ప్రజల రక్తం ఎడతెగని ఏరులై పారుతూంది. ఇది దారుణం. కూరను ఉడకబెట్టటానికి ఆ కూరచెట్టుకాడలనే తగలబెట్టటం—ఎవరినైనా భయకంపితులను చేస్తుంది," అని ఆయన విమర్శించాడు.

కమ్యూనిస్టులు భూసంస్కరణాలను సాగిస్తూన్న విధానాలను కూడా ఆయన తీవ్రంగా విమర్శించాడు. "ఇది ఎన్నడు కని విని ఎరుగని దోపిడీ విధానం. లీ చీ-చెంగ్, చాంగ్ సీన్-చాంగ్‌లాంటి చండశాసనులు కూడా ఇలాంటి అపరాధం తలపెట్ట లేదు. మంచూలు, జపాన్ దేశీయులు అన్యజాతీయులు. అయినా, వారుకూడా ఈపని చేయటానికి సాహసించలేక పోయారు. కమ్యూనిస్టులు అంతదూరం ఎందుకు వెళ్ళాలో, అంత గుండెలు తీసినబంట్లుగా ఎందుకు ప్రవర్తించాలో నాకు అర్థం కావటంలేదు;" అని ఆయన వ్రాశాడు.

'రాజకీయాలు విద్యావిధానం' అనే వ్యాసంలో ఆయన ఇలా వ్రాశాడు: "హాస్యగాని రాజ్యంలో యాంత్రిక మైన ఐక్యానికి మాత్రమే ఆస్కారం ఉంటుంది. తత్పర్యవసానంగా, ప్రజల నైతిక ప్రవృత్తిని, సృజనాత్మకమైన ప్రతిభను నిర్లక్ష్యం చేయటం, ధ్వంసం చేయటం సంభవిస్తుంది."

కమ్యూనిస్టులు ఆయనను హేతు వాదంతో ఓడిద్దామని మొదట ప్రయత్నించారు. కాని, వారి అనుయాయులైన భోలారచయితలు ఆయన ముందు దివిటీ ముందు దీపాలయ్యారు. అందువల్ల, వారు ఇతర మార్గాలు అవలంబించ వలసి వచ్చింది. "షావో సాహిత్య కృషికి చేస్తున్న ఆర్థిక సహాయాన్ని" వెంటనే ఆపివేయాలంటూ చైనా కమ్యూనిస్టుల ఈశాన్య సమితి తీర్మానించింది. కాని, అసలు షావోచున్ ఏడి? మరణించినవారు మరలివచ్చి తమ యోగక్షేమాలను, మనకు తెలుపలేరు గద!

ఈ కలుపుతీత – చైనా పరిభాషలో ఈ భావనా సంస్కరణ – కమ్యూనిస్టులు ఇంకా చైనా నడిగడ్డ నంతా స్వాధీనం చేసుకొనటానికి పూర్వమే జరిగింది. అప్పటికి చైనా జాతీయ ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి ఆ ప్రాంతంలోని తోడి రచయితల సహకారం కమ్యూనిస్టులకు అవసరం కనుక, వారిని బెదరగొట్టటం మంచిది. కాదన్న

భావం ఈ ఉద్యమదారుణతను కొంత పరిమితం చేసింది. అందువల్ల, అప్పుడు కేవలం స్వతంత్ర భావాలు గల చిహ్నాలు స్పష్టంగా కనిపించినవారు, తీవ్ర విమర్శలు చేసినవారు మాత్రమే ఇట్టి దండనలకు గురి అయారు. చైనా నడిగడ్డ కూడా చేజిక్కిన తరువాత, ఈ విధమైన సంకోచాలేవీ లేకపోయినవి. అందువల్ల, ఆపైనసాగిన శిక్షాకాండ నిర్దాక్షిణ్యంగా, అమానుషంగా సాగింది. ఈ శిక్షలకు గురి అయినవారు కమ్యూనిస్టులు కానివారు, ప్రాచీన సాంఘిక వ్యవస్థను పట్టుకొని ప్రాకులాడేవారు, ముఖ్యంగా అంతవరకు కమ్యూనిస్టులతో సహకరిస్తున్నా, తమకు ఏవో కొన్ని అభిప్రాయ భేదాలు ఉన్నాయనేవారు. కమ్యూనిస్టులు అధికారం చేజిక్కించుకునేటంత వరకే ఈ అభిప్రాయ భేదాలను సహించగలరు. అధికారం చేతికి వచ్చిన తరువాత, అంతవరకు మిత్రులుగాఎంచినవారికీ, శత్రువులుగా పరిగణించినవారికీ కూడా ఒకే పంక్తిలో ఒడ్డిస్తారు.

ఈ శిక్షాకండలో ప్రథమదశ 1951 ఆఖరున ప్రారంభమయి 1952 జూలైతో అంతమయింది. దీనిని మావోసేటుంగే స్వయంగా నడిపాడు. చైనా కమ్యూనిస్టులు సానుభూతి పరులైన రచయితలను, సంశయాస్పదులైన మిత్రులను ముందు ముందు తాము స్వాధీనం చేసుకొనగోరే ప్రాంతాలకు పంపి, వారిని అక్కడ వినియోగిస్తూ వచ్చారు. మరల, ఈ శిక్షాకాండ ప్రథమ దశ ముగిసిన వెనువెంటనే

కూడా ఇదే జరిగింది. 1952 జూలై 31 వ తేదీ సంచికలో పీకింగ్ పత్రిక 'జెన్ మిన్ జీ పావో' ప్రకటించిన ప్రకారం చాలామంది రచయితలను "పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొనే నిమిత్తం" ఉత్తరకొరియాకు పంపారు. సాహిత్యకళా మండలుల సమ్మేళనానికి చెందిన పాచిన్, సంగీతసంఘానికి చెందిన ఫీకే మొదలైన వారుకూడా వీరిలో ఉన్నారు. ఇంకా చాలామంది రచయితలను, "సామాన్య ప్రజానీకంతో కలసిమెలసి జీవిస్తూ, వారి పోరాటాల్లో పాల్గొనే నిమిత్తం" ఫ్యాక్టరీలకు, పల్లె పట్టులకు పంపారు.

కమ్యూనిస్టులు వాడే మాటలకు ప్రత్యేకంగా విలక్షణమైన అర్థాలు ఉంటాయి. సామాన్య భాషలో చెపితే ఇదీకూడా ఒక రకమైన కలుషితీత ఉద్యమం. మొదట వారు సృజనాత్మకంగా కళారాధన చేసుకోనటానికి ఏమాత్రం అవకాశం లేకుండా చేయటం, తరువాత వారి స్వరూపాలనే అంతర్హితం చేయటం. ఈ విధంగా "ప్రజల పోరాటా"ల్లో పాల్గొనటానికి పంపబడినవారు ఇంచుమించు అందరూ తమ సాహిత్య, కళాజీవితాలను బలవంతంగా పరిత్యజించవలసి వచ్చింది. వారాపైన శత్రు శతఘ్నులకు ఆహుతులుగానో, ఫ్యాక్టరీలలోను, "ప్రజల వ్యవసాయ క్షేత్రాల"లోను వెట్టిపనివారుగానో మాత్రమే ఉపయోగపడగలరు.

అధికార పరిభాషలో "పునరుజ్జీవనోద్యమా" లన బడే ఈ శిక్షా కాండలు మరికొంత వివరంగా పరిశీలింప దగినవి. ఈ పనికి పూనుకొనటానికి పూర్వం, ముందుగా ఈ వుద్యమాలకు ముందు జరిగిన ఒక సంఘటనను గురించి సంగ్రహంగా తెలుసుకొని ఉండటం అవసరం. ఇది "వూ సున్ జీవిత చరిత్ర" అనే చలన చిత్రానికి గురించిన గాథ.

ఈచిత్రాన్ని షాంగైలోని ఒక సినిమా స్టూడియోలో నిర్మించారు. ఆ నగరం పూర్తిగా కమ్యూనిస్టుల వశమవటానికి ఒక సంవత్సరం ముందే ఈ చిత్ర నిర్మాణ కలాపం ప్రారంభమయింది. బిచ్చమెత్తుకుంటూ భాగ్యవంతుడై, అనంతరం తన ఐశ్వర్యాన్ని పాఠశాలల స్థాపనకు వినియోగించిన "వూ సున్" జీవితమే ఆ చిత్రంలోని కథ. ఒక సామాన్య మానవుని, కార్మిక వర్గానికి చెందిన వ్యక్తిని, ఆతని ప్రజాసేవానురక్తిని ప్రస్తుతించటమే ఈ కథలో ప్రధానాంశం అని తెలుస్తూనే ఉంది.

చిత్ర నిర్మాణం ఏవిధమైన అవాంతరాలు లేకుండా సాగింది. పూర్తికాగానే, ఆ స్టూడియోవారు కమ్యూనిస్టుల సాంస్కృతిక సంస్థల నాయకులందరినీ పిలిచి ఆ చిత్రంలో మంచి చెడ్డలను గురించిన చర్చ ఏర్పాటు చేశారు. ఈ ఆహూతులలో యూ లింగ్ కూడా వున్నాడు. ఆగోష్ఠిలో వాసు సూచించిన ప్రకారం అనంతరం ఆ చిత్రాన్ని సవ

రించారు. తత్ఫలితంగా ఆ చిత్రం ప్రదర్శన యోగ్యమని అధికారముద్ర పొందింది.

కొంతకాలంపాటు ఆ చిత్రం నిరాఘాటంగా ప్రదర్శింపబడింది. ప్రజలు, వారితోపాటు కమ్యూనిస్టుల సాంస్కృతిక నియంతలు కూడా ఆ చిత్రాన్ని విశేషంగా ప్రశంశించారు. కాని, అంతలో అకస్మాత్తుగా ఆ చిత్రానికికాలం మూడింది. వెనక, ఆ చిత్రంపైన ఆమోదముద్రవేసి, దానిని విశేషంగా పొగడిన అధికారులే, పీకింగ్‌లోని కేంద్ర అధికారవర్గం ఆదేశాల ననుసరించి ఆ చిత్రం అభివృద్ధి నిరోధకమైనదని ప్రకటించారు. ఇప్పుడు వూ సున్ బిచ్చగాడుకాదు. "నూటికి నూరు పాళ్ళు దొంగ, మోసకారి భూస్వాములవర్గ శ్రేయస్సును పరిరక్షింపగోరే పెద్ద భూస్వామి." ఈచిత్రాన్ని చూసిన, లేక దానిని ప్రశంసిస్తూ వ్రాసిన వ్యాసాలను చదివిన కమ్యూనిస్టుపార్టీ సభ్యులందరు, సిద్ధాంతాలకు రాజకీయాలకు సంబంధించిన ఈ ప్రధానాంశంమీద తమ అభిప్రాయాలను వివరించాలి," అంటూ 1951 మే నెలలో "జెన్ మిన్ జీ పావో" పత్రిక ఆదేశించింది. ఇది సామాన్య పత్రికా విమర్శకాదు. "వెంటనే మేలుకొని తమంత తాముగా ఇట్టి దుష్టసిద్ధాంతాలను ప్రతిఘటించాలి," అంటూ పార్టీ సభ్యులందరికీ తాఖీదులు వెళ్ళినవి. ఒకవేళ వారే లోగడ వూ సున్‌ని ప్రశంసించటమనే పొరపాటు చేసిఉంటే, అట్టి

త్వారందరు వెంటనే బహిరంగంగా ఆత్మవిమర్శకు, ఆత్మ పరీక్షకు పూనుకోవాలి" అనికూడా హెచ్చరించారు.

దాంతో, దేశమంతటా విమర్శలు, ఆత్మవిమర్శలు తామర తంపరగా బయలుదేరినవి. అంతా ఆ చిత్రాన్ని ఖండించేవారే. లోగడ ఆ చిత్రాన్ని ప్రశంసించినవారు ఇప్పుడు తమవిమర్శనా సామర్థ్యాన్ని విమర్శించుకోవలసి వచ్చింది. ఇదంతా వారు "తమంతతాముగా" చెయ్యాలి. ఈ ఆత్మ విమర్శాకాండ ఆ స్టూడియోకు కూడా తప్పలేదు: ఆ స్టూడియో యాజమాన్యం "ప్రభుత్వానికి అప్పగించ" దలచుకొన్నట్టు ఆ నెల 24 న ఆస్టూడియో యజమానులు తమంతతాముగా నిరభిమానులై ప్రకటించారు.

ఆ చిత్రంలో పీకింగ్ అధికారులకు విశేషంగా చిరాకు కలిగించిన విషయం, వూ సున్‌కీ, చాన్ టా అనే మరొక పాత్రకు జరిగిన ఈ దిగువ సంభాషణ అవటం కూడా గమనించ దగ్గ విషయం.

చాన్ టా! "ఇలాంటి ప్రపంచంలో బ్రతకట మెల్లగా అని ? మనకు ఒక్కటే మార్గంఉంది : చంపడం."

వూ సున్ : "చంపటమా ?......" దాని వల్ల పెద్ద ప్రయోజనం ఏముంది ?"

ఈ సంఘటన సినిమాస్టూడియోలను ప్రభుత్వ పరం చేసుకునే ఉద్యమానికి నాంది: అయితే. 1951 నవంబరు

17 న ప్రారంభమైన పునరుజ్జీవన మనే ప్రధాన శిక్షా కాండకు, ఈ సంఘటనకు సంబంధం లేదు.

చైనా ప్రజా రాజకీయ మంత్రాంగ మహాసభ తాలూకు జాతీయ సంఘ తృతీయ సమావేశంలో మా సే టుంగ్ చేసిన ప్రసంగంలో ఆయన "భావనా సంస్కరణ"ను గురించిన హెచ్చరిక చేశాడు. వెంటనే, అఖిల చైనా సాహిత్యకళా సంస్థల సమాఖ్య వారు తమ విస్తృత స్థాయీ సంఘ సమావేశ మొకటి 1951 నవంబరు 17 న ఏర్పాటు చేశారు. ముందుగా పీకింగ్ సాహిత్య కళావర్గాలలో ఈ పునరుజ్జీవనోద్యమ విచారణ పరిశీలనలను ఏర్పాటు చెయ్యాలనీ, అనంతరం ఆ విధంగా దేశమంతటా ఈ ఉద్యమాన్ని సాగించాలనీ ఆ సమావేశంలో తీర్మానించారు. సాహిత్య కళారంగాలలో అనుచిత భావాలు ప్రబలటానికి ప్రధాన కారణాలు: సిద్ధాంతాల ప్రాముఖ్యాన్ని అలక్ష్యం చేయటం, రాజకీయాలనుండి, ప్రజల భావాలనుండి వైదొలగటం, పెట్టుబడి దారుల పట్లను దిగువమధ్య తరగతి వారి పట్లను సానుభూతి చూపటమూ అని ఆ సమావేశంలో సభ్యులందరు ఏకగ్రీవంగా అభిప్రాయ పడ్డారు. "ఈ పరిస్థితుల ఒత్తిడి వల్లనే ఈ పునరుజ్జీవనోద్యమం అవసరమయింది," అని ఆ స్వచ్ఛంద శిక్షా స్మృతిలో వివరించారు.

నవంబరు 24 న ఈ ఉద్యమం ప్రారంభమయింది. ఆనాడు పీకింగ్‌లో ప్రథమ విచారణ సభ జరిగింది. చైనా

కమ్యూనిస్టు పార్టీ కేంద్రసంస్థ తాలూకు ప్రచురణ శాఖ ఉపమంత్రి హ్యూ చియావో మ్యూ ఆ సమావేశంలో ప్రథమ వక్త. ఆ విచారణ పరిశీలనా సభ వాస్తవ స్వరూపాన్ని, ప్రాధాన్యాన్ని వివరిస్తూ ఆనాడాయన సభ్యులకు ఇచ్చిన ఆదేశం ఇది:

"1. ఈ విచారణా పరిశీలనకార్యక్రమం విసురుగా కొనసాగించటానికి, సదసద్వివేచన చేసి తమ నిశ్చితాభిప్రాయాలను స్పష్టం చేయటానికి పరస్పర విమర్శ, ఆత్మ విమర్శ అనే ఆయుధాలను విరివిగా వాడాలి."

"2. కళా సాహిత్యాలకు సంబంధించిన మార్క్సిస్టు సిద్ధాంతాలను విస్తృతంగా ప్రచారం చెయ్యాలి. ఆవిధంగా కళలు, సాహిత్యం కార్మికవర్గపు ఆయుధాలుగా తయారు చెయ్యాలి."

"3. సృజనాత్మక రచనల లోను, విమర్శల లోను అధికారాదేశానుసరణను ఇంకా ముమ్మరం చేయాలి."

"4. రచయితలు, కళాకారులు యోగ్యమైన రచనలు చేసేట్టు కట్టుదిట్టం చెయ్యాలి. ఇతర వృత్తులలోని కార్మికుల వలెనే రచయితలు, కళాకారులు కార్మిక క్రమశిక్షణకు లోబడి ఉండి, ప్రజలకు ఉపయోగకరమైన విధంగా కష్టపడి పనిచేసేటట్టు చేయాలి....."

(ఈ ఆదేశాలను పీకింగ్‌లోని జెన్ మిన్ జీపావో పత్రిక 1951 డిసెంబరు 1 వ తేదీ సంచికలో ప్రకటించింది.)

ఈ ప్రథమోపన్యాసానంతరం, అఖిలచైనా కళా సాహిత్యమండలుల సమాఖ్య ఉపాధ్యక్షుడు శ్రీచౌ యాంగ్ ఒక నివేదిక చదివి వినిపించాడు:

"...పెట్టుబడి దారులవర్గం సాంస్కృతిక సమరానికి నాయకత్వం వహించడానికి తన అసమర్థతను స్వయంగా రుజువుచేసుకుంది. దిగువ మధ్యతరగతి రచయితలకు విశేషమైన పలుకుబడి ఉండటం దురదృష్టకరం. రాజకీయ రంగంలో వారికి విప్లవవాదంపట్ల సానుభూతిఉంది. కాని, భావనాసంస్కరణకు లోనవటానికి ముందు, వారికళా విధానాలు, దృక్పథాలు పెట్టుబడిదారులవర్గంవైపు మొగ్గు చూపుతున్నట్టు కనిపిస్తూండేవి.

"అయితే, ఇటీవలివరకు పెట్టుబడిదారీ వర్గానికీ దిగువ మధ్యతరగతికి ప్రభుత్వంలో మంచిపలుకుబడి వుండేది. పైగా, ఆర్థిక వ్యవస్థలో వ్యక్తిగతమైన పెట్టుబడి దారులకు, చిన్న ఉత్పత్తిదారుల వ్యక్తిగత వ్యాపారాలకు అవకాశం ఉండేది. ఈ రెండు కారణాలవల్ల పెట్టుబడిదారుల సిద్ధాంతాలకు, దిగువ మధ్యతరగతివారి భావాలకు సాంఘిక వ్యవస్థలో కొంతప్రాధాన్యం ఉంటూనేఉంది. కనుక, ఈసిద్ధాంతాలఅస్తిత్వాన్ని గురించి హెచ్చరించటం,..ఇందుకు సర్వరంగాలలో

"విప్లవవిధానాలను" వినియోగించటం అవసరం. కాబట్టి, కార్మికవర్గ సిద్ధాంతాలకు, పెట్టుబడిదారుల సిద్ధాంతాలకు-ముఖ్యంగా దిగువమధ్యతరగతి వారి భావాలకు గల విభేదాలను, ఎల్లలను స్పష్టంగా గుర్తించటానికి మనమధ్యనే వున్న వారి సిద్ధాంతాలను అభ్యుదయ సిద్ధాంతాలతో ఓడించటానికి ప్రయత్నించాలి."

"పరస్పర విమర్శ, ఆత్మవిమర్శ అనే ఆయుధాలను" విరివిగా వాడాలని సాహిత్యాన్ని, కళలను కార్మికవర్గపు ఆయుధాలుగా రూపొందించాలనీ హ్యూ చియావో మ్యూ ఇచ్చిన ఉత్తరువు కమ్యూనిస్టుల విలక్షణ పరిభాష అనుకుంటే అనుకోవచ్చు. కాని, "సృజనాత్మకరచనలలోను, విమర్శలలోను అధికారుల ఆదేశానుసరణను ఇంకా ముమ్మరం చెయ్యా"లని, "ఇతరవృత్తులలోని కార్మికుల వలెనే, రచయితలు, కళాకారులుకూడా కార్మిక క్రమశిక్షణకు లోబడిఉండే టట్టుచెయ్యా"లని ఆదేశించటంలో మాత్రం సామాన్య దురాలోచనను మించిన అర్థంవుంది.

అధికారాదేశానుసరణం అప్పటికే సాగుతూ ఉండటంవలన, దానిని ఇంకా ముమ్మరం చేయటమంటే కొత్తగా పార్టీనిరంకుశత్వాన్ని ఇంకా విస్తృతంగా సర్వవ్యాప్తంగా చేయాలని అర్థం. నాటినుండి రచయితలు, కళాకారులు ఫ్యాక్టరీలలోను, వ్యవసాయ క్షేత్రాలలోను

పనిచేసే కార్మికులతోపాటు "క్రమశిక్షణకు" లోబడి, అందులో లోపం వచ్చినప్పుడు వారనుభవించే శిక్షలన్నీ అనుభవించవలసి వచ్చింది. క్రమశిక్షణను అతిక్రమించిన వారిని, తలబిరుసుతనం గలవారిని శిక్షించేపద్ధతి అనేక విధాలుగా ఉండవచ్చునని తరువాత జరిగిన సంఘటనలవల్ల మనకు తెలుస్తూంది. వారిని "వాలంటీర్లు" గా కొరియాలో యుద్ధరంగానికి పంపవచ్చు. సక్రమవాతావరణంలో క్రమశిక్షణను అలవరచుకొనటానికిగాను మారుమూలల వున్న ఫాక్టరీలకో వ్యావసాయక్షేత్రాలకో పంపవచ్చు.

కనుక, ఇప్పుడు క్రమశిక్షణ అలవరచుకొనటంలో రచయితలవంతు వచ్చింది. ఈ రచయితలెవరు? దిగువ మధ్యతరగతికి చెందినవారు. సామాన్యంగా ఆసియాఖండ దేశాలలో రచయితలంతా ఈ తరగతికి చెందినవారే. అంతే కాదు రాజకీయరంగంలో "విప్లవంపట్ల సానుభూతి" గలవారైనప్పటికీ, "మనస్తత్వంలోను, కళాశైలిలోను పెట్టుబడిదారుల వర్గం వంకకు మొగ్గుచూపేవారు" కూడా ఇందులో వున్నారు. ఈవిధంగా వారి పూర్వమిత్రులకు తగిన శిక్షాక్రమం రూపొందింద. "విప్లవవిధానాల"ను అవలంబించాలని ఆయన నొక్కి చెప్పటంలో తాత్పర్యం-వారిని నిర్దాక్షిణ్యంగా పూర్తిగా తుడిచిపెట్టాలని.

ఈ మహానాయకులిద్దరూ మాట్లాడిన తరువాత, శ్రీమతి టెంగ్ లింగ్ ముందుకువచ్చి విమర్శ, ఆత్మవిమర్శల

కలాపానికి అంకురార్పణ చేసింది. ఆనాటి సాహిత్యప్రచురణ లను గురించి ఆమె ఒక నివేదిక చదివింది. అనంతరం మరి కొందరు తమ నివేదికలు, సమీక్షలు చదివారు. చివరకు, "కళా, సాహిత్యమండలుల విచారణ సంఘం" ఒకటి ఏర్పాటుచేశారు. ఆ సంఘాధ్యక్షురాలుగా లింగ్‌ని ఎన్నుకున్నారు ఆ సంఘంలో మావో టున్, చౌ యాంగ్‌లతో సహా మొత్తం 20 మంది సభ్యులుగా నియమితులైనారు. ఈ సంఘంవారు తమవిచారణకు ఈ దిగువ రచనలను ప్రమాణంగా పెట్టుకోవా లన్నారు. మావో సేటుంగ్ "యెనాన్ సభలోచేసిన ఉపన్యాసాలు"; "యథాస్థితి వాదాన్ని" గురించీ, "ఉదారవాదానికి ప్రతిఘటన" అనే విషయాలపైనా ఆయనవ్రాసిన వ్యాసాలు; రష్యాలో అఖిల కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసుసమ్మేళనం వారు కళాసాహిత్యాల నియమనమును గురించి చేసిన నాలుగు తీర్మానాలతోసహా కొన్ని రష్యన్ గ్రంథాలు; "వూ సున్ జీవితచరిత్ర చలన చిత్రాన్నిగురించిన చర్యను మనం శ్రద్ధగా జ్ఞాపకముంచుకోవాలి" అనే శీర్షిక క్రింద పీపుల్సుడెయిలీ పత్రిక వ్రాసిన సంపాదకీయం.

ఆ సమావేశంలో చేసిన నియమాల ననుసరించి, విచారణ సభలకు అంతా తప్పకుండా హాజరయి, తమ వంతు పత్రాలను చదివిన తరువాత - విమర్శకు, ఆత్మ విమర్శకు, ఒండొరుల భావాలను, సిద్ధాంతాలను, ప్రవర్తనను

పరీక్షించి, సంస్కరణకు, అభ్యుదయ సాధనకు అనుసరించ వలసిన విధానాలను గురించి చర్చించాలి.

1952 జనవరి నాటికి ఈ పరిశీలనా సమావేశం "భావ పరీక్షా" దశకు వచ్చింది. వాటిలో పాల్గొనే వారంకరు తాము లోగడ చేసిన తప్పులను ఒప్పుకొనడానికి సంసిద్ధులు. చైనాలో రచయితలకు ప్రాప్తించిన సంస్కరణ స్వభావ స్వరూపాలు విలక్షణమైన ఈ దిగువ ఆత్మవిమర్శవలన మనకు స్పష్టంగా బోధపడతాయి. ఇది సుప్రసిద్ధ నాటక రచయిత సాన్ యూ ప్రకటించిన దీర్ఘమైన ఆత్మవిమర్శ లోని ఒక భాగం:

"కార్మిక జన బాహుళ్యంతోగాని, కర్షక జన బాహుళ్యంతోగాని, సైనికజనబాహుళ్యంతోగాని మార్క్స లెనిన్ సిద్ధాంతాలతోగాని నాకు పరిచయంలేదు. లోగడ నేను చేసిన రచనలలో మంచి చెడుగులను గురించి నా పరాతీత భావాలు లోతుగా వేళ్ళూదన్ని ఉన్నవి. కొన్నిచోట్ల అవి కనిపిస్తవి. కొన్నిచోట్ల కనిపించవు. కొన్ని సందర్భాలలో ఆ భావాలు అతిగాఢంగా, ప్రస్ఫుటంగా వ్యక్త మవుతవి. ప్రాచీన సాంఘిక వ్యవస్థ వివేకరహితమైనదనీ, మానవుల హక్కులను నేలరాచిన రక్తపాతకలుషితమైన సంఘటనలనాన్న, పెట్టుబడిదారీ పద్ధతితో భూస్వామ్య పాలనా విధానమును కూలద్రోయటమనాన్న నాకు అసహ్యా

మనీ నేను అంటూ వుండేవాణ్ణి. అయితే, వర్గ పరిమితులను పరిగణింపని మానవ సౌశీల్య సిద్ధాంతాన్ని నేను అనుసరిస్తూ వచ్చాను. అట్టి సాంఘిక వ్యవస్థలో మానవ ప్రవర్తన మొత్తముమీద నిర్దుష్టంగానే వుంటుందని నేను విశ్వసించే వాణ్ణి".

"ఒకప్పుడు నేను హువాయినదీ ప్రాంతానికివెళ్ళి, అచటి భూసంస్కరణ కార్యక్రమాలలో పాల్గొన్నాను. ఆ స్వల్పకాలంలో నేను కొన్ని తప్పులు చేశాను. అయితే ప్రజలతోడ్పాటుతో సకాలంలో నేను వాటిని సరిదిద్దుకొన గలగటం నా అదృష్టం. కాని అటు పిమ్మట నేను ప్రచురించిన రచనలేమీ లేవు."

(జెన్ మిన్ జీ పావో 1952 మే 24)

ప్రజల సహకారంతో తాను తన తప్పులను సరిదిద్దు కున్నట్టు, తరువాత తానే మీ ప్రకటింపనట్టు ఆయన వెల్లడించటం వలన, ఉప మంత్రి హ్యూ చి యావో మ్యా చేసిన ప్రసంగంలో తెలిపిన కార్యక్రమ శిక్షణను తనపైన ఇంకా తీవ్రంగా అమలు జరిపించుకొనటానికి తగినపాత్రతను మాత్రం ఆయన సంపాదించుకొన్నాడు.

ఈ సంస్కరణ కార్యక్రమం ముమ్మరంగా సాగుతూన్న రోజులలోనే కమ్యూనిస్టులు తద్విరుద్ధభావాలు గలవారిని అణచటానికి "త్రివిధ విరోధి ఉద్యమం" ప్రారం

భించారు. అట్టివారిని బహిష్కరించటం, భయపెట్టటం ఈ ఉద్యమ ప్రధానలక్ష్యాలు. ఈ ఉద్యమం భావసంస్కరణోద్యమ తీవ్రతను ఇంకా ఉధృతం చేసింది. ఈ ఉద్యమ విస్తృతిని గురించి తెలుసుకోనటానికి కమ్యూనిస్టు గ్రంథకర్త మావో టున్ వివరణ ఉపకరిస్తుంది.

"సాహిత్య కళావర్గాలకు చెందిన మొత్తం పదిహేను వేలమంది ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ఉద్యమం ఘన ఫలితాలను సాధించింది. ఈ ఉద్యమ ఫలితంగా సాహిత్య కళాకార్మికులు మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి భావాలను సమూలంగా విశదం చేయగలిగారు. కళాసాహిత్యాలను గురించిన తమభావాలలో గల అసందర్భాలను స్పష్టంగా తెలుసుకొని, సృజనాత్మక కర్మపట్ల తమదృక్పథాలను సవరించుకో గలిగారు." దీనినే కమ్యూనిస్టులు కానివారి పరిభాషలో చెప్పాలంటే, 15,000 మంది రచయితలు, కళాకారులు పూర్వాభిప్రాయాలకు, సంప్రదాయానికి తిలోదకాలివ్వావలసి వచ్చినదన్నమాట.

ఈ అభిప్రాయ సంస్కరణకు యోగ్యమైన మనస్తత్వాలు లేనివారుగా నిర్ణయింపబడిన వారందరినీ కొరియాలో యుద్ధరంగానికిగాని, మారుమూల ఫాక్టరీలలోనో, వ్యవసాయ క్షేత్రాలలోనో పనిచేయటానికిగాని పంపారని లోగడ మనం తెలుసుకున్నాం.

ఈ భావసంస్కరణోద్యమాలు ఇంతగా విజయవంత మయినా, పరిపాలకులు ఆశించిన ఫలితాలను పూర్తిగా సాధింపలేక పోయినట్టు కనిపిస్తుంది. భావవీథులలో విహరించే వారు ఇంకా కొంతమంది మిగిలే ఉన్నారంటూ, పీకింగ్ విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్రాచార్యుడయిన శ్రీ చెంగ్ సిన్ 1954 మార్చి 24 వ తేదీగల క్వాంగ్ మింగ్ పత్రికలో వ్రాశాడు. వారి భావాలను ఇంకా పూర్తిగా సంస్కరించటం జరగలేదంటూ ఆయన ఇలా వ్రాశాడు:

"దేశవిమోచనానంతరం, బలవత్తరమైన వాస్తవిక పరిస్థితులవలన, వారికి రాజకీయ ప్రబోధం కలిగింది. అయితే, బహుసంవత్సరాల కృషిఫలితంగా లభించిన పాండిత్యాలను మాత్రం వారు పరిత్యజింపలేకపోతున్నారు. పూర్వపు రాజకీయాభిప్రాయాలను వదలుకొనటానికి అవసరమైన సాహసం కూడా వారిలో లోపంగానే వుంది."

తత్వ శాస్త్రాచార్యు డనిపించుకునే పెద్దమనిషి ఈ విధంగా వ్రాయటం చిత్రంగానే వుంది. ముఖ్యంగా, ప్రాచీన చైనాలో ఉన్నత పాండితీ ప్రమాణాలు, విద్వాంసుల పట్ల అత్యధిక గౌరవ ప్రతి పత్తులుగల అచటి సంప్రదాయాలు తెలిసిన వారికి ఇది మరీ ఆశ్చర్యకరంగా వుంటుంది. కాని, అట్టి ప్రకటనల వెనుక ఎట్టి నిర్బంధాలు, ఒత్తిడులు పనిచేసేది మనకు తెలుసు గనుక, అంత ఆశ్చర్య పడవలసిన అవ

సరం లేదు. వైపరీత్యాలే సామాన్యమైనప్పుడు, సామాన్య స్థితే అత్యాశ్చర్యంగా కనిపిస్తుంది. నవచైనాలో కళా విద్యా జీవనరంగంలో సంఘటిల్లిన పాశవిక పరిణామం, ఆరంగం యావత్తు క్రూరాతిక్రూరమైన చిత్త చాపల్యాలకు ఆలవాలమైన ఆ దేశపు రాజకీయాలకు దాసోహ మనటం.

"ప్రాచీన, అభ్యుదయ నిరోధక" చైనాలో పండితుల స్థితి ఎంత గౌరవనీయంగా ఉండేదో ఒక ప్రాచీన చైనా సామెతవల్ల బోధపడుతుంది. "అన్ని వృత్తులు అల్పమైనవే, పండితులే పరమ పావనులు", అని ఆ సామెతఅర్థం. ఆ రోజులలో విద్యాభ్యాసానికి లక్ష్యం కేవలం విజ్ఞానమే. పాండిత్యం పరమ పూజనీయంగా ఉండేది. జ్ఞాన జగత్తులో సత్యాతిరిక్తమైన సౌభాగ్యం లేదు అన్ననాటి సామాన్య విశ్వాసమే దీనికి కారణం. అయితే, జ్ఞానం కోసమే జ్ఞానమనీ, సత్యమే పరమార్థం అనీ విశ్వసించే సంప్రదాయం కమ్యూనిస్టు పాలకులకు హితవుగా కనిపించలేదు. సాహిత్యంలోను, తత్వశాస్త్రంలోను కూడా పార్టీవిధానం అనుసరణీయమనే తమ విశ్వాసం యొక్క మూల సిద్ధాంతానికే ఈ సంప్రదాయంలో వైరుధ్యం కనిపిస్తుంది. ఈ విశ్వాసం రష్యా రాజకీయ విజ్ఞాన కోశం నుండి దిగుమతి అయినది. "తత్వ శాస్త్రగత పార్టీ తత్వానికి, సత్యవాదిత్వసిద్ధాంతానికి పొత్తు కుదరదు." అని ఆ నిఘంటువులో నిర్వచించారు. తరు

వాత పూజ్యాతి పూజ్యుడైన మూల విరాట్ లెలిన్ చెప్పిన ఈ దిగువ సూక్తిని కూడా అందులో ఉటంకించారు: నిర్దిష్టమైన ఒక సాంఘిక కూటమి యొక్క దృక్పథానికి అనుగుణంగా సర్వ విషయాలను బహిరంగంగా, నిర్మొహమాటంగా చర్చించటానికి పార్టీ తత్వం అంగీకరిస్తుంది.''

ఒకవంక ప్రత్యక్ష సత్యనిష్ఠ, మరొకవంక దానిని పూర్తిగా నిరసించటం నిరాక్షేపణగా సాగుతూ ఉండాలంటే సాధ్యం కాదుగద! పైగా, ఇప్పుడు కమ్యూనిస్టులు చైనా అంతటికీ పాలకు లయారుగనుక, వెనకటి విద్వాంసుల నందరినీ అవమానించటానికి, హతమార్చటానికి వీలయింది. ఈ బాధ్యతను వారు మన దృష్టిలో అమాయికులైన యువకులకు అప్పగించటంలో కూడా ఆశ్చర్యపడవలసిన దేమీ లేదు. "పూర్వవాసనల బరువులేవీ తలలో లేని యువకులే విప్లవ కార్యక్రమాన్ని విసురుగా కొనసాగించగలరు" అని స్టాలిన్ కమ్యూనిస్టులకు నూరిపోశాడు.

"అరుణ భవనస్వప్నం" అనే సుప్రసిద్ధ చైనా గ్రంథాన్ని గురించి ముప్పై సంవత్సరాలకు పైగా పరిశోధనలు చేసిన యూ పింగ్ పాయ్ ఈ నూతనోద్యమానికి ప్రథమాహుతి అయాడు. ఆయన మహావిద్వాంసుడు. ఆ గ్రంథంలోని విశేషాలన్నింటినీ ఆయన సూక్ష్మంగా పరిశీలించాడు. చూ షూ చిన్ అనే గ్రంథకర్త జీవితాన్ని సమగ్రంగా పరి

శోధించాడు. తన పరిశోధనల ఫలితాన్ని మొదట 1923 లో "అరుణ భవన స్వప్న సమర్థనం" అనే పేరుతో ప్రకటించాడు. ఆ గ్రంథానికి పీఠిక వ్రాస్తూ, చైనా సారస్వత చరిత్రలో చిరస్మరణీయులైన హ్యూ షీ, క్యూ చి-కుంగ్‌లనే ప్రాచీన విద్వాంసులకు తాను విశేషంగా ఋణపడి ఉన్నట్లు వెల్లడించాడు. అతి విస్తృతమైన, నిశితమైన పరిశోధన చేయడం వలన ఆ విషయముపై ఆయనదే అంతిమ సిద్ధాంత మయింది.

1949 లో, కమ్యూనిస్టులు పీకింగును ఆక్రమించుకొన్నప్పుడు పాయ్ పీకింగ్ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేస్తున్నాడు. ఆయన గ్రంథప్రతులన్నీ చెల్లిపోయి, మళ్లీ అచ్చుకావలసి ఉంది. ఆయనకు రాజకీయాలతో సంబంధం లేకపోవటం వల్లను, గౌరవ ప్రతిష్ఠలుగల విద్వాంసుల సహకారం ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని వారికి అవసరం కావటంవల్లను, కమ్యూనిస్టులు మొదట ఆయనపై చేయి జేసుకోకుండా వదిలివేశారు. ఈ విధంగా భావ సంస్కరణోద్యమంవల్లగాని, త్రివిధశత్రు ప్రతిఘటనోద్యమంవల్ల గాని ఆయనకు ఏవిధమైన అపాయం కలుగలేదు. అయితే ఈ ఉద్యమాలు ఆయనకు విరక్తి మాత్రం కలిగించినయి. ఆచార్య పదవియందు ఆయనకు గల ప్రీతి సడలిపోయింది. ప్రాచీన చైనా సారస్వతాన్ని గురించి పరిశోధనలుచేస్తూ, కేవల పరిశోధకుడుగానే ఉండిపో దలచుకున్నట్టు దరఖాస్తు

పెట్టుకున్నాడు. తత్పర్యవసానంగా ఆయనను పీకింగ్ విశ్వవిద్యాలయ పరిశోధన మండలికి బదిలీచేశారు. చేసి, ఆయనకు ప్రియమైన "అరుణభవనస్వప్నమును" గురించే పరిశోధనలు చేయటానికి కూడా అనుమతించారు. ఆయన అమిత దీక్షతో నూతన పరిశోధనలు జరిపి, "అరుణ భవన స్వప్న పరామర్శ" అనే గ్రంథం రచించాడు. తొలి గ్రంథం కన్న ఇది చాలా పెద్దది, బహువిషయ విమర్శలతో కూడినది. కాని, ఆయన పరిశోధన, దృక్పథం కేవలం విద్వత్తుకు సంబంధించినవి అవటం వలన, కమ్యూనిస్టులకు వారి పార్టీ దృక్పథానికి దోహదం చేసే విషయమేమీ అందులో కనిపించలేదు. అయినా, ఆ గ్రంథం సర్వత్ర ప్రశంసలు పొందుతూంది. రచయితల సంఘాధ్యక్షుడైన ఫెంగ్ సుయే-ఫంగ్ కూడా ఆ గ్రంథాన్ని ప్రశంసిస్తూ ఒక వ్యాసం వ్రాశాడు.

1953 శరదృతువులో ఆ గ్రంథానికి విదేశాలలో ప్రచారం కలిగించే నిమిత్తం ప్రత్యేకంగా ఒకవ్యాసం వ్రాసి ఇవ్వవలసినదిగా పీపుల్స్ చైనా పత్రిక పాయ్‌ని కోరింది. "అరుణ భవన స్వప్నమును గురించిన సంక్షిప్త విమర్శ" అనే చిన్న వ్యాసం ఆయన వ్రాసి ఇచ్చాడు. ఆ వ్యాసం ప్రతిని సమీక్షార్థం హ్యూ చియూ మ్యూకికికూడా పంపాడు. విద్వాంసుడుగా మ్యూకి, ఆ వ్యాస రచయితకు ఎక్కడా పోలికే

లేక పోయినా, ఆయన తన వ్యాఖ్యతో సహితంగా ఆ వ్యాస ప్రతిని తిరిగి పాయ్ కి పంపాడు. పైగా, "నూతనదృక్పథాలు" దృష్టిలో ఉంచుకొని తన సూచనల ప్రకారం ఆ వ్యాసాన్ని సవరించు కోమని కూడా సలహాయిచ్చాడు. కాని, ఆ "దృక్పథాలు" తన మూలసిద్ధాంతాలకు విరుద్ధంగా ఉండటం వలన పాయ్ అతని సలహాల ప్రకారం ఆ వ్యాసాన్ని సవరించ టానికి సమ్మతించ లేదు. తరువాత కొంతకాలానికి, "న్యాకన్ స్ట్రక్షన్" పత్రిక ఆ విషయంమీదే ఒక వ్యాసం వ్రాసి పంప మని పాయ్ ని కోరింది. ఆ వ్యాసాన్నే ఆయన యథాతథంగా ఆ పత్రికకు పంపాడు. ఆ మాస పత్రిక దాన్ని 1954 మార్చి సంచికలో ప్రచురించింది.

ఇంతలో, పీకింగ్ హైస్కూలు ఉపాధ్యాయుడు లీసిన్ ఫాన్ (వయస్సు 26), "పీకింగ్ జనతా విశ్వవిద్యాలయం" లో పరిశోధక విద్యార్థి అయిన లింగ్ లాంగ్ (వయస్సు 22) అనే ఇద్దరు ఛోటా రచయితలు ఉన్నట్టు ఉండి ఆ వృద్ధ విద్వాంసుడు వ్రాసిన దంతా తప్పుల తడక అని ఒక్కసారిగా కనిపెట్టారు. ఆ మహావిద్వాంసుడా విషయంపై పరిశోధన ప్రారంభించిన నాటికి ఈ ఛోటా రచయితలు అసలు పుట్ట నయినా పుట్టలేదు. అనుచితమైన, ఈ ఖండనలో ప్రధానా రోపణ ఆరచయిత "కళకోసమే కళ" అన్న సిద్ధాంతంపై మక్కువగలవాడని. "అరుణ భవన స్వప్నం" మూలగ్రంథం

వాస్తవికతా వాదరచనకు ఉత్తమ నిదర్శనమని, చైనాలో 18 వ శతాబ్ది సాంఘికవాతావరణ మంతా అందులో చిత్రింపబడి ఉన్నదనీ, ఈ ఛోటా రచయితల వాదం. "ఆ గ్రంథంలో వెల్లివిరిసే" ఆవేశ మంతా, "భూస్వాముల భోగలాలసతకు తీవ్ర నిరసన" మన్నారు. అసలా గ్రంథకర్త ఒక భూస్వామి కుమారు డన్న మాటకూడా పాపం వీరికి తెలియదు. 65 సంవత్సరాల వయస్సుగల ఆవృద్ధ విద్వాం సుడు అనవసరమైన చిల్లర మల్లర విషయాలకు అధిక ప్రాముఖ్యం ఇచ్చాడనీ, ఆయుగ మంతటికీ సంబంధించిన ప్రముఖ సమస్య అయిన సాంఘిక దురన్యాయమే ఆ గ్రంథంలో అభివర్ణింప బడిన దన్న సంగతి ఆయన గ్రహించ లేదనీ వారు ఆరోపించారు. పోనీ, ఈ విమర్శకుల వాదమే యథార్థం కావచ్చు. ఆ విద్వాంసుని భావాలే పొరపాట్లు అయినా కావచ్చు. కాని, ముఖ్యంగా గమనించ వలసిన విషయం ఏమిటంటే, ఆ విద్వాంసుడు అలాంటి అభి ప్రాయాలుగలవాడు గనుక ప్రభుత్వానికి శత్రువయి, అమితమైన ఒత్తిడికి గురి కావలసి రావటం. ఈ ఛోటావిమర్శ కులు వ్రాసిన వ్యాసం 1954 సెప్టెంబరులో "లిటరేచర్ హిస్టరీ ఫిలాసఫీ" అనే పత్రికలో ప్రకటిత మయింది. ఆ పత్రి కను ప్రచురించేది పొంటన్ విశ్వవిద్యాలయం వారు. వెంటనే ఆ వ్యాసం కొందరి అభ్యర్థనమీద "కళాసాహిత్య సమాఖ్య" అని పేరు పెట్టుకున్న ఒకసంస్థ ప్రచురిస్తున్న

"కళాసాహిత్య పత్రిక"లో ప్రకటితమయింది. కాని, దాని సంపాదకుడు మాత్రం పాండిత్యం పట్ల గౌరవప్రపత్తులు ఇంకా మిగిలి వున్నవాడవటం వలన, ఆ మహావిద్వాంసునికి ప్రతివాదులుగా ఆ అర్భకులను తెరయెక్కించటం ఉచితం కాదనుకున్నాడు కాబోలు. ఆ రచయితలు ప్రాచీన సాహిత్యమును గురించి పరిశోధనలు సాగించటానికి కొత్తగా ప్రారంభించిన వారవటంవల్ల, వారి అభిప్రాయాలు "అపరిపక్వమైనవిగా స్పష్టంగా కనిపిస్తున్నా" యంటూ ఒక సంపాదక వ్యాఖ్యనుకూడా ఆ వ్యాసంతో చేర్చి ప్రకటించాడు.

దాంతో 'పీపుల్స్ డెయిలీ' పత్రిక ఈ పత్రికపై విరుచుకు పడింది. ఆ వ్యాసం మార్క్సవాద దృక్పథాన్ననుసరించి చైనా సంప్రదాయ సాహిత్యంలోని బూర్జువా భావాలకు సక్రమమైన ఖండన అని గ్రహించలేక పోయినందుకు ఆ పత్రికను తీవ్రంగా నిరసించింది. యువ రచయితల రచనలకు తగినంత ప్రాముఖ్యం ఇవ్వక, పెద్ద పేర్లను మాత్రమే ఆ పత్రిక గౌరవిస్తున్నదనికూడా ఆరోపించింది. ఆ "కళాసాహిత్య పత్రిక" అట్టి ఇతర పత్రికలు ఈ రకమైన ధోరణిని వెంటనే వదలి వేయాలనికూడా హెచ్చరించింది.

ఆ మహా విద్వాంసుని విమర్శించడానికి సంశయిస్తూన్న అధికార పత్రిక లన్నిటినీ ఈ విధంగా 'పీపుల్స్-డెయిలీ' కేవలం ఇద్దరు ముక్కుపచ్చలారని రచయితల విమర్శలను

ఆధారంగా చేసుకొని ఇంత తీవ్రంగా మందలించిన దంటే, అది కమ్యూనిస్టుపార్టీ కేంద్రాధికార వర్గపు ఆదేశమన్న మాట. తదుపరి ఈ ఉద్యమం ఇంకా ముమ్మరమయి భయంకర రూపందాల్చింది. అఖిల చైనా సాహిత్యకళా మండలుల సమాఖ్య అధ్యక్షుడు శ్రీకో మో జో, కమ్యూనిస్టు ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహార మంత్రి శ్రీ మావో టున్‌లు కూడా తాము లోగడ పొరపాటు పడ్డట్టు అంగీకరించి పశ్చాత్తాపం ప్రకటించవలసివచ్చింది. ఈ సంఘటనకు రష్యాలో ఎహ్రెన్ బర్గ్ గాథకు కొంత సామ్యం ఉంది. ఈ ప్రకటనలు ఈ నాటకం కేవలం ప్రహసనంగా పరిణమించకుండా కాపాడటం కోసం ఉద్దిష్టమైనవి కావచ్చు.

ఆ వృద్ధ విద్వాంసుడు పీకింగ్‌లో ప్రత్యేకం ఇందు కోసం ఏర్పాటు చేసిన ప్రతిచర్చాగోష్ఠికి హాజరయి, తన పైన వారంతా దుమ్మెత్తిపోస్తూ ఉంటే స్వయంగా వినాలని నిర్బంధించారు. యూ పింగ్ పాయ్‌ని ప్రత్యక్షంగా ఖండించటం కోసం తమను "తప్పు దారులు పట్టించాడనీ" తమ మనస్సులలో "విష-బీజాలు నాటాడనీ" నిందించటం కోసం పాలకులు శ్రద్ధగా కొందరు యువ విద్వాంసులను తయారు చేశారు. చివరకు పాప మావృద్ధపండితుని ధైర్యం సడలిపోయింది. "సాహిత్యకళామండలుల సామాఖ్య" "రచయితల సంఘం" 1954 అక్టోబరు 31 నుండి డిసెంబరు 8

వరకు జరిపిన సంయుక్త సమావేశంలో ఆయన "నాదుష్ట దృక్పథా లన్నింటినీ సరిదిద్దుకుంటున్నాను, నా ఆత్మ సంస్కరణకు సూచనలు చేయవలసినదిగా అభ్యర్థిస్తున్నాను." అని దీనంగా ప్రకటించాడు.

కళా సాహిత్య పత్రిక 1955 మే సంచికలో ఆయన "ప్రాథమిక ఆత్మ విమర్శ" అనే వ్యాసం ప్రకటించాడు.

ఈ విధంగా యూ పింగ్ పాయ్ అంతవాణ్ణి లొంగదీయ గలగటం కమ్యూనిస్టులకు సామాన్య విజయం కాదు. వృద్ధ విద్వాంసు లందరినీ చులకనచేయటానికి, పరిశోధనలోను, తత్వ శాస్త్రంలోను కూడా పార్టీ వాద ప్రాముఖ్యాన్ని ప్రతిష్ఠించటానికి ఈ సంఘన అమోఘంగా ఉపయోగపడింది. ఈ ఉద్యమ పర్యవసానంగా కమ్యూనిస్టులు ప్రముఖులైనా, ప్రమాదకరులైన తమ పూర్వ స్నేహితులను కొందరిని కడతేర్చి, మరొక ప్రయోజనం కూడా సాధించారు.

"అరుణ భవన స్వప్నము"ను గురించిన యూ పింగ్ పాయ్ గ్రంథాన్ని ప్రశంసించిన వారిలో "కళాసాహిత్య పత్రిక" సంపాదకుడు ఫెంగ్ సూ-పంగ్ ఒకడు. ఫెంగ్ "వామపక్ష మైత్రి" కాలంలో కమ్యూనిస్టు పార్టీ సాహిత్య కళా విభాగ అగ్రనాయకులలో ప్రముఖుడు. కమ్యూనిస్టులు చైనా నడిగడ్డను అక్రమించుకొన్న తరువాత, ఆయన షాంగైలో సాహిత్య కళామండలుల సమాఖ్య నిర్వాహకుడు

చూడు. తరువాత కొంతకాలానికి పీకింగ్‌కి బదిలీ అయి, "అఖిల చైనా రచయితల సమ్మేళనం" ఉపాధ్యక్షుడై, టింగ్ లింగ్ నుండి "సాహిత్య కళాపత్రిక" సంపాదక పదవిని కూడా స్వాధీనం చేసుకున్నాడు.

అయితే, ఈయనకూడా ల్యూ సున్ ప్రధాన శిష్యులలో ఒకడు. అందువలన, "ప్రాచీన సంప్రదాయ వాసనల" నుండి పూర్తిగా విముక్తుడు కాలేక పోయాడు. యూ పింగ్ పాయ్ గ్రంథాన్ని గురించిన విమర్శక వ్యాసానికి ఈయన ఆ సంపాదక వ్యాఖ్యను జోడించటానికి బహుశః ఈ "పూర్వ వాసనలే" ప్రేరేపించి ఉంటాయి.

ఈ సంపాదక వ్యాఖ్య వలన ఆ పత్రిక ఎట్టి దుర్గతికి లోనయినదీ మనం తెలుసుకున్నాం. ఈ దుర్గతి ఆ పత్రికకే పరిమితం కాలేదు. పార్టీ అధికారులు ఆ పత్రికా సంపాదకుని మీద కూడా చర్యతీసుకున్నారు. తనకు ముంచుకొని వస్తూన్నదని గ్రహించి ఫెంగ్ ఎలాగైనా ఆ ముప్పు తప్పించుకుందామని తంటాలు పడ్డాడు. లోగడ తాను చేసిన తప్పులన్నిటినీ వివరిస్తూ ఆత్మ విమర్శక వ్యాసం వ్రాసి ప్రకటించాడు. కాని, దానివలన ప్రయోజనం ఏమీ లేక పోయింది. సాహిత్య కళా మండలుల సమాఖ్య, రచయితల సంఘం సంయుక్తంగా జరిపిన ఒక సమావేశంలో చుంగ్‌చిన్ వెన్ అనే ఆయన ఫెంగ్ మీద గట్టిగా దెబ్బ

తీశాడు. "కళాసాహిత్య పత్రిక" నిర్వహణకు బాధ్యత వహిస్తున్న మన కామ్రేడు స్వామి ద్రోహం చేశాడు." ఈ నేరం "కనీసం ఇతరులకు శారీరికమైన హాని చేయటమంత దారుణమైనది," (జెన్ మిన్ జీ పావో, పీకింగ్, డిసెంబరు 10, 1954) అనగా, ఫెంగ్ ఘోరాతి ఘోరమైన నేరం చేశాడని, కనుక తత్తుల్యమైన శిక్ష విధించాలని ఆయన తాత్పర్యం.

పిమ్మట ఆసమావేశంలో చేసిన తీర్మానంలో ఫెంగ్ మార్క్సు లెనిన్ వాద సిద్ధాంతాలపై తిరుగుబాటు చేశాడని, దురహంకార ప్రదర్శన, మోసం, పొగరుబోతు తనం, నిరంకుశత్వం, పార్టీ ఆదేశాలఉల్లంఘన, సాహిత్యకళా మండలుల సమాఖ్య నిర్ణయాలను ప్రతిఘటించటం, ఆ పత్రికను తన సొంత సొత్తుగా వాడుకొనటం, పెట్టుబడిదారుల తరగతికి దాసోహ మనటం, అతడు చేశాడన్న ఇతర అపరాధాలు."

"కళాసాహిత్య పత్రిక సంపాదక వ్యవస్థను పునర్నిర్మించటానికి నూతన సంపాదక సంఘం ఏర్పాటు చేయటానికి నిర్ణయించినట్టు" ఆ సమావేశాంతాన మావోటున్ వెల్లడించాడు. ఫెంగ్ ని, ఆయన సహోద్యోగి చెన్ చీ-సియాను ఉద్యోగాలలోంచి బర్తరఫు చేశారు. "కనీసం ఇతరులకు శారీరకమైన హానిచేయట మంతటిదారుణమైన" ఆ

నేరానికి పర్యవసానంగా అనంతరం వారు ఏమైనదీ ఇప్పటికీ అతి నిగూఢమైన రహస్యం. నాటికీ నేటికీ వాని నామ రూపాల ప్రసక్తి కూడా ఎక్కడా వినిపించదు.

సాహిత్యకళామండలులసమాఖ్య, రచయితల సంఘం సంయుక్తంగా జరిపిన తృతీయ సమావేశంలో ముఖ్యమైనవిషయం హ్యూ సున్ కి మరొక శిష్యుడు, చిరకాలంగా చైనా కమ్యూనిస్టుల సాహిత్య కళా వ్యవహారాలలో ప్రముఖ సిద్ధాంతవేత్త అయిన హ్యూ ఫెంగ్ చేసిన అసామాన్యమైన ఉపన్యాసం. మరికొంత చర్చా స్వాతంత్ర్యం అవసరమని క్వో మో జో అన్నమాట పట్టుకుని, పార్టీ కేంద్ర సంఘానికి చెందిననాడు. ప్రచారశాఖ డైరెక్టరు అయిన చౌ యాంగ్ ని ఈయిన తీవ్రంగా విమర్శించాడు. పీపుల్స్ డెయిలీ పత్రిక సంపాదకుడు యువాన్ షీ పోను, ఆ పత్రిక సంపాదక వర్గాన్నికూడా నిశితంగా విమర్శించాడు. ఈ పని పార్టీని విమర్శించటంతో తుల్యమైన నేర మనే హెచ్చరిక వచ్చినా లెక్కచేయలేదు. అలాంటి వారు కొందరు, అనేక సంవత్సరాలుగా వాస్తవంగా విప్లవాదులైన రచయితలను అణచి వేస్తున్నారనీ, ప్రముఖ విమర్శకులే సాహిత్యాన్ని నాశం చేసేటప్పుడు క్షుద్రమైన రాజకీయ దృష్టితో చూస్తున్నారని గర్జించాడు.

కమ్యూనిస్టులతో చిరకాల సాంగత్యం ఉండి కూడా, మరింత చర్చా స్వాతంత్ర్యమనగా దోషిగా నిర్ణయింపబడిన

వారిని ఇంకా తీవ్రంగా విమర్శించే స్వాతంత్ర్యమే తప్ప, అసలు అధికార విచారణ కర్తలను విమర్శించే స్వాతంత్ర్యం కాదని హ్యూ ఫెంగ్ గ్రహించ లేక పోవటం ఆశ్చర్యకరం గానే ఉంది. "చేజేతుల తన గొంతుకోసుకొని, తలను ఆరాతి గోడలకు వేసి కొట్టి, పగల కొట్టు కొనుట" మనే దారుణ నిశ్చయం అతడే స్వయంగా చేసుకున్నట్టుకనిపిస్తుంది. "దొంగలు, మోసకారులు" అని ఆయన విమర్శకు గురి అయిన వారి దుశ్చేష్టితాలకు ఆయన ప్రాణం విసిగి పోయినట్టు కనిపిస్తుంది. దీనితో ఆయన కూడా వాంగ్ షీ వీ, షావో చున్ లు ఎక్కిన ఉరికంబమే ఎక్కవలసి వచ్చింది.

ఈయన ఆ సమావేశంలో ప్రసంగించటానికి పూర్వం, ఇంచు మించు అవే మాటలు కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘానికి వ్రాశాడు. సాహితీ నియంతలు రచయితల తలలలో బలవంతంగాగుచ్చుతున్న "పంచశస్త్ర" నిబంధనలను తొలగించ వలసినదిగా ఆలేఖలో ఆయన పార్టీకి విజ్ఞప్తి చేశాడు. ఆయన పేర్కొన్న "పంచశస్త్ర" నియమావళిని గురించి వివరంగా తెలుసుకుంటే తప్ప, చైనా నూతన ప్రభుత్వం రచయితల పైన ఏ విధమైన అధికారాలు చెలాయిస్తున్నదీ బోధపడదు. పైగా ఒకప్పుడు ప్రస్తుత చైనా పాలకుల చేతనే బ్రహ్మరథం పట్టించుకున్న ఒక ప్రముఖ వ్యక్తి అభిప్రాయాలు అవటంవలన, సర్వత్ర రచయిత లందరు

ముఖ్యంగా గమనించ వలసినవి. రచయిత లందరి తలలలో గుచ్చబడిన "పంచశస్త్రా"లను హ్యూ ఫెంగే ఈ విధంగా వివరించాడు.

"1 రచయిత లంతా కమ్యూనిస్టుల సిద్ధాంతాలను ఆమోదించాలి.
2 కార్మిక, కర్షక, సైనిక జీవనంలో తానులీనం కావాలి.
3 సైద్ధాంతికమైన సంస్కరణకు, పునః విద్యాభ్యాసం చెయ్యాలి.
4 తన రచనలకు పార్టీ నిర్ణయించిన స్వరూపం ఇవ్వాలి;
5 పార్టీ అవసరమని శాసించినకార్యక్రమాలలో పాల్గొనాలి."

హ్యూఫెంగ్ కి పార్టీనీతులకన్న సాహిత్య మర్యాదల పైన శ్రద్ధఎక్కువ. చైనాసాహిత్యాభ్యుదయానికి తన పద్ధతిలో తాను కృషిచేయాలని ఆయన సంకల్పం. ఆయనపార్టీకి ఇచ్చిన ఈ దిగువ సలహాలను పరిశీలిస్తే చైనా రచయితలకు ప్రాణాంతకంగా ఉన్న విషయాలేమిటో మరికొంత వివరంగా తెలుస్తుంది.

1. చైనాకమ్యూనిస్టుపార్టీ స్థానికశాఖలు రచయితలపై చెలాయించే అధికారాలను తగ్గించాలి.
2. సిద్ధాంత బోధనకార్యక్రమాన్ని నిలుపుచేయాలి.
3. రచనలు చేస్తూన్న రచయితలను బాధించకూడదు.

4. కమ్యూనిస్టుల అధికార ప్రచురణలను నిలిపివేయాలి.
5. పరస్పరం పోటీచేసుకునే అవకాశం గల జాతి విస్తృతమైన నూతన సాహిత్య పత్రికలు ఏర్పాటుచెయ్యాలి. ఒక్కొక్క పత్రికకు సమర్థుడైన ఒక సంపాదకుణ్ణి, ఒక పాతిక మంది స్థిర రచయితలను నియమించాలి.
6. పార్టీ జోక్యం లేకుండా సంపాదకులు వ్యాసాలను ఎన్నుకొనటంలో స్వేచ్ఛగా వ్యవహరించటానికి స్వాతంత్ర్యం ఇవ్వాలి.
7. ఒక్కొక్క పత్రికకు నిర్ణయించిన రచయితలలో మూడవవంతు కమ్యూనిస్టులుగా ఉండవచ్చు. అయితే పార్టీకి మాత్రం పత్రికా నిర్వాహణలో జోక్యం ఉండకూడదు.
8. రచనా సామగ్రిని పద్ధతులనునిర్ధరించు కొనటంలో రచయితలకు స్వాతంత్ర్యం ఇవ్వాలి. సిద్ధాంత శిక్షణ పాఠశాల లకు రచయిత లందరు హాజరుకావాలని నిర్బంధింపకూడదు."

నిజానికి, హ్యూ ఫెంగ్ కమ్యూ నిజమన్నా, కమ్యూనిస్టుసిద్ధాంత ప్రచారమన్నా ఇష్టంలేనివాడు కాడని పై సలహాలే సూచిస్తున్నవి. కమ్యూనిజాన్ని గౌరవ ప్రదంగా రూపొందించాలని, ఆవిధంగా చైనా ప్రజలకు దానియందు హితవు కలిగించాలని ఆయన ప్రధాన సంకల్పం. అయినా,

హేతువాద బద్ధమైన ఈ సలహాలకు ఫలితంగా ఏమిజరిగినది చూద్దాం. ఈ సలహాలను గురించి క్వో మో జో అన్న మాటలు ఇవి:

"అరరే! హ్యూ ఫెంగ్ ఎంత ఆత్మద్రోహి! సాహిత్య రంగనాయకత్వమంతా తానే బావుకోవాలనుకుంటున్నాడు. పై పెచ్చు, సంఘాన్ని, దేశమంతటినీ కూడా తన ప్రణాళిక ప్రకారం మార్చివేయాలనుకొంటున్నాడు. అతని బూర్జువా వ్యక్తిత్వవాదం ఈ విధంగా పరిణమించింది!"

1955 ఫిబ్రవరిలో చైనా రచయితల, కళాకారుల సమ్మేళనం ఆయన శిక్షార్హుడని అధికారయుతంగా నిర్ణయించింది. ఈ సూచన నందుకొని ప్రతికలన్నీ ఆయనపైన, ఆయన సహచరులపైన దుమ్మెత్తి పోయటం మొదలు పెట్టినవి.

హ్యూ ఫెంగ్ అపరాధాలు కేవలం సాహిత్య సంబంధమైనవి కావని, మామూలు ప్రకారం చైనా పాలకులు నిర్ధారణ చేశారు. ఆపైన, మూడు నెలలైనా గడవక పూర్వం పీపుల్స్ డెయిలీ పత్రిక హ్యూ ఫెంగ్ పూర్వ ప్రకటనలను ఉపసంహరించుకొని, ఆత్మవిమర్శన చేసుకుంటూ వ్రాసిన ప్రకటనను ప్రచురించింది. తాను "సిద్ధాంత సంబంధమైన అపరాధం" చేసినట్టు హ్యూ ఫెంగ్ ఒప్పుకున్నాడని ఆపత్రిక వ్రాసింది. ఆపైన, ఆయన "ప్రభుత్వ

శత్రువు" అనీ, "చైనా శత్రువు" అనీ, "చియాంగ్ కై షేకు ఏజెంటు" అనీ నేరనిర్ధారణ చేశారు. ఆసమయంలోనే గడచిన 12 ఏళ్ళలో ఆయన వ్రాసిన లేఖలంటూ 34 ఉత్తరాలను పీపుల్స్ డెయిలీ ప్రకటించింది ఆతరువాత, ఆయన మిత్రులు వ్రాసిన లేఖలంటూ మరి 67 లేఖలు ప్రకటించారు ఈ ఉత్తరాలతో హ్యూ ఫెంగ్ను, అతని మిత్రులను కేవలం "దోపిడిగాళ్ళు", "కుట్రదారులు" అన్నట్టు తేల్చారు. అయితే పీపిల్స్ డెయిలీ పత్రికకు కూడా నిశ్చితమైన అభిప్రాయం లేకపోయింది. అందువల్ల మళ్ళీ "1955 మే 13 వరకు హ్యూ ఫెంగ్ దురభిప్రాయాలు కేవలం సిద్ధాంత సంబంధమైన వని చాలా మంది భావిస్తూ ఉండేవారు...... ఆయనవి పూర్తిగా విప్లవ విరుద్ధ భావాలని వారు గ్రహించ లేకపోయారు....మనం ఇంకా జాగరూకులమై కనిపెట్టి చూస్తూ, విద్రోహులను అరికట్టాలి," అని వ్రాసింది. ఆపైనకొన్ని వారాలకు "వైట్ బుక్" అనే పేరుతో ఈ గొడవలన్నిటినీ వివరించే పుస్తకమొకటి పదిలక్షల ప్రతులు ప్రకటించారు. "హ్యూ ఫెంగ్ అనుచరులను" తుడిచిపెట్టే ఉద్యమం ప్రచండంగా సాగుతూంది. వారి "అపరాధాలు" అసంఖ్యాకాలని చెప్పనక్కర లేదను కుంటాను. పూర్వం సాహిత్య పరస్వతులుగా పూజలందు కొన్న రచయితలు, "గ్రామాలలో పఠిపులకు విషం పెట్టిన

ద్రోహులు, వాణిజ్య వ్యాపారాలను స్తంభింపచేయ యత్నించిన కుట్రదారులు" అయారు.

ఆత్యావేశంతో దేశమంతటా వేలకొలది నిరసన సభలు జరిపించి, హ్యూ ఫెంగ్‌ని మట్టుపెట్టాలని అన్ని వర్గాలకు చెందిన ప్రజలంతా కోరుతున్నట్టు తీర్మానాలు చేయించారు. గృహిణుల సమాజాలు, కార్మికులు, మత ప్రబోధకులు, వ్యాపారస్థులు అంతా హ్యూ ఫెంగ్ రక్త తృష్ణతో అంగలారుస్తున్నట్టు ప్రచారం చేశారు. చివరకు అహింసా నిష్ఠగల బౌద్ధ సంఘాలు కూడా హ్యూ ఫెంగ్‌ని తీవ్రంగా శిక్షించాలంటూ ఈ దిగువ, ప్రకటన చేశా యన్నారు: "ఇట్టి విప్లవ విరోధులను విషతుల్యులుగా చూడాలి. వారిని మన మార్గంలో కంటకాలుగా పరిగణించి ఏరివేసి, మన మార్గాన్ని నిష్కంటకం చేసుకోవాలి." ఈ ఉద్యమ మంతటిలోకి అతి విలక్షణమైన మరొక ముఖ్య సంఘటన కూడా జరిగింది. హ్యూ ఫెంగ్ ఉదంతాన్ని గురించి చర్చించటానికి గాను, ప్రజల హైకోర్టులో ప్రధాన న్యాయమూర్తులు కూడా ఒక ప్రత్యేక గోష్ఠి ఏర్పాటు చేసుకొని, అందులో తమ చేతిక్రింద పనిచేసే న్యాయమూర్తులు రాజకీయ కార్య క్రమాలలో తమ విధులను సక్రమంగా నిర్వహించటం లేదంటూ విమర్శించి "కుట్రలను పూర్తిగా భగ్నం చేయటానికి అనువైన ఆయుధాలుగా శిక్షలను వడ్డించాలి" అని వారిని ఆదేశించారు.

ఈ హ్యూ ఫెంగ్ వినాశనోద్యమ పరిణామాల పట్ల "మాస్కో మిలిటరీ గజెట్" పత్రిక పీకింగ్ విలేఖరి సంతృప్తి ప్రకటించాడు. "చైనా ప్రజానీకమంతా పవిత్రమైన ఆవేశంతో ఊగిపోయింది. జాతిఅంతా కోపోద్రిక్తమై, నీచులైన, విద్రోహులైన సామ్రాజ్యవాదుల ముఠాను శిక్షించాలని ఆందోళన చేస్తూంది." అని ఆయన వ్రాశాడు.

చైనా ప్రజానీకం ఈ ఉద్యమాన్ని గురించి, వాస్తవంగా ఏమి అనుకున్నది నిర్ణయించటం నిజానికి సులభమైన పనికాదు. కాని, వారి భావాలను గురించిన ఒక సూచన మాత్రం మనకు పరోక్షంగా "కుంగ్ మిన్ డెయిలీ" పత్రికలో దొరుకుతూంది. 1955 జూన్ 10 వ తేదీన ఆ పత్రిక ఈ విధంగా కొంచెం సణుగుకుంటూ వ్రాసింది:

"కొందరు ప్రజలలో దుష్టమైన, వివేకహీనమైన భావాలు ప్రచారంలో ఉన్నట్లు కనిపిస్తూంది. ప్రజలలో కొందరు వర్గ సంఘర్షణను గూర్చి ఏవిధమైన అనుభవంగాని లేనివారనీ, పైగా శత్రువుల శక్తి యుక్తులను కూడా వారు సరిగా అర్థం చేసుకున్నట్లు కనిపించదనీ దీని వలన తేలుతూంది. వర్గ సంఘర్షణను గురించిన సక్రమజ్ఞాన లోపము, ఈ పోరాటంలో తమ పాత్రను సరిగా గ్రహించలేని అవజ్ఞ ఒక్క విషయాన్ని మాత్రం స్పష్టంగా సూచిస్తున్నవి. ప్రస్తుత విప్లవాన్ని నడుపుతున్న నాయకులు, కార్యకర్తలు ఈ వర్గ

సంఘర్షణలో ప్రస్తుత సంధియుగ పరిస్థితిని, సమగ్రంగా అర్థం చేసుకోలేదు. పొరపాటు అభిప్రాయాలున్న వారంతా తమ మనస్సులను క్షాళనం చేసుకొనవలసినసమయం వచ్చింది హూఫెంగ్ ఉదంతం మనకు గుణపాఠం కావాలి. సామ్రాజ్యవాదులు మిగిలి ఉన్నంతవరకు చైనాలో నానారకాల విప్లవ వ్యతిరేకులు, విప్లవ వ్యతిరేక సంస్థలు ఉంటూనే ఉంటవి." అసత్యానికి కూడా హద్దుపద్దు ఉంటూఉండాలి.

హ్యూఫెంగ్‌ని అరెస్టు చేయటం, విచారించటం కూడా జరిగి పోయినట్లు, చైనాలో సుప్రీం పీపుల్స్ ప్రో-క్యూరేటర్ శ్రీ చాన్ టింగ్ - చెంగ్ నేషనల్ పీపుల్స్ కాంగ్రెసులో ప్రకటించారు. ఆ విచారణ పర్యవసానం మాత్రం ఆయన చెప్పలేదు. నిజానికి చెప్పవలసిన అవసరం కూడా లేదేమో !

# 7. పూలమొక్క, కలుపుమొక్క

"బహుశః కొన్ని దశాబ్దాల తరువాత చైనాలో మానవునికీ, మానవునికీ మధ్య వివిధమైన సంఘర్షణ ఉండక పోవచ్చు. మానవుని గౌరవానికీ, నిజాయితీకి భంగ పాటంటూ లేకపోవచ్చు. మానవుడు నేడు తన గౌరవాన్నీ, నిజాయితీని కాపాడుకోవాలని ప్రయత్నిస్తూండటంవల్లనే దెబ్బతింటున్నాడు. నేడొక మానవుడు, మరొక మానవుని గౌరవించడు. మానవుడైన వాడెవడూ పీడనాతీతుడు కాడని అతని అభిప్రాయం" — నెన్ హాన్ హ్యూ ఫెంగ్.

1954 మార్చిలో, ప్రస్తుతం చైనాలో మావో సేటుంగ్ తరువాత అంతవాడుగా పరిగణింబడుతూన్న లియూ షావో చీ చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘ చతుర్థ మహాసభ సప్తమ సమావేశంలో ప్రసంగిస్తూ పార్టీ లోపల "స్వతంత్ర సర్వతంత్రరాజ్యాలను తుడిచి వేయాలని ఉద్ఘాటించాడు. రచయిత సాహిత్య సామ్రాజ్య నిర్మాత అని పరమస్వతంత్రుడని అప్పటికే భావిస్తూన్న అవివేకు లింకా ఎవరైనా మిగిలి వుంటే వారికి ఇది ప్రచ్ఛన్నమైన హెచ్చరిక."

ఆ సంవత్సరమే సెప్టెంబరులో ఇతడూ, ఇటీవల భారత దేశంలో ఊరేగివెళ్ళిన శ్రీ చౌ ఎన్ లాయి "ఎవరో కొద్దిమంది అభివృద్ధి నిరోధక భావుకుల విషయంలో తప్ప" సర్వత్ర

ప్రభుత్వ భావసంస్కరణోద్యమం విజయవంతమయిందని చెప్తున్నారు.

యు పింగ్ పొయ్ పరాభవానికి, ఫెంగ్, షూ యే ఫంగ్, హ్యూ ఫెంగ్, వారి మిత్రుల నిర్మూలనానికే దారితీసిన ఉద్యమాలు రెండూ ఈ ప్రకటనలకు వెనువెంటనే జరిగిన సంఘటనలు, ఆతరువాత జూలై 22 న సుప్రీం పీపుల్స్ ప్రొ క్యూరేటరు జాతీయ ప్రజాకాంగ్రెస్‌లో ప్రసంగిస్తూ హ్యూ ఫెంగ్‌ని అరెస్టుచేసినట్టు, విచారించినట్టు ప్రకటించాడు. కనుక, "ఆకొద్దిమంది అభివృద్ధి నిరోధక భావుకులు" ఇక లేరనీ, పార్టీలోని "ఆ స్వతంత్ర సర్వతంత్ర రాజ్యాలు" కూడా ప్రాచీనకథావశేషాలనీ భావించవచ్చు. ఇంకా తేట తెల్లంగా చెప్పాలంటే ఏకశిలాశాసనం ధ్రువపడిందనీ, రచయితలను భయపెట్టి బానిసలుగా మార్చటానికి, అవిధేయులను హతమార్చటానికీ జరిగినకుట్ర పూర్తిగా సఫలమయిందని కూడా సులభంగా అనుకోవచ్చు. ఇక, ఈ తృణీకృత రచయితలంతా ప్రభుత్వానికి వందిమాగధ బృందగీతాగానంలో కంఠాలు కలుపుతారను కొనటానికి సందేహించవలసిన పనిలేదని భావించారు. పావ్‌లోవ్ (జంతువుల అభ్యాసాలను గురించి నూతన సిద్ధాంతాలు కనుగొన్న శాస్త్రవేత్త.) పరిశీలించిన కుక్క అయినా ఒకొక్కప్పుడు అతని సిద్ధాంతాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తుందేమోగాని, మాసేటుంగ్ తరిఫీదు పొందిన రచ

యితలు మాత్రం ఆయన సిద్ధాంతాలను తు.చ తప్పకుండా అనుసరించగలరనుకున్నారు. అనగా, ఇక వారా అగోచర శృంఖలాలను ధరించటానికి అంగీకరించారని ధ్రువపరచు కొన్నా రన్నమాట. ఎంత అనుమాన గ్రస్తులయిన పాలకుల కయినా, శ్మశానసీమ లోని సమావేశ, భావప్రకటన స్వాతం త్ర్యాలు నిష్ప్రమాదకరంగానే కనిపిస్తాయి.

“ఏకకాలంలో పలురకాల పూలు వికసించనిద్దాం. వివిధ భావనాపథాలను పరస్పరం వివరించుకోనిద్దాం” అంటూ చైనా సుప్రీంస్టేట్ కౌన్సిల్ సమావేశంలో 1956 మే 2 వ తేదీన మాసేటుంగ్ చేసిన ప్రకటనను క్రమంగా అర్థం చేసుకోవాలంటే ఈసంగతి సందర్భాలన్నీ తెలుసు కోవాలి.

శృంఖలలు పైకి కనిపించకపోయినా, అసలు ఉన్నా యన్న సంగతి, చైనాలోని ఇతర ప్రముఖనాయకులు మాసేటుంగ్ సూక్తికి చేసిన వ్యాఖ్యానాలవల్ల తేలిపోయింది.

ఉదాహరణకు, చైనా సంస్కృతిశాఖా మంత్రి షాన్ యెన్ సింగ్ 1956 జూన్‌లో జాతీయ ప్రజాకాంగ్రెస్ సమా వేశంలో ప్రసంగిస్తూ, గురువుగారి సూక్తిని విపులంగా వివ రించాడు. “అది అసలు పూవయితే, తప్పకుండా వికసింప నిస్తాం.” అని ఆయన వార్తికం. ఒక రచనపూవు అయినదీ, కానిదీ నిర్ధరించటానికి ఒక పరీక్షనుకూడా ఆయన సూచిం

చాడు. "సృజనాత్మకమైన, రచనా విధానాలలో సోషలిస్టు వాస్తవికతా విధానాలే సత్యాన్ని వాస్తవికంగా ప్రకటింప గలవని మన విశ్వాసం. అవే అభ్యుదయ సూత్రాలను మనకు వ్యక్తం చేస్తాయి. కనుక, అవే మనకు ఉత్తమోత్తమ మార్గాలు. ముఖ్యమైన సాంఘిక సంఘటనలకు తోడు, ప్రజోద్యమాలకు భంజకములు కాని వాస్తవిక జీవితసంఘటన లన్నింటినీ మనం సాహిత్య వస్తువులుగా ఉపయోగింప వచ్చును.

చైనాలో సోషలిస్టు వాస్తవికతా సిద్ధాంతం చెక్కు చెదరకుండా చెలామణి అవుతున్న దనటానికి పై వ్యాఖ్యానమే ప్రబల నిదర్శనం. హ్యూ ఫెంగ్ ప్రాణాలను బలిగొన్న "పంచశస్త్రా"లను దొలగించాలన్న ఉద్దేశం చైనా సాహిత్య నియంతలకు ఏకోశాన ఉన్నట్లు కనిపించదు. అయినా, ఈ నూతన సిద్ధాంతాన్ని మాత్రం వారు విస్తృతంగా ప్రచారం చేస్తూ వచ్చారు. ఆ ప్రజా స్వర్గంలో రచయితలకు గల పరమ స్వాతంత్ర్యమల్లా రచనా విధానాన్ని నిర్ణయించు కొనటంలో మాత్రమే. భావాలన్నీ నిర్ణయించి పెట్టే ఉంటవి. ఇతర భావాలేవైనా వ్రాయదలచుకుంటే అవి, ప్రజోద్యమాలకు ఏమాత్రం హానికలిగించేవి కాకుండా చూసుకోవాలి. ప్రజోద్యమాలకు ఏది హానికరమైనదీ, ఏది కానిదీ నిర్ణయించే బాధ్యత మాత్రం సదా పార్టీ స్థానిక నియంతలదే అని వేరే చెప్పనక్కరలేదు. ఏ రచయిత

భావాలయినా, అధికారంలో వున్న పార్టీ నాయకుల అభి ప్రాయాలకు రవంత భిన్నంగా ఉన్నట్టు కనిపిస్తే, అతడు ఎదుగ నీయదగిన పూల మొక్క కాదనీ, పెరికి వేయవలసిన కలుపు మొక్క అనీ వెంటనే సిద్ధాంతీకరిస్తారు.

సాహిత్యం "ప్రజలకు, ముఖ్యంగా కార్మికులకు. కర్షకులకు, సైనికులకు సేవచేసేదిగా వుండాలి" అన్న విష యంలో రచయిత లెవరికీ ఏవిధమైన సందేహం ఉండరాదని కూడా చైనా సాంస్కృతిక నియంత రచయిత లందరినీ శాసించాడు. కార్మికులకు, కర్షకులకు సైనికులకు సేవచేయడ మంటే ఏమిటో నిర్ణయించే అధికారం కూడా కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించ వలసినదే. మాట వరసకు, కర్షకులకు, వ్యక్తిగతంగా భూమి హక్కు ఉండటానికి వీలులేదని పార్టీ నిర్ణయించిన దనుకోండి. ఎదగనీయదగిన పూల మొక్క లుగా పరిగణన పొంద గోరిన రచయితలంతా ఆ నిర్ణ యాన్ని ప్రశంసిస్తూ వ్రాయాలి. 1955 ఫిబ్రవరి 27 న చైనా రచయితల సంఘ సమావేశంలో ప్రసంగిస్తూ చౌయాంగ్ ఈ విషయాన్నే కుండ పగలగొట్టి చెప్పాడు. "ఎన్ని తప్పులు చేసినా... ...జీవితాన్ని వాస్తవికంగా చిత్రించటంలో అభ్యుదయం సాధించినందుకు," "గ్రామీణ విప్లవాన్నే" తమ రచనలకు వస్తువుగా గ్రహించినందుకు ముందుగా ఆయన రచయిత లందరినీ అభినందించిన మీదట, తమ

భూములను వదులుకోవటం వలన రైతులకు కలిగే మహోప కారాలను గురించి వారికి నచ్చచెప్పటానికి రచయితలంతా ఎందుకు కృషి చేయవలసినదీ వివరించాడు.

పరిపాలన అప్రతిహతంగా సాగాలంటే ప్రభుత్వానికి రైతుల బాహుబలం, పండితుల బుద్ధిబలం అవసరం. "దున్నేవాడిదే భూమి," అంటూ రైతులను బులిపించే దశ గడిచిపోయింది. దీనికి బదులు, సమష్టి సౌభాగ్యం కోసం, "భూమి యావత్తు ప్రభుత్వానికే దాఖలు కావాలన్న"నినాదం ప్రబల మయింది. అలాంటి సమయంలో రైతులను మసిపూసి మారేడు కాయ చేయటానికి రచయితల కన్న సమర్థులెవరున్నారు? ఈ విధంగా ప్రవర్తించటానికి నిరాకరించిన రచయితలకు విప్లవ వ్యతిరేకులన్న ముద్ర తప్పదు.

అలాగే, చైనా పాలకుల అభిప్రాయం ప్రకారం రచయితలు సైనికులకు సేవ చేయటమనగా, ప్రాథమిక అవసరాల కోసం కూడా ఆశించకుండా యుద్ధం చేయాలని సైనికులను ఉత్సాహ పరచటం. ఒక్కొక్క సమయంలో వరుసగా మూడు, నాలుగు రోజులపాటు ఆహారం లేకుండా యుద్ధం చేసి ఆహుతి అయిన సైనికులను గుర్తించి స్తోత్రరత్నాలు వ్రాయాలి. కవిత్వంలో సమాజ వాద వాస్తవికత అంటే ఇదే. ఈ విధంగా ప్రశంసింపలేని రచయిత ఎవరైనా, ఇతరత్ర ఎంత కరుడుగట్టిన మార్క్సవాది అయినా చిక్కు

లలో పడక తప్పదు. ఉదాహరణకు ఒక విమర్శకుడు "సిమెంట్" అనే లేఖినీ నామంతో వ్రాస్తూ యుద్ధరంగం లోని దళాలకు, వారికి ఆహారాదులను సరఫరాచేసే దళాలకు సరిగా పొత్తు కుదరటం లేదని వ్రాయగా, ఆయనను అతి తీవ్రంగా విమర్శించటం, సామాన్యంగా అట్టి విమర్శల పర్యవసానాలన్నిటికీ అతనిని గురిచేయటం జరిగింది.

ఇదంతా సమాజవాద వాస్తవికతకు అనుగుణంగా జరుగుతున్న తదంగం. ఇంతకు, ఈ సందర్భంలో జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయమేమిటంటే, "అన్నిరకాల పూల మొక్కలను ఎదగనిద్దా"మన్న సిద్ధాంతాన్ని ఒకవంక విస్తృతంగా ప్రచారం చేస్తున్నా, చైనారచయితల విధులు మాత్రం ఎప్పటిలాగే చెక్కుచెదరకుండా ఉండిపోయినవి. పూర్వంలాగే, వారు ప్రభుత్వం తిమ్మిని బ్రహ్మి అన్నా, బ్రహ్మిని తిమ్మిఅన్నా ఓహోహో అంటూ వారంతా పక్కతాళం వెయ్యాలి. పారిశ్రామిక, కార్మిక, కర్షక సైనికుల విషయంలో ఏ సమస్య వచ్చినా ఇదే పద్ధతి.

మనం అపోహపడే ప్రమాదంకూడా లేకుండా, రచయితల విషయంలో ఈ నూతన విధానానికి అధికారిక వ్యాఖ్యానం కూడా వెలువడింది పీకింగ్ ప్రభుత్వాధికారవాణి అని నిస్సంశయంగా పేర్కొనదగిన లోలింగ్ చీ ఈ నూతన విధానాన్ని గురించి కొంతసాహసంగా, దారిద్ర్య సమస్యలతో బాధపడేవారి పట్ల అపహాస్యంగా కనిపించే

ఉపమానంతో ఈ విధంగా వివరించాడు. సమాజవాద, సమష్టివాద శకాలలో ఆశయ, విధానాలు ప్రజానీకంలో ఏకైక లక్ష్యం వంకను, ఒకేదిక్కుగా, ఒకే భవిష్యత్తు కొరకు ఉద్దిష్టమైనవై ఉంటాయి. సంగీతాన్ని ఉపమానంగా తీసుకుందాం. సమాజవాద, సమష్టివాద శకాలలో లక్ష్యం గొప్ప వాద్య సమ్మేళనంలో సంగీతంలాగ ఉంటుంది. ఆ సమ్మేళనంలో పియానో వాదకుడు, వేణు వాదకుడు, మృదంగాదుల వాయించేవారు వ్యక్తిగతంగా ఆ యా వాద్యాలలో విశిష్టమైన శిక్షణ పొందినవారై ఉండాలి. అయినా, అందరు సమష్టి ప్రయోజన సాధనకోసం పరస్పరం సహకరింప గలిగి ఉండాలి. వాద్య సమ్మేళనంలో కళావైభవం అందులో పాల్గొనే వాదకుల వ్యక్తిగత ప్రావీణ్యాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. ఆ సమ్మేళనం అందులో పాల్గొనే వాదకుల విలక్షణ ప్రావీణ్యప్రదర్శనకు ప్రోత్సాహం ఇవ్వాలి. ఏ వాదకుని ప్రావీణ్యాన్ని అలక్ష్యం చేయ కూడదు. ప్రజలను ఏ విధమైన గానం రంజింప జేసేది గ్రహించి ఆ విధమైన గానాన్నే వినిపించాలి... వాద్య సమ్మేళన ప్రదర్శనలకు సుశిక్షిత వ్యవస్థ, పటిష్ఠమైన నాయ కత్వం, సారథ్యం అవసరం. ఇవి అన్నీ ఉన్నప్పుడే ఆ వాద్య సమ్మేళన ప్రదర్శనం సరససామరస్యసంశోభిత మవుతుంది."

కనుక రచయితలకు, కళాకారులకు ప్రసాదింపబడిన స్వాతంత్ర్య మల్లా "సుశిక్షిత వ్యవస్థలో చండశాసనులైన

నాయకుల చెప్పుచేతలలో" రచనలు చేయటానికి తగిన స్వాతంత్ర్యం అన్నమాట. రచయిత, అవిధేయుడు కాకుండా స్వతంత్రుడుగా ఉండాలి. "నాటకాలన్నీ నీరసంగా, విసుగు పుట్టించేవిగా ఒకే మూసలో పోతపోసినట్లు ఉన్నవి." అని ప్రేక్షకులు చప్పరించి వేస్తున్నారు. అంటూ షెన్ యెన్ పింగ్ పేర్కొన్న "నిరంతరాధిక్షేపణకు" పర్యవసానంగా ఈ నిర్వాచనం (లేక రచనా స్వాతంత్ర్య వివరణం) వెలువడింది. అంతేకాని, ఈ "నీరసతకు" కారణం సారస్వతంలో మార్క్స్-లెనిన్ సిద్ధాంతమే అయి ఉండవచ్చునని కాని, యెనాన్‌లో మా సే టుంగ్ ప్రసంగాల సమయంలో ఆయన ఉద్దేశించిన ఫలితాలకు ఇవి విరుద్ధంకాదని కాని ఒప్పుకోరు. పై పెచ్చు, రచయితలు తమ మనస్సులలో "పంచశస్త్రాలను" ఉంచుకొనే కళాసృష్టి చెయ్యాలంటారు. ఇదిఎలా సాధ్యమో రుజువుకాలేదు. మార్క్స్ - లెనిన్ సిద్ధాంతం "నేతి" వాదమని మాత్రం స్పష్టంగా రుజువయింది. ఈ వాదం సాంప్రదాయికమైన ప్రాచీన సృజనాత్మక ప్రతిభను భంగపరిచిందికాని, నూతనమైన సృజనాత్మక ప్రతిభను ఉత్పత్తి చేయలేక పోయింది. బలవంతపు చాకిరితో రోడ్లను ఫాక్టరీలను నిర్మించటానికి అవకాశం ఉండవచ్చు - కళాసృష్టిమాత్రం సాధ్యంకాదు. సాహిత్యాన్ని నిబంధించటానికి జరిగే ప్రయత్నం విఫలంకాక తప్పదు. పార్టీవాదమో సాహిత్యమో ఏదో ఒకటేకాని, రెండూ ఒక్కచోట సాధ్య

మవటంకల్ల. కమ్యూనిస్టులకు పార్టీవాదమే సర్వానికి పట్టుకొమ్మ అని మనకు తెలుసు. కనుక వారికీ, సాహిత్యానికీ విడాకులు తప్పవు.

పైగా, వారు అప్పుడప్పుడు ప్రకటించే అల్ప స్వాతంత్ర్యాలు కూడా వారి విశ్వాసాలలో కలిగిన మార్పుల పర్యవసానాలు కావు; ఏవో తాత్కాలిక ప్రయోజనాలను సాధించటానికి అవలంబించే ఉపాయాంతరాలు. ఆ ప్రయోజనాలు సాధించిన వెంటనే, రచయితలు తమపరిమితులను ఉల్లంఘిస్తున్నారనే భయం మళ్ళీ ప్రభుత్వాన్ని ఆవహిస్తుంది. వెంటనే మళ్ళీ తొల్లిటి నిబంధనలన్నీ అతినిష్ఠురంగా, నిర్దాక్షిణ్యంగా అమలులోకి వస్తవి. సోవియట్ రష్యాలో జరిగిన రచయితల దారుణ సంహారకాండలలో చాలాభాగం వారిపై కొంతపట్టు సడలించిన తరువాత, వెనువెంటనే జరిగాయన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి.

తూర్పుయూరప్ దేశాలలో జరిగిన సంఘటనలు ఈ విషయాన్ని మరింతగా రుజువుచేస్తున్నవి.

---

# 8. తూర్పు యూరపు దేశాలలో సమాజవాద వాస్తవికత

"మానవుడు మృత్యువు నెదుర్కొనటానికి సంసిద్ధు డైనప్పుడు గాని అతని జీవితానికి సార్థకత లేదని కొంతకాలం క్రిందట నేను తీర్మానించు కున్నాను. ప్రాణానికి ముప్పు వచ్చినా సరే అని తెగింపు చేసిన మీదటనే నాకు స్వాతంత్ర్యం అనుభవానికి వచ్చింది. ప్రజా జనస్వామ్య దేశాలలో, తన జన్మభూమి శోభకు, సురభిళానికి పరవశుడై గానం చేసే కవి తన శృంఖలాలను త్రెంచుకోవాలంటే ఈ పరిహారం చెల్లించక తప్పదని నాకుతెలుసు. అయితే, ఈ పరిహారం చెల్లించటానికి సమ్మతించని వారిని మాత్రం దుయ్యబట్టరాదు. వారు తమ మాతృభాషలో రచనలు చేయటానికి వీలుండదనీ, వారు రచించిన పుస్తకాలన్నింటినీ గ్రంథాలయాలలోంచి ఏరిపారవేస్తారనీ, వారిపేర్లను దేశద్రోహుల పట్టికలో చేరుస్తారనీ తెలిసినప్పుడు వారందుకు సాహసించటం చాలా కష్టమైనపని."

ఈ మాటలు పోలెండు దేశపు సుప్రసిద్ధకవి, అనువాదకుడు అయిన శ్రీ జెస్లావ్ మిలోజ్ వ్రాసినవి. ఆయన కొంతకాలం కమ్యూనిస్టుప్రభుత్వంతో సహకరించి పని చేశాడు. వాషింగ్టన్‌లోను, పారిస్‌లోను ఆ ప్రభుత్వపు సాంస్కృతికాధికారిగా పనిచేశాడు. అయితే ద్వంద జీవితం అసంభవమని అచిరకాలంలోనే ఆయన గ్రహించాడు. స్వాతంత్ర్యమే ముఖ్యమనుకున్నాడు. పాశ్చాత్య ప్రపంచానికి పలాయనం చిత్తగించాడు. పోలెండ్‌తోసహా తూర్పు యూరపు దేశాలలో ఈవిధంగా తమకు బంధవిమోచనం

కలిగించుకోనక్కర్లేరే వారింకా చాలామంది ఉన్నట్టు అక్కడ ఇటీవల జరిగిన సంఘటనల వల్ల తేలింది. మానవాత్మను కొంతకాలం బంధించి ఉంచవచ్చునేమో కాని, శాశ్వతంగా భంగపరచడం మాత్రం అసాధ్యం.

ఒకొక్కప్పుడు తమకు ఇష్టం లేకపోయినా, పరిస్థితుల ప్రాబల్యం వలన తూర్పు యూరపు దేశాలలోని కొందరు విద్వాంసులు తమపై కత్తిగట్టిన ప్రభుత్వాలతోనే సహకరించి పనిచేయవలసి వచ్చింది. జెకోస్లావాకియాలో శ్రీ ఫ్రాంటిసాక్ హల్లాస్ గాథ ఇలాంటి ఒక విలక్షణ సంఘటన. హల్లాస్ కొంతకాలం జెకోస్లావాకియా కమ్యూనిస్టు ప్రభుత్వ ప్రధానాధికారులలో ఒకడుగా పనిచేశాడు. పిమ్మట ప్రభుత్వ ప్రచురణ సంస్థ డైరెక్టరు జెనరలు అయ్యాడు. ఈ సంస్థ రష్యాలోని ప్రభుత్వ ప్రచురణ సంస్థ వంటిది. జెక్ రచయితల సమ్మేళనానికి అధ్యక్షుడుగా కూడా పనిచేశాడు. ఆయన చనిపోయినప్పుడు ప్రభుత్వాధికారి మర్యాదలతో అంత్యక్రియలు జరిపారు. ఆయన మరణానంతరం వెల్లడిలోకి వచ్చిన ఆయన మనోవేదన విశ్వజనీన ప్రాముఖ్యం గలది. ప్రాపంచిక దృష్ట్యా ఇంచుమించు ఆశలన్నీ ఫలించిన విద్వాంసుడాయన. ఆయన మనోవేదన అయన అంతరాత్మ సంక్షోభానికి నిదర్శనం. ఈ మనోవేదనను వెల్లడించే వ్యాసం 1949 అక్టోబరులో అయన మరణా

నంతరం రహస్యంగా పట్టుకొని వచ్చి ప్రకటించారు. ఈ వ్యాసం ప్రకటితమైన తరువాత, అనగా ఆయన మరణానంతరం, ఆయన "మానసికంగా వికలు డయాడని," "క్షుమార్హంగాని నైరాశ్యానికి" గురి అయ్యాడని కమ్యూనిస్టు పార్టీ ఆయనను అభిశంసించటం వల్ల, అ వ్యాసం ఆయన రచించినదే అన్నమాట ధ్రువపడింది.

కమ్యూనిస్టులు అధికారాన్ని చేజిక్కించుకున్న తరువాత వామపక్ష విద్వాంసులకు ప్రాప్తించిన దుర్గతిని వాల్లాస్ విపులంగా విశదీకరించాడు. ఆయన వాక్యాలలో కొన్ని తప్పక చదవదగినవి:

"మేము కమ్యూనిస్టుల ఉద్యమాలలో ఉత్సాహంగా ప్రత్యక్ష సహకారం చేసినా, మౌనాంగీకారంతో దోహదం చేసినా, వారు అధికారలక్ష్యం వంకకు పురోగమిస్తూనే వచ్చారు. చివరకు సంపూర్ణాధికారం చేజిక్కించుకొన్నారు. మేము లోగడ ఎన్నడు కనివిని ఎరుగని పరిస్థితులలో పడ్డాము. ఈ పరిస్థితులను మేము ముందుగా భావించ గలగట మనేది అసంభవం."

"మేమా పరిస్థితులను అర్థంచేసుకొని చేసుకొనక ముందే చిత్రంగా మాచుట్టూ ఉన్న ప్రపంచమంతా తారుమారై పోయింది. భౌతిక జగత్తేకాదు, భావమయ ప్రపంచం కూడా పూర్తిగా మారిపోయింది. అంతవరకు ఏ విధం

గాను లెక్కలోకి రానివారు, సాంస్కృతిక రంగంలో అసమర్థులు, అమితాశాపరులు అయిన వ్యక్తులు, ఉసిళ్ళ పాతర బద్దలైనట్టు బయటికివచ్చి, అతిముఖ్యమైన ప్రభుత్వ పదవులలోను, ఉద్యోగాలలోను ప్రత్యక్షమయారు. ఉత్తమోత్తములకు అజాపజా లేదు. ఇలాఉండగా అతిదారుణమైన అసందర్భాలు, అసత్యాలు ప్రకటింపబడటం, వేలెత్తి చూపేనాథుడు లేక అమోఘంగా చెలామణి అయిపోతూండటం ప్రారబ్ధమయింది. సత్యానికీ, అసత్యానికి, పండితులకు, పండితమ్మన్యులకు మధ్య అంతరాలన్నీ అంతరించిపోయినట్లు కనిపించింది. వైవిధ్యం, ఔజ్జ్వల్యంగల సంస్కృతిని త్రోసిరాజని, విశ్వసింపరానంత నిస్సారమైన, నీచమైన నీరసమైన దేదో ఆస్థానంలో వెలసింది. ఇంతలో ఇంతమార్పు ఎలా సంభవించిం దంటారేమో! ఆ దారుణ పరిణామాన్ని మేమంతా కళ్ళారా చూస్తూనే ఉన్నాం. దాన్ని అరికట్టటం మా వల్లకానిపని. మేమందరం సోషలిస్టులం అయితే సోషలిజానికి బదులు మాకురాని ఆభాస ఎదురయింది.” అని ఆయన వ్రాశాడు.

వాక్స్వాతంత్ర్యం అన్నా, మృత్యువునోటిలో తల దూర్చటమన్నా ఒకటే అని అంగీకరిస్తే తప్ప ఎవరూ ఎదురు చెప్పలేని దుర్భరపరిస్థితిని కూడా హాల్లాన్ అభివర్ణించినంత విశదంగా ఇంకొకరు వివరించ గలగటం అసంభవం :

"రాజకీయవేత్తలు చేసిన నిర్ణయాలను తు.చ తప్పకుండా అనుసరించని ఒక్క వాక్యం కూడా ఏపత్రికలోను ప్రకటితం కాదు. ఆధోరణిలో మాట్లాడితే వినేజనం లేరు. మాటవరసకు అలాంటి అవకాశం ఉన్నదనుకుందాం: ఒక వ్యక్తి తనకు తోచిన అభిప్రాయాన్ని యథా తథంగా ప్రకటించటానికి ప్రయత్నించా డనుకోండి. తత్ఫలితంగా వెంటనే ఆ వ్యక్తి దేశ ద్రోహిఅనీ, ప్రభుత్వ శత్రువనీ, దుండగీడనీ, శత్రు రాజ్యాలవారి బానిస అనీ, గూఢచారి అనీ ముద్ర వేస్తారు. అతడు తన పైన తానే నేరాలు ఆరోపించుకున్నట్టు తయారు చేసిన అత్యసహ్యాకరమైన, అసందర్భమైన కేవల కల్పిత మైన నేరాలపట్టికను అతడు చదవవలసివస్తుంది. ఈ విధంగా అతడు ఖండింపదలచుకొన్న దురాగతాలను అతని నోటనే సమర్థింప జేసుకుంటుంద ప్రభుత్వం. ఆయన మొదట చెప్పినదంతా అసత్యం కాబోలనే అపోహ కలుగుతుంది. ఆయన తన అభిప్రాయాలను సమర్థించి చెప్పుకునేందుకు అవకాశం ఉండదు. పార్టీ ప్రచురణశాఖ ఆయన మొదట చేసిన విమర్శకు జవాబుగా ఈ సంఘటననే విస్తృతంగా ప్రచారం చేస్తుంది. ఆ సంగతి రచయితలందరికి తెలుసు కనుకనే నోరు మెదపరు."

మానసికమైన భయంవల్ల ప్రచ్ఛన్నోపాయాల వలన ప్రయోజనం కనిపించనప్పుడు కమ్యూనిస్టు ప్రభుత్వం అంత కన్న ప్రత్యక్షమైన మొరటు పద్ధతులకు దిగి, స్వేచ్ఛాపరుడైన

రచయిత తన నిస్పృహాయత తను గ్రహించేటట్టు చేస్తుందని కూడా హల్లాన్ ప్రపంచానికి వివరించాడు :

"సాధారణోపాయాలు విఫలమైన కొద్దీ పార్టీనాయకులు అంతకంతకు దారుణతరమైన దమన విధానాలు అవలంబిస్తారు. అధికార వేషాల్లోవున్న పోలీసుల సంఖ్య సామాన్య వేషాలలో తిరిగే పోలీసులసంఖ్య నానాటికి పెరిగిపోతున్న సంగతి పెద్ద రహస్యమేమీకాదు. అరెస్టైయిన వ్యక్తులు అనుభవించే చిత్రహింసలను గురించి విచారణ లేకుండానే, శిక్షవిధించబడిన వ్యక్తులను గురించి ఖైదులలోను, పోలీసు స్టేషనులలోను పోలీసుల దెబ్బలతో స్మృతితప్పి పడిపోయిన ఖైదీలనుగురించి విచారణ ఇంకా ప్రారంభంకాక ముందే వారికి విధింపవలసిన శిక్షలను సూచిస్తూ పార్టీ కేంద్రకార్యాలయం నుంచి న్యాయస్థానాలకు వచ్చే తాఖీదులను గురించి వినవస్తూన్న దారుణ వార్తల సంఖ్య రోజురోజుకి పెరుతూగుంది."

కమ్యూనిస్టు ప్రభుత్వాల రాకాసితనం, దారుణ దమన విధానం అలాంటిది.

ఇలాంటి పరిస్థితులలో కూడా తూర్పు యూరపు రాజ్యాలలో రచయితలు విదేశీ ప్రభుత్వపు వత్తాసిగల తమ నిరంకుశ పాలకులకు ఎదురుచెప్పటానికి వెనుదీయలేదని యిటీవల హంగరీ, పోలెండ్ దేశాలలో జరిగిన సంఘటనలు

రుజువు చేస్తున్నాయి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం అతి దారుణమైన పరిహారాన్ని చెల్లించవలసిన ముహూర్త మాసన్నమయింది. సందేహించటానికి కూడా వ్యవధిలేదు. "మానవుడు తన ప్రాణాన్ని బలిపెట్టటానికి సిద్ధం కాకపోతే అసలు మానవజీవితమే అర్థంలేకుండా పోతుంది," అని వారు తమ చర్యలతో రుజువుచేయవలసి వచ్చింది. విలియం ఫాక్నర్ వ్రాసిన ఈఅమృతసూక్తి సార్థకత వ్యక్తమయింది.

"మానవత్వం నశిస్తుందంటే నేను ఒప్పుకోలేను.... మానవునికి అపారమైన సహజశక్తి ఉన్నదనీ, కనుక ఎట్టి ప్రళయాలైనా మానవుడు తట్టుకోగలడనీ నావిశ్వాసం. మానవుడు అమరజీవి. ప్రాణికోటి అంతటిలోకి అక్షయమైన వాక్శక్తి కలవాడవటంవల్లనే కాదు, దయాత్యాగ సమాన శీలములుగల విలక్షణమైన ఆత్మ అతనికి ఉంది. ఈ విషయాలను గురించి వ్రాయటమే కవులకు, రచయితలకు విధ్యుక్త ధర్మం. యుగయుగాలుగా మానవచరిత్రను ఉజ్వలంచేస్తూ వచ్చిన శౌర్యసాహసాలను, గౌరవాన్ని, ఆశలను, ఆభిజాత్యమును, దయాదాక్షిణ్యాలను, త్యాగాలను అతనికి పునఃస్మరణకు తేవటంద్వారా మానవాభ్యున్నతికి దోహదంచేయటం రచయితధర్మం."

స్టెట్టిన్ రేవునుండి చైనాసముద్రంవరకు వ్యాపించిన భూభాగమంతట కమ్యూనిస్టులు అసలు జరుపుతున్నా

ఈ భావనా నియమమన, సాంస్కృతిక సంయమన విధానాలే ఇంచుమించు యథాతథంగా తూర్పుయూరపు దేశాలన్నిటిలో అమలుజరుగుతున్నవి. అయితే, పర్యవసానాలు మాత్రం కేవలం అదే తీరులో లేవు. హంగరీ, పోలెండ్ వంటి దేశాలలో పూర్తిగా అణచివేయటానికి సాధ్యంకాని శక్తులు కొన్ని మిగిలిపోయినవి. స్వాతంత్ర్యపిపాసాజ్యోతి అవిచ్ఛిన్నంగా వెలుగుతూనే ఉంది.

ఈ దేశాలు సోవియట్ రష్యాకు అతిసన్నిహితంగా ఉండటం, అచటి పరిస్థితులన్నీ తెలుస్తూ ఉండటం ఈ స్వాతంత్ర్యజ్యోతికి బాగా దోహదకారు లయినవి. పోలెండ్ విషయంలో ఇదిమరింత స్పష్టంగా కనిపిస్తుంది. జెస్లా మెలోవ్ చెప్పినట్టు, పోలెండ్‌లో ప్రజలకు సోవియట్ రష్యాను గురించి చాలా తెలుసు. "ఇంచుమించు పోలెండ్‌లో ప్రతి వ్యక్తికీ రష్యావెట్టిచాకిరీ జైళ్ళలో చనిపోయిన, లేక చచ్చి చెడి బ్రతుకుతూన్న బంధువులో, మిత్రులో ఉన్నారు. కనుక, పోలెండ్‌లో ఎవరికీ సోవియట్ రష్యాను గురించి భ్రాంతులేమీ లేవు. సోవియట్ విధానాల అంతరార్థాలను కో మెస్లర్, ఆర్వెల్ వంటివారు వారికి వేరే వివరించవలసిన పనిలేదు."

సోవియట్ రష్యాలోని సాహిత్యాన్ని గురించి, చిత్రకళను గురించి కూడా వారికి చాలా విషయాలు తెలుసు. ఒకే

అచ్చున పోసినట్టు కనిపించే వారి చిత్రకళ, కవిత్వం, లేక సాహిత్యం అభినందింప దగినవి కాని, అనుసరింప దగినవి కాని కావని వారు సులభంగా గ్రహింపగలిగారు"... "పోలెండ్ ప్రజల భావనను, సంస్కృతిని రష్యా కమ్యూనిస్టుల పద్ధతుల ప్రకారం అదుపులో పెట్టి ఆశాసించాలని చేసిన ప్రయత్నానికి, సంపూర్ణ సాఫల్యానికి చాలా ఎడం ఉండి పోయింది." అని మెలోజ్ ఆశ్చర్యం ప్రకటించాడు.

రష్యాలో క్రెమ్లిన్ అధికారులు బల్గేరియాను మామూలుగా తమ అదుపాజ్ఞలలోని రాష్ట్రంగా భావిస్తారు. అలాంటిది, అక్కడకూడా స్వాతంత్ర్య పిపాస చల్లారలేదు. శ్రీపావెల్ వెఝునోవ్ సోషలిస్టు వాస్తవికత వంచనా ప్రకృతిని వివరిస్తూ ఒక వ్యాసం వ్రాశాడు. "రచయితల సృజనాత్మకస్వేచ్ఛ" అనేశీర్షిక క్రింద 1953 ఏప్రిల్ 7 వ తేదీన "లిటరేటరెన్ ఫ్రంట్" పత్రికలో ప్రకటించిన ఒక వ్యాసంలో ఆయన ఇలా వ్రాశాడు.

"రచయిత తన అభిప్రాయాలలో, తన సాహిత్య మర్యాదలలో, కళారీతులలో తనకే విశ్వాసంలేని వాడై పోతున్నట్టు కనిపిస్తూంది. అందువల్ల అతని శైలి, సృజనాత్మక వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం దెబ్బతింటున్నవి ...... ఈ మార్పంతా ఎక్కడోకాదు. నాలో నాకే కనిపిస్తూంది... రచయితగా నా వ్యక్తిత్వం చాలావరకు నశించింది."

"ఇదే విధంగా నాతోటి రచయితల భిన్న భిన్న వైలక్షణ్యాలన్నీ నశించి పోతున్నాయి. చిత్రంగా మేమంద

రం మాకు తెలియకుండానే ఏదో పెద్ద మందలో కలసి పోతున్నాం."

స్టాలిన్ హయాంలో "మంచు కరుళ్ళయుగం" అనంతరం, బహు ప్రశంసలకు లోనయిన "మధుర పానీయ" యుగంలోనే ఈ వ్యాసం ప్రకటిత మయింది. అయినా, ఈ వ్యాసానికి, ఇట్టి ఇతర విమర్శలకు సమాధానంగా నాటి బల్గేరియా ప్రధానమంత్రి వుల్కో షెర్వెన్కోవ్ ఇలా ప్రకటించాడు:

"కమ్యూనిస్టు పార్టీ ఏవిధమైన విమర్శను ఆమోదించదు. కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాల ప్రకారం స్వాతంత్ర్యం అనేది అరాజకవాదులు చెప్పేటంత అప్రతిహత మయిన పరిపూర్ణ భావం కాదు... సంపూర్ణ స్వాతంత్ర్య మనేది అసలు లేనే లేదు... మనను బలపరిచే విమర్శకు మాత్రం మనం సమ్మతిస్తాము. మనను తూలనాడే విమర్శను సహించము."

ఈ హెచ్చరిక 1955 డిశెంబరు 20 వ తేదీన బల్గేరియా రచయితల సమ్మేళనంలోని కమ్యూనిస్టు పార్టీ ముఠా రహస్య సమావేశంలో ప్రధానమంత్రి చేసిన ప్రసంగంలోనిది. ఈ హెచ్చరికనే తరువాత 1956 ఫిబ్రవరి 2 వ తేదీన రేడియో సోఫియా ప్రసారం చేసింది. కనుక 'మంచుకరుడు' రోజులకు 'మధుర పానీయ'పు రోజులకు గల వ్యత్యాసం ఎంత అల్పమైనదో దీనివల్ల బోధపడుతుంది.

ప్రజల భావాలను, విశ్వాసాలను తారుమారు చేయటానికి కమ్యూనిస్టులు చేసిన విఫల ప్రయత్నాలలోకెల్ల దారుణమైనది హంగరీలో సంఘటిల్లింది. ఏ రచయిత సాహిత్య జీవనానికైనా స్వయంగా మంగళం పాడే శక్తి గలిగిన రచయితల సమ్మేళనాన్ని తమ చెప్పు చేతలలో ఉంచుకొనటంతో తృప్తి చెందక, ప్రచురణ కర్తలకు తమ ఇష్టానుసారం కాగితం సప్లయి చేసే అధికారం కూడా వారు తమ చేతులలో ఉంచుకున్నారు. ఇన్ని ప్రబలమైన అయుధాలను గురిపెట్టుకొని కూచున్నా కమ్యూనిస్టులకు హితవుకాని సాహిత్య ప్రచురణ ఎడతెగకుండా సాగుతూనే వచ్చింది. కమ్యూనిస్టు పార్టి పత్రిక జాబాద్ నేప్ (బుడపెస్ట్) 1948 ఏప్రిల్‌లోనే ప్రచురణ కర్తలందరికీ చేసిన తీవ్రమయిన హెచ్చరిక వలన ఈ విషయం వెల్లడి అయింది. "ప్రజలకు విధేయులై ఉండటంలో సంశయాస్పదులైన రచయితల గ్రంథాలను ప్రకటించటం కేవలం మూర్ఖత్వం, అత్యంత ప్రమాదకరమైన సాహసం" అని ఆ పత్రిక వ్రాసింది. "ప్రజలకు విధేయులై" ఉండట మనగా కమ్యూనిస్టులకు తాబేదారులై ఉండటమే అన్నసంగతి వేరే చెప్పనక్కర లేదనుకుంటాను.

ఈ హెచ్చరిక వెలువడిన తరువాత కొన్ని నెలలకు బల్గేరియా రాజకీయాక్రమణ పూర్తిఅయింది. వెంటనే పగటిని వెన్నంటి వచ్చే రాత్రిలాగ సాహిత్యమారణ

హోమం ప్రారబ్ధ మయింది. ఈ విషయాన్ని ధ్రువపరచ టానికి నోబెల్ బహుమానం పొందిన హంగరీ ప్రముఖ రచయిత ఫెరీన్ కొర్మాండీ అంతటివాని అభివర్ణన మొత్తు బరి సాక్ష్యంగా మనకు లభిస్తూంది. "ఆ సాహిత్య హత్యా కాండలో కమ్యూనిస్టులకు విధేయులుకాని రచయితల గొంతుకలు నొక్కివేశారు. కమ్యూనిస్టుల ముందు చేతులు నలపని వందలకొలది హంగరీ రచయితల గ్రంథాలను విదే శీయుల రచనలను నిషేధిస్తూ కాలపట్టికలో ప్రకటించారు. పార్టీ జట్లు ప్రతి గ్రంథాలయానికి, పుస్తక విక్రయశాలకు వెళ్ళి నిషిద్ధ గ్రంథాలన్నిటినీ తొలగించివేశారు. "పార్టీ ఆదేశానుసారం పునరుజ్జీవితమైన మన వాఙ్మయంలోంచి బూర్జువా చిహ్నాలన్నిటినీ తుడిచివేశాం. వాటి స్థానంలో సమాజవాద వాస్తవికతను ప్రతిష్ఠించాం" అంటూ 1951 లో జరిగిన రచయితల సమ్మేళనంలో హంగరీ విద్యామంత్రి జోసెఫ్ దర్వాక్ సిగ్గులేకుండా చెప్పగలిగేటంత విస్తృతంగా ఈ దారుణ దమనకాండ సాగింది.

ఆ సమావేశంలోనే నాటి ప్రజా సంస్కృతి శాఖా మంత్రి శ్రీ జోసెఫ్ రెవామ్ అత్యుత్సాహంతో ఇలా ప్రక టించాడు: "పార్టీ నిర్విరామ కృషి ఫలితంగా...హంగరీ సాహిత్యం నేడు సజీవమైన కమ్యూనిస్టుపార్టీ సాహిత్యంగా రూపొందింది. నిజానికి పార్టీ సాహిత్యమే కార్మికవర్గ సాంస్కృతికాధిపత్యాన్ని సాధించ గలదు."

పాప మీ పాలకులు చాలా భ్రాంతి పడ్డారు. ఆత్మ సంతృప్తి కరములైన ఈ ప్రవచనాలన్నీ వారి ఆశాగానాలే గాని, సఫలీకృత యత్నాలు కాలేదు. నియమిత స్వాతంత్ర్య దశానంతరం వెనువెంటనే వారి పార్టీ పత్రిక జాబాద్ నేప్ 1954 మార్చి 15 వ తేదీ సంచికలో, "ప్రజా శత్రువులు, బాధ్యత ఎరుగక వారి వలల్లో పడేవారు సాహిత్య స్వాతంత్ర్యాన్ని అతిక్రమిస్తూ, దుర్వినియోగం చేస్తూఉంటే" పార్టీ ఏంతమాత్రం సహించదని తీవ్రంగా హెచ్చరించటంతో ఈ విషయం తేలిపోయింది.

ఈ హెచ్చరికను కూడా ఎవరూ అట్టే లక్ష్యపెట్ట లేదన్న సంగతి హంగరీ (కమ్యూనిస్టు) పార్టీ కేంద్ర సంఘ సమావేశంలో (1955 డిసెంబరు 15 న) ఆమోదింప బడి, ఇరోదాల్మీ ఉజెసాప్‌లో ప్రకటితమైన ఒక తీర్మానంవల్ల మనకు బోధపడుతుంది. అంతేకాదు. నవంబరు 10 వ తేదీన రచయితల సమ్మేళనం రహస్య సమావేశంలో చేసిన ఒక తీర్మానం ఈ విషయాన్ని ఇంకా విశదీకరిస్తుంది. "కొందరు రచయితలు పార్టీకి, ప్రజల ప్రజాస్వామ్యానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిపారు... ఆ అవకాశాన్ని పురస్కరించుకొని నాటి పరిస్థితిని గురించి, కార్మిక కర్షకుల జీవనస్థితిని గురించి తీవ్రంగా బూర్జువాల ధోరణిలో విమర్శించారు. విమర్శ పేరుతో పార్టీ ప్రముఖ నాయకుల మీద్, ప్రభుత్వాధికారుల

మీద దుమ్మెత్తి పోశారు. సాహిత్యానికి పార్టీ మార్గదర్శ కత్వావశ్యకతను, ఔచిత్యాన్ని ఆమోదించటానికి నిరాక రించారు." కొందరు రచయితలు "కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘంవారి రాజకీయ, సాంస్కృతిక కార్యక్రమాలను" అధి క్షేపిస్తూ ఒక నివేదిక తయారుచేశారు. నేడు చాలా నాగ రక దేశాలలో యుద్ధకాలంలో కూడా అంతరాత్మ స్వాతం త్ర్యాన్ని అంగీకరిస్తున్నారు. ఏ ఉద్యోగిగాని తనఅంత రాత్మ ప్రబోధాలకు విరుద్ధమైన ఔద్యోగిక విధులను నిర్వ హించటం తనకు అసంభవమనుకుంటే, వెంటనే ఆ ఉద్యో గానికి రాజీనామా ఇచ్చివేయ గలగటం అంతరాత్మ స్వాతంత్ర్యానికి ప్రాథమిక చిహ్నం. కమ్యూనిస్టు దేశా లలో మాత్రం ఇదికూడా దేశద్రోహంగా పరిగణిస్తారు. ఉదాహరణకు, హంగరీ రచయితల సమ్మేళనం కార్యవర్గ సభ్యులలో కొందరు రాజీనామా ఇచ్చినప్పుడు వారు శత్రు కోటికి చెందిన వారనీ, విప్లవ వ్యతిరేకులనీ, మామూలు ప్రకారం "పార్టీ శిక్షణలో ప్రాథమిక నియమాలను ఉల్లంఘిం చారు" అని ఆరోపించారు.

పార్టీ శిక్షణకు కేంద్రసంఘంవారు ఏర్పరచిన ఆ నిబంధ నల సారం ఇది:

1 కమ్యూనిస్టు రచయితలు పార్టీకి సంబంధించిన సైద్ధాంతిక, రాజకీయ, సాధారణ కార్యక్రమాలలో శ్రద్ధగా పాల్గొనేటట్లు చెయ్యాలి,

2. శత్రువులు సూచించే, దుష్టరాజకీయాభిప్రాయాలను ప్రతిఘటించాలి. "దిగువతరగతి బూర్జువా భావాలను" ఖండించి, తుడిచిపెట్టటానికి పటిష్ఠమైన ఉద్యమం ప్రారంభించాలి.

3. సాహిత్యవిమర్శ స్థాయిని పెంచాలి. సమాజవాదవ్యవస్థా నిర్మాణంలో మహత్తర, నూతన విజయాలు సాధించేందుకు ప్రజలను ప్రోత్సహించే విధంగా, కార్మిక కర్షక జీవితంతో సంబంధంగల గ్రంథాల రచనకు దోహదం చెయ్యాలి.

4. రచయితల సమ్మేళనంలో పార్టీ శిక్షణను బలహీనపరచగల జుగుప్సాకర భావాలన్నిటినీ తుడిచిపెట్టాలి. రచయితలలో పార్టీ ప్రతికూలాందోళనకు సంబంధించిన విషయమంతటినీ గురించి రచయితల సమ్మేళనం విచారణ జరిపించాలి.

5. సాహిత్యంలో పార్టీ మార్గదర్శకత్వానికి సంబంధించిన ప్రత్యక్ష సమస్యలను పరిష్కరించటానికి, 'సమాజవాద వాస్తవికతా విధానాభ్యుదయ సాధనకు కమ్యూనిస్టు రచయితల సహాయంతో, ఇతర రచయితల సహకారంతో కృషిచేయటం పార్టీ కేంద్రసంఘం విధి. "దక్షిణపక్షదౌష్ట్యాలను" ఎదుర్కొనేందుకు రచయితలు చేసే కృషిని పటిష్ఠం చేయటానికి గాను కేంద్రసంఘం పార్టీని సమాయత్త

పరచి, "ప్రజోపయోగకరమైన, సమాజవాద ద్రోహద కర మైన, కమ్యూనిస్టుపార్టీ సాహిత్యాన్ని వృద్ధిచేయటమనే మహోద్యమాన్ని" సఫలం చేయాలి.

ఇది విస్తృతమైన ప్రణాళికే; సందేహంలేదు. కాని, హంగరీ రచయితలు ఇంకా గట్టివారు. స్వాతంత్ర్యం కోసం వారు ఏవిధమైన త్యాగాలైనా చేయటానికి సిద్ధమయారు. అందువల్ల, సాహిత్యంలో పార్టీ వాద స్థాపనోద్యమం హంగ రీలో ఆట్టేముందుకు సాగలేక పోయింది. అయితే, దాన్ని ప్రతిఘటించటంలో మాత్రం చాలామంది రచయితలు దారుణ పర్యవసానాలు అనుభవించవలసి వచ్చింది. వారి స్వాతంత్ర్య కాంక్ష మాత్రం నానాటికి వృద్ధిఅయి చివరికి విప్లవరూపం దాల్చింది. అయితే, కమ్యూనిస్టులు అయిన దాన్ని, కాని దాన్ని 'ప్రజావిప్లవ' మంటూ ఆమాటను అపవిత్రం చేయటంవల్ల ఈ నిజమైన ప్రజావిప్లవానికి ఆ మాటను వాడటంకూడా తప్పేమో!

సమాజవాద వాస్తవికతను అంత దృఢసంకల్పంతో నిరాకరిస్తూ, ఆతీర్మానం ఆమోదించటంలో వారిఅభిప్రాయ మేమిటో తెలుసుకుందాం.

హంగరీరచయితల సమ్మేళనం ఉపాధ్యక్షుడు శ్రీ గహోహే ఈ విషయాన్ని అనితర సాధ్యమైన విలక్షణశైలిలో ఈ విధంగా వివరించాడు.

"రచయితలకు అనియతమైన స్వాతంత్ర్యం అవసరం. తాను నమ్మిన విషయం చెప్పటానికి, ఏ వ్యక్తినైనా ఏ విషయాన్నైనా విమర్శించటానికి, ప్రేమించటానికి, మృత్యువును గురించి ధ్యానించటానికి, తన గ్రంథంలో వెలుగు నీడలు సమపాళంలో అమరినదీ లేనిదీ సరిచూచుకొనటానికి, సర్వశక్తిమంతుడైన భగవానుడు ఉన్నాడని విశ్వసించటానికి, లేక లేడని నమ్మటానికి, ప్రభుత్వ ప్రణాళికలోని అంకెలు సక్రమమైనవి కావేమో అని సంశయించటానికి, మార్క్స్ భావాలకు భిన్నంగా యోచించటానికి, ఆ భావాలలో ఇంతవరకు సత్యాలుగా రుజువుకాని భావాలను కూడా విశ్వసిస్తూ ఆధోరణిలోనే యోచించటానికి, జీవనస్థాయి-జీతాలు పెంచాలని ఎన్నడు అలజడి చేయని వారి జీవన స్థాయితో సహా-తక్కువగా ఉన్నదనుకొనటానికి, అధికారులు న్యాయమైనవని గట్టిగా వాదించే వాటిలోకూడా అన్యాయమైనవి వున్నాయని భావించటానికి, కొందరు నాయకులంటే ఇష్టపడక పోవటానికి, రాజకీయ ఆర్థిక నాయకులు అక్రమమైనవిగా భావించే క్లేశాలను తరించటానికి తగిన ఉపాయాలు సూచించటానికి, (పిమ్మట కొన్నాళ్ళకు ఆ రచయిత సూచనలుకూడా సక్రమమైనవి కావని తేలినాసరే.) క్లిష్టసమస్యలకు తగిన పరిష్కార మార్గాలు సూచించలేక పోయినా వాటిని అభివర్ణించటానికి, జాతీయ స్మారక చిహ్నంగా ప్రక

ట్టించిన భవనం ఏదైనా వికృతంగా ఉంటే దానికోసం లక్షలు కోట్లు ఖర్చయినాసరే ఆమాట అనుకోవటానికి, భవనాలను మరమ్మత్తు చేయించేందుకు డబ్బు లేకపోవటంవల్ల నగరం నాశనమై పోతున్నదని భావించటానికి, నాయకులలో కొందరి ప్రవర్తనల్ని, వాగ్ధోరణిని, చేష్టలను విరసించటానికి, అమానుష పరిస్థితులేవీ సామాన్యుల దృష్టికి కనిపించని సమయంలో కూడా మానవజాతి శ్రేయస్సుకోసం కృషిచేయటానికి, స్టాలిన్ సిద్ధాంతాలను విశ్వసించటానికి, విశ్వసించకపోవటానికి, రచనలో అసాధారణ ధోరణులు అవలంబించటానికి, అరిస్టాటిల్ నాటక లక్షణాలను ఖండించటానికి, వాటినే తు.చ తప్పకుండా అనుసరించటానికి, ప్రముఖ రచయితలు ఇతర రచయితలకు పెట్టిన ఒరవడులు బాగాలేవనుకొనటానికి, పైపెచ్చు వాటిని సాహిత్య మర్యాదలననుసరించి విమర్శించటానికి, ఇంకా ఇలాంటి స్వాతంత్ర్యాలన్నీ రచయితలకు ఉండాలి. ఇటీవల ఈ స్వాతంత్ర్యంలో చాలా భాగం నిషిద్ధమనీ, కనీసం ఆచరణలో శిక్షార్హమైన అపరాధంగా పరిగణిస్తున్నారనీ నేడు ఎక్కడైనా అలాంటిది కనిపించినా కేవలం జాలితలచి సహిస్తున్నారనీ చెపితే కాదనేవారు ఎవరున్నారు ? ఇతర విషయాలన్నిటితో పాటు ఆ స్వాతంత్ర్యాన్ని సామాన్య మానవ ధర్మంగా ఒప్పుకొనటం మాత్రం శూన్యం. ఈ

స్వాతంత్ర్యాన్నే రచయితలమైన మనమందరం ఏ విధమైన కష్టనష్టాలకైనా లెక్క చేయకుండా సంరక్షించుకోవాలి."

ఇది ఒక ఆశయ నిర్వచనం. లక్ష్యవివరణ. ప్రపంచ మానవ సామరస్యం సాధింపగోరి కలం పట్టినవారు, కేవలం అది ఒక వృత్తిగా కలం చేపట్టినవారు కూడా ఈ ప్రమాణం చేసి, దానికి కట్టుబడి ఉండటం అవసరం.

హంగరీ రచయితల సమ్మేళనం అధ్యక్షుడు పీటర్ వీర్స్ కూడా ఇంచుమించు ఇదే ధోరణిలో ప్రకటించాడు.

"ప్రజాస్వామ్య పరిణామంలో ప్రథమ సోపానం ఇది: పార్టీకి చెందిన పౌరులు, రచయితలు తాము ఆమోదింప లేని విషయాలను కూడా ప్రశంసించ వలసి రాకూడదు: ఎవరినైనా ఆవిధంగా నిర్బంధించటం మానవులపట్ల అన్యాయం, అపచారం. రచయితలు ఆ విధంగా వ్రాయా లని నిర్బంధించటం వారిని బలవంతంగా మానసిక వ్యాధి గ్రస్తులను చేయటం. రచయిత బ్రతుకు, వృత్తి అతడు తాను దర్శించిన సత్యాన్ని వివరించటంమీద నే ఆధారపడిఉన్నాయి. (సత్యాన్ని ప్రకటించలేని రచయిత కేవలం బానిస, పొట్ట కూటికోసం కాగితాలు నలుపుచేసే కూలివాడు)......కవి గాని, మరే రచయితగాని సర్వవిషయాలను గురించి వ్రాయ వచ్చునని నా మతం. వాస్తవంగా సర్వవిషయాలూ అనే నేనంటున్నది. ప్రేమను గురించి, ప్రకృతిశోభలను గురించి,

రాజకీయాలను గురించి, సర్వాన్నిగురించి వ్రాయవచ్చు. ఓడిపస్ కథలో మాతాపుత్ర పరిణయాన్ని గురించి, ఆతల్లి నిర్వేదాన్ని గురించేకాదు, జాతీయ సంతాపాలను గురించి కూడా వ్రాసుకోవచ్చు. సహజప్రవృత్తులను గురించి, మానవాత్మను గురించి, మనం కేవలం ఊహించే విశ్వ సమస్యలను గురించి, సాంఘిక జీవితంలో మానవుని దుఃఖాలను గురించి, ఎక్కడైనా కనిపిస్తే అందలి అందచందాలను గురించి కూడా వ్రాయవచ్చు. ఈ విషయం తెలిసిన వ్యక్తికి సర్వం సులభమవుతుంది. ఏమైనా సద్రచనలే చివరకు మిగిలేవి. వాటిలోని వస్తువులకుగాని, ఆశయాలకుగాని పెద్దవిలువలేదు. అబద్ధాలు వ్రాయవచ్చు. నీరస రచనలు చేయవచ్చు. సమాజవాదాన్ని గురించేకాదు, తనదేశాన్ని గురించి, ప్రేమనుగురించి, వికసిస్తూన్న పూలనుగురించి, తనకవితా ప్రసవవేదనను గురించి కూడా నిపుణమైన పద్యరచన చేయవచ్చు.”

ఈ వాక్యాలు హంగరీరచయితల సమ్మేళనం సమావేశంలో చేసిన ఒక ప్రసంగంలోనివి. ఈ ప్రసంగానంతరం రెండునెలలకే ప్రెంచి విప్లవానికిగాని, మానవజగత్తులో జరిగిన అత్యంత దారుణమైన మరియే సంఘటనకుగాని ఎంత మాత్రం తీసిపోని పెద్దతుపాను రేగి హంగరీని ఉద్రూతలూచింది.

ఈ రచనా స్వాతంత్ర్య వాంఛలు సమాజవాద వాస్తవికతా వ్యవస్థలో ఎన్నడు సఫలం కాజాలవని మనకు తెలుసు. కనుకనే అచటినుండి మరో అడుగు ముందుకు వేస్తే అదే ప్రభుత్వం మీద బహిరంగంగా తిరుగుబాటు అయింది. హంగరీ రచయితలు తమ జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా తమ స్వాతంత్ర్య రక్షణ కోసం చేసిన త్యాగాలు ప్రపంచంలో సర్వత్ర ఆర్జవము, అంతర్దృష్టి గల వారందరికీ శాశ్వత ప్రోత్సాహ హేతువులుగా నిలచి ఉంటవి. స్వాతంత్ర్యాన్ని కాపాడటం కోసం వారిలో చాలామంది నశించి పోయారు.

మానవులు ఈ విధంగా దురాగతాలను పేరబెట్టుకొని, పేరబెట్టుకొని–చివరకు మృత్యువో, నిత్యదాస్యమో తప్ప గత్యంతరం లేని స్థితిని అసలు ఎందుకు తెచ్చిపెట్టుకోవాలి? సామాన్య ప్రజలలో ఈ అలసత్వం, నిర్లక్ష్యభావం ఉంటే క్షమించవచ్చు. రచయితలలో ఉండటం దుస్సహం. రచయితల పైన వారి వృత్తి గౌరవానికి తుల్యమైన ఉదాత్త బాధ్యతకూడా ఉంది. కనుక, వారు తెలిసిగాని, తెలియకగాని, అట్టి కుట్రకు దోహదం చేసే యెడల, కుట్రలో ప్రత్యక్షంగా పాల్గొనే వారితో సమంగా ఆ పాపానికి భాగస్వాములు కాకతప్పదు.

---